ఆంధ్రజ్యోతి

ప్రచురణ

www.navyaweekly.com

mohan
PUBLICATIONS

# నవ్య
వీక్లి

14-12-2016
₹:20

- సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్ ప్రారంభం
- శంకరాభరణం రాజ్యలక్ష్మి ఇంటర్వ్యూ

# ఆ భయం ఇప్పటికీ ఉంది -రెజీనా

**ఆ అమ్మాయి చిన్నతనంలో మానసిక నిపుణురాలు కావాలని కలలు కంది. కానీ మనసులు దోచే పనిలో పడిపోయింది. చదువుకునే రోజుల్లో ఇటాలియన్ భాష నేర్చుకోవాలనుకుంది. దాన్ని పక్కన పెట్టేసి తెలుగు, హిందీ నేర్చుకోవడం మొదలెట్టింది.. అల్లరి బాగా చేస్తుంది కానీ అబద్ధాలు చెప్పదు. మాటలు పొదుపుగా వాడుతూ మౌనంగా ఉందామనుకుంటుంది కానీ ఒక్క క్షణం కూడా నోరు మూతపడదు...ఇవన్నీ ఎవరి క్వాలిటీలో అర్థమయ్యే ఉంటుంది. కోలీవుడ్ చిన్నది రెజీనా కసాండ్రా. ఆమె చిన్నతనం ముచ్చట్లు, చిలిపి చేష్టలు ఆమె మాటల్లోనే....**

### చిన్నతనంలో...

చిన్నతనంలోనే కాదు ఇప్పుడు కూడా మాట్లాడకుండా ఉండలేను. ఆ ఒక్కటీ చేతకాదు. స్కూల్లో మేం ఆరుగురం స్నేహితులం. అందరం మానసిక నిపుణులు కావాలనుకున్నాం. అందుకు తగినట్లే బిఏ సైకాలజీ చేశాను. నేను మధ్యలో వచ్చేశాను. మిగతా వారందరూ వేర్వేరు ప్రదేశాలలో సెటిల్ అయ్యారు. చదువుకునే రోజుల్లో ఇటాలియన్ నేర్చుకోవాలనుకున్నాను. కానీ కుదరలేదు. తెలుగు మాత్రం నేర్చుకున్నాను. ఇప్పుడు బాలీవుడ్‌లో సినిమా కోసం హిందీ నేర్చుకుంటున్నాను.

### ఎప్పుడూ జ్ఞాపకానికి వచ్చేది...

మొట్టమొదటి సారి స్కూల్ వార్షికోత్సవంలో భరతమాత వేషం వేసి నీలం రంగు చీర కట్టాను. ఆ జ్ఞాపకం ఇప్పటికీ పదిలంగానే ఉండిపోయింది.

### అమ్మంటే భయం

ఆ భయం ఇప్పటికీ ఉంది. ఇంట్లో తను మహా స్ట్రిక్ట్. అంతా డిసిప్లిన్‌గా ఉండాలని అనుకుంటుంది. నేను మాత్రం ఇంట్లో అమ్మ చెప్పింది వింటున్నట్లు నటించేదాన్ని. బయటకి వస్తే నేనూ, మా ఫ్రెండ్స్ అల్లరి మామూలే! అమ్మ ఏ పని చేయొద్దన్నా దానికి వ్యతిరేకంగా చేయడమే! అందుకు ఫలితం తన్నులు. చిన్నతనంలో ఎన్ని తన్నులు తిన్నానో లెక్కలేదు. ఒక్కోసారి నా అల్లరికి అమ్మకి విసుగొచ్చేది. అమ్మతో అబద్ధాలు చెప్పడం ఇప్పటికీ రాదు. ఏ విషయం అయినా సరే అమ్మ దగ్గర ఒప్పేసుకుంటాను. ఆఖరికి డ్రింక్స్ తీసుకున్నా సరే! చివరకి నా పరిస్థితిని తాను అర్థం చేసుకుంటుంది.

### చాలా నేర్చుకున్నాను...

దక్షిణాది సినిమాలు నాకు చాలా నేర్పాయి. ఏది మంచి ఏది చెడూ అనేది నేర్చుకున్నాను. ప్రతికూల పరిస్థితులను ఎలా ఎదుర్కోవాలో తెలుసుకున్నాను. నా విషయంలో అన్నీ సరైన సమయానికే జరిగాయి. బాలీవుడ్‌లో సినిమా కూడా కరెక్ట్ టైముకే చేస్తున్నానని అనుకుంటున్నాను.

### హిందీ సినిమా గురించి...

బాలీవుడ్‌లో ఒక్క సినిమా అన్నా చేయాలన్నది దక్షిణాదిలో చాలా మంది తారల కోరిక. కాకపోతే ఎవరూ అంత త్వరగా బయటపడరు. నాకు ఆ కోరిక హీరోయిన్ అయినప్పటి నుంచీ ఉంది. అది ఇంత త్వరగా తీరుతుందని అనుకోలేదు. నా మొదటి సినిమాలోనే సీనియర్ నటులతో చేయడం ఆనందంగా ఉంది.

### భాషతో ఇబ్బంది

కొద్దిగా ఉంది. దక్షిణాది యాసతో హిందీ మాట్లాడగలను. బాలీవుడ్‌లో మాట్లాడినట్లు రాదు. నా మొదటి సినిమా 'ఆంఖే 2' మొదలు కావడానికి ఇంకా టైముంది. ఈలోపల నేర్చుకుంటాను.

### ఖాళీగా...

చిన్నతనం నుంచీ ఎప్పుడూ ఖాళీగా లేను. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూ ఉండడం నాకు అలవాటు. గత ఆరునెలలుగా రెజీనా ఖాళీగా ఉందని అందరూ అనుకుంటున్నారు కానీ ఖాళీగా లేను. మధ్యలో తమిళ సినిమా కథలు విన్నాను. 'నక్షత్రం' షూటింగ్‌కి హాజరయ్యాను. ఓ పక్క హిందీ నేర్చుకుంటున్నాను. ఒక్కోసారి సినిమాల్లో నా బిజీ షెడ్యూల్ చూసి నాకే విసుగనిపిస్తుంది. కానీ, వాటివల్ల వస్తున్న పేరు చూసి ఆ విసుగుని మరిచిపోతుంటాను.

### సేవా కార్యక్రమాలంటే...

మూడు స్వచ్ఛంద సంస్థలకు వీలు దొరికినప్పుడల్లా నా సేవలు అందిస్తూ ఉంటాను. అందులో ఒకటి మా ఫ్రెండ్సందరూ కలిసి రన్ చేస్తున్నారు. మరొకటి చిన్న పిల్లల్లో క్రీడా నైపుణ్యం కోసం నిర్వహిస్తున్న సంస్థ. మూడోది ఓ దివ్యాంగుడు నిర్వహిస్తున్న సంస్థ.

-కె.రామకృష్ణ

## నవ్య వీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కొంటికి) | : | రూ. 5,000 |

### కథ: నిబంధనలు

A కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.

A ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.

A కథలు అరటావు సైజులో *10* పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది *6* పేజీలకు మించరాదు.

A కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లీ - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.

A విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy.com)కి పంపగలరు.

A బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.

A పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లీ' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.

A కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

M £ ‚ $
‡ ˘ ‡—Ł flŁ
$flØ—Ł *
flŁ¯ —Ł ¯ M ˇ
B {«§ gZ¯
…˝z V
·°ˇs fl . 76,
˘ły fl 70
A Ł –

### కథలు చేరవలసిన ఆఖరు తేది

# 31 జనవరి 2017




8

## ప్రవేశం నిషిద్ధం

కొన్ని ప్రదేశాలకు వెళ్ళాలంటే భయంగా ఉంటుంది. మరికొన్ని చోట్లకు వెళ్ళాలంటే పరిస్థితులు అనుకూలించవు. మరికొన్నింటికి ప్రత్యేక అనుమతులు లేనిదే చూసే అవకాశమే ఉండదు. ఇలా చూడటానికి అవకాశం లేని ఎన్నో ప్రదేశాల గురించి చదివేసేయండి.

44

### 'రాశి'పెట్టిన దాంపత్యాలు

కోట్లు ఖర్చుపెట్టి పెళ్ళి చేసినా, అబ్బాయి, అమ్మాయి రాశులు కలవకపోతే ఆ బంధం కలకాలం నిలవదనేది ఇప్పటికీ చాలామందికి చెక్కుచెదరని విశ్వాసం. మరి ఏ రాశులు కలిస్తే ఆ జోడి దాంపత్యం బాగుంటుందో ఆ వివరాలు...

72

### ఇంటర్వ్యూ

సినిమా పేరునే ఇంటిపేరుగా మార్చుకున్న నటి శంకరాభరణం రాజ్యలక్ష్మి. కాలానుగుణంగా సినీ పరిశ్రమలో వస్తున్న మార్పులు ఎంతో బాగున్నాయంటున్న ఆమె ఇంటర్వ్యూ.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: సమంత
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### జ్ఞాపకాలు

డెబ్బయి ఏళ్ళ వయసులో తను చదువుకున్న కాలేజీనీ, దాని పక్కనే ఉన్న హాస్టల్‌నీ చూడాలని పించింది అతనికి. చేతికర్రసాయంతో అడుగులో అడుగు వేసుకుంటూ కాలేజీకి వచ్చాడు. చూశాడు దాన్ని. తర్వాత పక్కనే ఉన్న హాస్టల్ వైపుగా నడి చాడు. తలుపులు మూసి ఉన్న రూమ్‌నెంబర్ 36ని చూశాడు. ఒకప్పుడు తను ఉన్న రూం! ఇప్పుడు ఎలా ఉందో చూడాలనిపించిందతనికి. తలుపు కొట్టాడు. తెరుచుకుంది.

"ఎవరు కావాలండీ?" అడిగాడు లోపల ఉన్న అబ్బాయి.

"ఏభైఏళ్ళ క్రితం నేను ఈ రూంలో ఉండి, ఆ కాలే జీలో చదువుకున్నాను. ఆ రోజులు తలచు కుంటూ ఆ కాలేజీని, ఈ రూంనీ చూడాలనిపించింది. వచ్చాను." అన్నాడతను. అబ్బాయి పర్మిషన్ తీసుకోకుం డానే రూం లోనికి ప్రవేశించాడు. రూంలో ప్రతి అంగుళాన్నీ పరిశీలించి ఆనందించాడు.

తీపిజ్ఞాపకాలను గుర్తు చేసుకున్నాడు.

"అదే పాతరూం. అదే పాత కర్ర టేబుల్. అదే ఫ్యాను. అదే రెక్కలు లేని కిటికీ. అదే మంచం. అదే పరుపు." అన్నాడతను. మంచం మీద కూర్చో బోయాడు. అంతలో చేతిలోని కర్ర జారి కింద పడింది. దానిని తీసుకునేందుకు వంగాడతను. అలా వంగినప్పుడు, మంచం కింద దాగున్న అమ్మా యిని చూశాడు. అతను అమ్మాయిని చూశాడన్నది అబ్బాయి గ్రహించాడు. చెప్పాడిలా.

"మీరు ఏదేదో ఊహించుకోకండి. ఆ అమ్మాయి మా కజిన్. పాపం ఇందాక చెవిరింగు పారేసుకుంది. దాన్ని వెతుక్కుంటూ మంచం కింద దూరింది, అంతే."

"అదే పాతకథ" అన్నాడతను.

### షూట్

ఆ భార్యాభర్తలిద్దరూ ఆఫ్రికన్ సఫారీని సందర్శి స్తున్నారు. భార్య మీదికి హఠాత్తుగా సింహం దాడి చేసింది. 'షూట్ చెయ్! షూట్ చెయ్య'ంటూ భార్య ఒకటే గోల చేయసాగింది. దానికి భర్తగారిలా జవాబిచ్చారు.

"తొందరపడకు! చెయ్యడానికే ప్రయత్నిస్తు న్నాను, కెమెరాలో బ్యాటరీ ఛేంజ్ చేస్తున్నాను."

### వివాహితుడు

అతను ఓ ఫ్యాక్టరీ కొనుగోలు చేశాడు. అందులో ఉద్యోగం చేసేందుకు వివాహితులైన పురుషులే కావా లని ప్రకటించాడు.

"అదేంటది? పెళ్లయిన మగాళ్ళ ప్రత్యేకతేంటి?" అడిగారు స్నేహితులు.

"ప్రత్యేకతేంటి అంటే... పెళ్ళయిన మగాళ్ళయితే అన్నిట్లోనూ వినయంగానూ, ఓర్పుతోనూ ఉంటారు." అన్నాడతను.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 41
14-12-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# ఒకరికి ఒకరు

ఎవరికి పుట్టిందో, ఎప్పుడు పుట్టిందో తెలియదుగాని, కమలంటే ఆ మారుమూల బీచ్‌లో అందరికీ చాలా ఇష్టం. బెలూన్లు అమ్ముకునే బాలరాజుకీ, శంఖాలు అమ్ముకునే గంగరాజుకీ, బొండాలు అమ్ముకునే బుచ్చిబాబుకీ, బఠానీలు అమ్ముకునే పెద్దబాబుకీ... అందరికీ మహా ఇష్టం. కెమెరా కమలంటే చాలు! సముద్రంలో ఎగిరిపడే అలల దగ్గర నుంచీ బీచ్‌లో తుళ్ళిపడే ఇసుకరేణువు వరకూ అందరికీ ఆనందమే! కళ్ళకి కాటుక, చెవులకి జుంకాలు, మెళ్ళో శంఖాలు, చేతులకి గాజులు, కాళ్ళకి పట్టీలు పెట్టుకుని సూర్యోదయం కంటే ముందే బీచ్‌లో ప్రత్యక్షమవుతుంది కమల. చేతిలో కెమెరా, మాటలో మంచితనం దాచుకుని బీచ్‌లో ఈ కొస నుంచి ఆ కొస వరకూ సూర్యాస్తమయం దాకా తిరుగుతూనే ఉంటుంది.

ఒంటరిగా ఉన్నా ఇబ్బందే! జంటగా ఉన్న ఇబ్బందే! ఎవరైనా కెమెరా కమలకు చిక్కాల్సిందే! ఫోటోకి పాతిక రూపాయలు. బేరానికి దిగితే ఇరవైరూపాయలు. వెంటనే ప్రింట్ ఇస్తానంటుంది. ఫోటో తీసుకునేదాకా వదలదు కమల. ఎక్కణ్ణుంచి వచ్చారో ఇక్కడకి? ఈ అందాల్లో ఓ అందంగా ఉండిపోండి సార్! అలలు అలలుగా సముద్రం ఎంత అల్లరిగా ఉందో చూడండి సార్! మీరూ అల్లరి చెయ్యండి. పిల్లాడైపోండి! బాలరాజూ! సార్ చేతికి ఓ బెలూన్ ఇయ్యి! పట్టుకోండి సార్! పదిరూపాయలే అంటూ ఫోటో తీస్తుంది. గంగరాజుని కేకేస్తుంది అంతలోనే! ఒరేయ్! సార్ చేతికి పెద్దశంఖం ఇయ్యి అంటుంది. ఇప్పిస్తుంది. ఊదడం రాదంటే, ఊదుతున్నట్టుగా ఫోజివ్వండి చాలు అంటుంది. శంఖానికి రెండు రూపాయలు అదనం అంటుంది. బఠానీల పెద్ద బాబుని పిలుస్తుంది. బలేగా ఉంటాయి బఠానీలు. బీచ్‌లో బఠానీలు తినడం బాగుంటుంది. తినండి సార్ అంటుంది. అలాగే తియ్యతియ్యగా కొబ్బరిబొండాం తాగమంటుంది. బుచ్చిబాబుని పిలుస్తుంది. బొండాం కొట్టమంటుంది. నిండా నీరుండాల్రోయ్! లేకపోతే గొడవలైపోతాయి అంటుంది. ఆ మాటా ఈ మాటా చెప్పి, అన్నిటికీ కలిపి, వందరూపాయలు లాగేస్తుంది. ఫొటోలు తీసి తాను బతకడమే కాదు, తనలాంటి చిరువ్యాపారులను చాలామందిని బతికిస్తుంది కమల.



ఒక రోజు ఏం జరిగిందంటే... బీచ్‌ని తట్టి మేలుకొలుపుతున్నట్టుగా పసిపాప ఏడుపు వినవచ్చింది. గుక్కబట్టి ఏడుస్తోంది పాప. అప్పుడే వచ్చిందక్కడికి కమల. ఏడుపు వినవచ్చినవైపు పరుగుదీసింది. చూస్తే రోజులబిడ్డ ఏడుస్తూ కనిపించింది. వదిలి వెళ్ళిపోయారెవరో! పాపను ఎత్తుకుని లాలిస్తూ, అయినవాళ్ళ కోసం అటూ ఇటూ చూసింది కమల. ఎవరూ కనిపించలేదు. పరుగుదీసింది అక్కణ్ణుంచి. బాలరాజుకీ, గంగరాజుకీ, బుచ్చిబాబుకీ, పెద్దబాబుకీ పాపని చూపించింది. ఏం చేద్దామని అడిగింది. రకరకాలుగా మాట్లాడారంతా. ఏదీ తేల్చి చెప్పలేకపోయారు. ఒకటి మాత్రం గట్టిగా చెప్పారు. నీకే దిక్కులేదు. ఇంకో దిక్కులేని దాని గురించి నీకెందుకు? అన్నారు. ఆ మాట కమలకు నచ్చలేదు. అందరినీ పేరుపేరునా తిట్టింది. వెళ్ళిపోయింది అక్కణ్ణుంచి. ఆ రోజు నుంచి ఓ మూడు నెలలపాటు బీచ్‌లో కమల కెమెరా కరువైంది. ఆమె మాటలూ, ఫోటోలు కూడా కరువయ్యాయి. దాంతో బేరాలు బోల్తాపడ్డాయి. ఆ మూడు నెలలూ సముద్రం కూడా కదల్లేదు. ఇసుక అట్టగట్టినట్టయి, ఆడలేదు. బీచ్ అంతా బోసి పోయింది. ఇక ఈ వ్యాపారాలు మన వల్ల కాదు. ఇక్కడ బతకడం కష్టం. పోదాం పదండని బాలరాజు, బుచ్చిబాబుసహా అంతా ప్రయాణమవుతోంటే మూడు నెలల అనంతరం పాపసహా నవ్వుతూ ప్రత్యక్షమైంది కమల. బేబీకారియర్లో పండులాంటి పాపను ఉంచుకుని, కెమెరా పట్టుకుని పలకరించసాగింది. ఫోటోలకోసం పరుగుదీస్తోంటే కారియర్లో పాప పడిపడి నవ్వడం కమల ఉత్సాహాన్ని రెట్టింపు చేసింది.

కళకళలాడసాగింది బీచ్. వ్యాపారాలు పుంజుకున్నాయి. అప్పుడు అలా మాట్లాడడం తప్పే! ఒప్పుకుంటాం. ఇప్పుడు పాపకి నువ్వూ, నీకూ పాపా ఒకరికి ఒకరు దిక్కు. దేవుడు మీ ఇద్దరినీ బలే కలిపాడు అన్నారంతా. ఆ మాటకి మెళ్ళో శంఖాలూ, చెవి జుంకాలూ ఊగిపోతున్నట్టుగా కమల నవ్వితే, బోసి నోరు వేసుకుని పాప కూడా గలగలా నవ్వింది. వాళ్ళ నవ్వులకి సముద్రం చెలరేగింది.




## ఇక్కడ పేర్లు సూచించబడును

పిల్లలు పుట్టడం ఆలస్యం వారికేం పేర్లు పెట్టాలా, కొత్తగా ఎలా ఉండాలా అని తల్లి దండ్రులు ఆపసోపాలు పడుతుంటారు. ఇక జ్యోతిష్యులను, తెలిసినవారిని, పెద్దలను సంప్రదిస్తారు. అంతర్జాలంలోనూ జల్లెడపట్టేస్తారు. అయితే చైనీయులు మాత్రం తమ పిల్లలకు పేర్లు పెట్టేందుకు ఓ హైస్కూలు విద్యార్థినిని సంప్రదిస్తున్నారట. ఆ బాలిక ముందు క్యూలు కట్టి నిలుచుంటున్నారట. ఆమేదో అతీత శక్తులు కలిగి ఉందంటే పొరబాటు పడినట్లే! ఆమెకు ఎందుకంత క్రేజో మీరే చదివేసేయండి!!

బ్రిటన్‌కి చెందిన బ్యూ జెసప్(16) అనే బాలిక ఆరునెలల్లో రెండున్నర లక్షలమంది చైనా పిల్లలకు నామకరణం చేసింది. సిండ్రెల్లా, మేరీ, అలెగ్జాండర్ రోజీ వంటి ఇంగ్లీషు పేర్లు మాత్రమే ఆమె పెడుతుంది. అయితే సొంత భాషకు విలువిచ్చే చైనీయులకు ఇప్పటికిప్పుడు ఇంగ్లీషుభాష పేర్లపైన మోజు పెరగడానికి ఓ కారణం ఉందట. ఆకారణాన్నే వ్యాపారంగా



మలచుకుని చిన్న వయసులోనే లక్షలు ఆర్జిస్తోంది బ్యూ.

ఇంతకీ వీరికి ఎందుకీ ఇంగ్లీషు పేర్ల మోజంటే చైనా విద్యార్థులు యూకేలోని విశ్వవిద్యాలయాల్లో చదువుకునేందుకు దరఖాస్తులు నింపాలంటే వారి స్థానిక పేర్లు పనిచేయవట. ఈ-మెయిల్ వంటి వాటిల్లోనూ చైనీస్‌పేర్లు సపోర్టు చేయవట. దానికి కారణం చైనీస్ అక్షరాలు భిన్నంగా ఉండటమే. అందుకే తమ పిల్లల భవిష్యత్తు బాగుండాలని ఇంగ్లీషు పేర్లు పెట్టుకునేందుకు మొగ్గు చూపుతున్నారట చైనీయులు.

ఓరోజు తన తల్లిదండ్రులతో చైనా వెళ్ళిన బ్యూ... స్థానికంగా ఉండే పిల్లల పేర్లు అడిగి తెలుసుకుంది. ఆ పేర్లతో ఎదురయ్యే ఇబ్బందిని గ్రహించిన బ్యూ.. దీనికి పరిష్కారంగా ఓ వెబ్‌సైట్ ప్రారంభించింది. ఆ వెబ్‌సైట్ ద్వారా చైనీయులకు ఇంగ్లీషు పేర్లు సూచిస్తోంది. అందుకు కొంత ఫీజు వసూలు చేస్తుంది. అలా వయసులో చిన్నదైనా కొత్త ఆలోచనతో వ్యాపారవేత్తగా మారి పిల్లలకు ఇంగ్లీషు పేర్లు పెట్టి లక్షలకు పైగా సంపాదించింది ఈ బాలిక. ఇంగ్లీషు పేర్లపై చైనీయులకు ఆసక్తి పెరగడం అటుంచితే దాన్ని ఆ బాలిక వ్యాపారంగా మార్చుకోవడం గొప్పగా ఉందని అందరూ అంటున్నారు.

# మెయిల్ బాక్స్

### సీరియల్స్ సూపర్

నవంబరు 30వ తేదీ సంచిక ముఖచిత్రం రకుల్ ప్రీత్‌సింగ్ బాగుంది. వెట్టి, మహానంది, సినీవాలి సీరియల్స్ సూపర్. పెళ్ళి, మట్టివాసన, నిలువు దోపిడీ కథలు ఆసక్తికరంగా ఉన్నాయి. రచయితలకు మా ధన్యవాదాలు.

-పి.లక్ష్మీకాంతరెడ్డి, కోవెలకుంట్ల, కర్నూలుజిల్లా

### వీక్లీ ఆకర్షణీయం

ఈ వారం రకుల్‌ప్రీత్‌సింగ్ ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. 'సంతోషంగా ఉండాలంటే...' ప్రత్యేకవ్యాసం ప్రయోజనకరంగా ఉంది. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ శృంగార కథ రసవత్తరంగా ఉంది. కవితలు ఆకట్టుకున్నాయి.

-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### అరణి రామాయణం

అరణి రామాయణంలో రామ పట్టాభిషేకం పూర్తయింది. ఇదిక 'అరణి రామాయణం'గా పాఠకులలో ముద్రపడింది.

మెహ్రీన్‌కౌర్, హెబ్బాపటేల్ ఇంటర్వ్యూలు బాగున్నాయి. తీన్‌మార్ కార్టూన్లు నవ్వించాయి. మార్నింగ్ కాఫీ స్కిట్లు ప్రతివారం వాసి తగ్గకుండా నవ్విస్తున్నాయి. ఊయలకుర్చీ కథనం మంచి నిర్వచనమిచ్చింది. సంతోషమే సగం బలం పొందడానికి కావాల్సిన విషయాలు తెలిశాయి. సురభి వింతల్లో కీచురాయి పందాలు, మిరప తోరణాలు అమితంగా ఆకట్టుకున్నాయి. ట్రంప్ విజయంపై రివ్యూ, కొత్త పుస్తకాల సమీక్ష, చర్మ సంరక్షణ, 'షి'రోస్ రెస్టారెంట్ అలరించాయి.

-మాధవరపు కృష్ణ, కాకినాడ

### తెలుగువారి దివ్యతేజం నవ్య వీక్లీ

ఇటీవల నవ్య వీక్లీ గెటప్ మారిపోయింది. ఎంతో ఆకర్షణీయంగా తెలుగువారి దివ్యతేజంలా పాఠకుల చేతుల్లో మెరిసిపోతూ మాకెంతో గర్వకారణమైపోయింది. సినీవాలి లాంటి సరికొత్త సీరియల్స్, ఆకర్షణీయమైన కూపన్ మంత్రముగ్ధుల్ని చేస్తోంది. రామాయణం పూర్తిఅయింది. మరో మంచి పురాణగాథగానీ, 'వేయి పడగలు' వంటి బృహత్తర కావ్యంగాని, పింగళి సూరనగారి కళాపూర్ణోదయంగానీ ప్రవేశ పెట్టగలరు.

-పక్కి. బాలకృష్ణారావు, విజయనగరం

### నవ్య అదిరింది

23వ తేదీ నవ్యవీక్లీ మార్నింగ్ కాఫీ 'బుద్ధి' స్కెచ్ స్పార్క్ అదిరింది. 'ఇది కథకాదు' కథాకర్త మన్నెం శారద గారికి అభినందనలు. డా. వోలేటి పార్వతీశం గారి జయహో జవాను కవిత అభ్యుదయభావాన్ని ఒలికించింది. రాజశుక రివ్యూతో శతశాతం ఏకీభవిస్తున్నాం. 'తిండివేళలూ ముఖ్యమే' పుష్పలతగారి రచన చాలా ప్రయోజనకరంగా ఉంది. సుధామ పదగారడి పజిల్‌ను నింపి కట్‌చేసి పంపిన వారి పేర్లు ప్రచురిస్తే మరింత బావుంటుందని నా భావన.

- నేమన సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం

### భూయో భూయో నమామ్యహం

నవ్య వీక్లీలో అరణి రామాయణం ఆసాంతం చదివాను. నా జన్మ తరించింది. సులభశైలిలో ఎంతో గొప్పగా, ఎంతో రసరమ్యంగా రామాయణ రచన చేసిన అరణిగారికి నమస్సుమాంజలులు. శ్రీరామ పట్టాభిషేకఘట్టం మహాద్భుతం.




కరువుకాటకాలు లేకుండా 11 వేల సంవత్సరాలు ఈ భూమిని పాలించాడు రాముడు అనే వాక్యాలు చదివి నా హృదయం పులకించింది. రామాయణ కావ్యాన్ని ఇంకా కొనసాగించాలనేది మా ఆకాంక్ష. లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం.

-వి.కుటుంబరావు, హైదరాబాద్

### రామాయణం లేకపోతే వెలితే!

అరణిగారి రామాయణం పూర్తయింది. రామాయణం సీరియల్ ఇంటింటా పఠనం అన్నట్టుగా ఉండేది. రామాయణం లేకపోతే ఇక వెలితిగా అనిపిస్తుంది. అరణిగారికి ధన్యవాదాలు. ఆయన మరో ఇతిహాసం అందిస్తారని ఆశిస్తున్నాం.

మొదటిపేజీ 'ఊయలకుర్చీ' చదువుతుంటే నవ్వాగలేదు. చివరకు కన్నీటి పర్యంతమైంది. కొన్ని జ్ఞాపకాలు చిరస్థాయిగా నిలుస్తాయనడానికి నిదర్శనం. మట్టివాసన కథ చాలా బాగుంది. మనిషికి ప్రేమ, ఆదరణ, ఆప్యాయతలే నిజమైన ధనం అని చెప్పకనే చెప్పారు రచయిత. వైనతేయ గారి మార్నింగ్ కాఫీలో మంచి సందేశాలు చదివి నవ్వుకున్నాం. మార్నింగ్ కాఫీ మొదలు చివరి పేజీ 'ఇవన్నీ నిజాలే' వరకు నవ్య నిత్యనూతనంగా ఉండి ఎంతో విజ్ఞానం అందిస్తోంది.

-శ్రీమతి ఆదూరి పద్మావతి,
నిజాంపేట్,హైదరాబాద్

### అందరివాడు ట్రంప్

అమెరికా అధ్యక్షుడిగా డోనాల్డ్ ట్రంప్ గెలుపు చారిత్రాత్మకం, దురుసు మాటకారి ఎన్నికల్లో గెలుస్తాడని ఊహించలేదు. కొందరివాడిని కాదని, తాను అందరివాడినని తన గెలుపుతో నిరూపించాడు ట్రంప్. ఆయన కృషి, మేధస్సుకు నమ్ముకుని ఆర్థికంగా బలమైన నాయకుడిగా, అధ్యక్షుడిగా ఎదిగాడని తెలుసుకున్నాం. ప్రత్యర్థులు ఆయన విజయాన్ని ఆపలేకపోయారు. అనుకున్నదొక్కటి అయినదొక్కటి అన్నరీతిగా ట్రంప్ గెలుపు ప్రపంచానికి మలుపుగా మారింది.

-నవనీత్ రాజ్. మద్నూర్,
కామారెడ్డి జిల్లా

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్




డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# మోకాలు మార్పిడి సర్జరీపై అపోహలు వీడండి...!
# సర్జరీ తర్వాత సాధారణ జీవితం గడపవచ్చు

మోకాళ్ల నొప్పులతో బాధపడుతున్న వారు మోకాలు మార్పిడి శస్త్రచికిత్స చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపగలుగుతారు. సర్జరీ తర్వాత జీవితం ఎలా ఉంటుందో అని చాలా మందిలో ఎన్నో అపోహలు, మరెన్నో భయాలు ఉన్నాయి. మోకాలు మార్పిడి చేయించుకుంటే నెలల తరబడి విశ్రాంతి అవసరమని, విధులను నిర్వహించలేమని, ఎక్కువకాలం ఇతరులపై ఆధారపడాల్సి వస్తుందని అపోహ పడుతుంటారు. ఈ అపోహల కారణంగా ఎంత తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నప్పటికీ మోకాలు మార్పిడికి కొందరు సిద్ధపడడం లేదు. కానీ అవన్నీ అపోహలు మాత్రమే. మోకాలు మార్పిడి శస్త్రచికిత్సలో 95 శాతం సక్సెస్ రేటు నమోదవుతోంది. 1 శాతం కంటే తక్కువగానే దుష్ప్రభావాలు ఉంటాయి. మోకాలు మార్పిడి చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపవచ్చు. అయితే ఆపరేషన్ జరిగిన తర్వాత కొన్ని రోజుల పాటు మాత్రం వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జీవనశైలిలో మార్పులు చేసుకుంటూ సరైన జాగ్రత్తలు పాటించాలి.

## విశ్రాంతి ఎంత అవసరం...?

ఆపరేషన్ తరువాత రెండుమూడు నెలలు పడుకునే ఉండాలి అనేది అపోహ మాత్రమే. అత్యాధునిక విధానాలలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ అయిన రోజునే రోగిని నడిపిస్తారు. రెండుమూడు రోజుల్లో రోగి సొంతంగా నడవగలుగుతారు. మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన తర్వాత కొన్ని వారాలపాటు వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జాగ్రత్తలు తీసుకోవాలి. ఆపరేషన్ జరిగిన ఆరువారాల తర్వాత వైద్యులను సంప్రదించి విధులకు హాజరుకావచ్చు.

## ఇంట్లో చేసుకునే పనులు:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం కర్ర, వాకర్స్ సహాయం లేకుండా నడవడానికి నెల రోజుల సమయం పడుతుంది. నెల రోజులవరకు వాకర్ సహాయంతో సొంతంగా ఇంట్లో చేసుకునే పనులు చేసుకోగలుగుతారు.



## వ్యాయామం చేయొచ్చా...?

మోకాలు మార్పిడి సర్జరీ రెండు నెలల తర్వాత వాకింగ్, సైక్లింగ్, స్విమ్మింగ్ వంటి వ్యాయామాలు చేయవచ్చు. మోకాలుపై అధిక ఒత్తిడిని కలిగించే వ్యాయామాలకు కొన్ని నెలలపాటు దూరంగా ఉండాలి. గోల్ఫ్, బేస్‌లైన్ టెన్నిస్ వంటి ఆటలు కూడా ఆడవచ్చు.

## ప్రయాణాలు చేయవచ్చా...?

ప్రయాణాలు శరీరాన్ని ఒత్తిడికి గుర్తిచేస్తాయి. దూరప్రయాణాలు చేయవలసి వస్తే తప్పనిసరిగా వైద్యులను సంప్రదించాలి. సర్జరీ జరిగిన నెల నుంచి నెలన్నర తర్వాత విమాన ప్రయాణాలు చేయవచ్చు. మోకాలు మార్పిడి చేయించుకున్న వారికి కృత్రిమ కీలు అమర్చుతారు కాబట్టి ఎయిర్‌పోర్టులలో ఉండే మెటల్ డిటెక్టర్లు గుర్తిస్తాయి. కాబట్టి సర్జరీ జరిగినట్లు వైద్యులు ఇచ్చే గుర్తింపు కార్డును విధిగా వెంట తీసుకెళ్లడం మంచిది.



## డ్రైవింగ్ చేయవచ్చా...?

ఆపరేషన్ జరిగిన నెల రోజుల లోపే కారు వంటి ఫోర్ వీలర్ నడచవచ్చు. 2-3 నెలల్లో ద్విచక్రవాహనం నడపాలి. వీటిలో సెల్ఫ్ స్టార్ట్ ఉన్న వాహనాలను నడపడం మంచిది.

## దాంపత్య జీవితం:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన తర్వాత కొన్ని రోజులపాటు దాంపత్య జీవితానికి దూరంగా ఉండాలి. ఆ తర్వాత సాధారణ దాంపత్య జీవితం గడపవచ్చు.

## గుర్తుంచుకోవాల్సిన విషయాలు:

సర్జరీ జరిగి ఆసుపత్రి నుండి డిశ్చార్జ్ అయిన తర్వాత ఇంటి దగ్గర కొన్ని జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. ముఖ్యంగా ఆపరేషన్ జరిగిన ప్రాంతాన్ని శుభ్రంగా ఉంచుకోవాలి. ఆ ప్రాంతంలో వాపు వచ్చినా, ఎర్రగా మారినా, నొప్పి పెరుగుతూ ఉన్నా వెంటనే వైద్యులను సంప్రదించాలి. మందులు క్రమం తప్పకుండా వాడుతూ, వైద్యులు సూచించిన జాగ్రత్తలు పాటించాలి.

## జాగ్రత్తలు తప్పనిసరి :

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం మనం ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తే కృత్రిమ మోకాలు అంత ఎక్కువకాలం మన్నికగా ఉంటుంది. సర్జరీ తర్వాత కొన్ని జాగ్రత్తలు పాటించడం చాలా అవసరం. ఆపరేషన్ తర్వాత మోకాలుపై ఎక్కువగా ఒత్తిడి ఆటలకు దూరంగా ఉండాలి. సర్జరీ చేయించుకున్న వారికి మధుమేహం, రక్తపోటు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటే వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఆపరేషన్ తర్వాత దంతాలకు సంబంధించిన చికిత్సగానీ, శస్త్రచికిత్సగానీ చేయించుకోవాల్సి వస్తే సర్జరీ జరిగిన విషయాన్ని వైద్యులకు తెలియజేయాలి. దాంతో ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తలు తీసుకుంటూ వైద్యులు దంతాలకు చికిత్స అందిస్తారు.

# ప్రవేశం నిషిద్ధం

**కొన్ని** ప్రదేశాలకు వెళ్ళాలంటే భయంగా ఉంటుంది. మరికొన్ని ప్రదేశాలకు వెళ్ళాలని ఉన్నా అక్కడ ఉండే పరిస్థితులు వెళ్ళడానికి అనుకూలించవు. ఇంకొన్నిటికి వారసత్వ సంపదని కాపాడుకునే ప్రయత్నంలో అనుమతించరు. ఇలా రకరకాల కారణాల వల్ల కొన్ని ప్రదేశాలు చూడలేము కదా! అలాంటి ప్రదేశాలు ప్రపంచ చిత్రపటంలో చాలా ఉన్నాయట. కొన్ని మనిషి సందర్శించలేనివి ఉంటే మరికొన్నేమో ప్రత్యేక అనుమతుల ద్వారా మాత్రమే చూసే వీలుందట.

ఆ గుహల్లో చిత్ర సౌందర్యం వర్ణించతరం కాదు... ఒకవేళ వాటిని చూద్దామని వెళితే నిరాశతో వెనుదిరగడం ఖాయం. ఎందుకంటే అక్కడ ప్రవేశం నిషిద్ధం కాబట్టి..ఇక మరో ప్రాంతంలోనేమో ప్రాచీనమైన గుడి ఉంది కానీ ఇప్పటికీ అది మూసే ఉంటుంది. దాన్ని ఎవ్వరూ చూడ్డానికి వీల్లేదు. సాధారణంగా లైబ్రరీకి ఎవరైనా వెళతారు కదా కానీ ఇటలీలో ఉన్న ఆ లైబ్రరీకి మాత్రం ఒక్క వ్యక్తిని తప్ప ఎవరినీ అనుమతించరట. అలాంటి ప్రదేశాలు ఏంటో చదివేసేయండి మరి!

## లస్కాక్స్ గుహలు

మనదేశంలో ప్రసిద్ధి పొందిన అనేక గుహలున్నాయి. అయితే కొన్ని గుహల్లోకి వెళ్ళలేం. అలాంటిదే ఈ గుహ కూడా! పేరు లస్కాక్స్. ఈ గుహలు సౌతర్న్ ఫ్రాన్స్‌లో ఉన్నాయి. అత్యంత పురాతనమైన గుహలివి. ఈ గుహల్లో 17,300ల సంవత్సరాలకు ముందు రాతి పనిముట్లతో, ఖనిజ వర్ణాలతో గోడలమీద వేయబడిన చిత్రాలు ఉంటాయి. ఆ చిత్ర సౌందర్యం వర్ణించతరం కాదు. అయితే ఈచిత్రాల్లో ఆ కాలంలో ఉండే అతిపెద్ద జంతువుల బొమ్మలు మాత్రమే గీయబడి ఉన్నాయి. 1940వ సంవత్సరంలో ఈ గుహను కనుక్కున్నారు. ఆ తర్వాత 1948 నుంచి కొన్ని సంవత్సరాల వరకు పర్యాటకులను వీటిని చూడ్డానికి అనుమతి ఇచ్చారు. అయితే పర్యాటకుల వల్ల గుహలోని చిత్రాలకు హాని జరుగుతుందని 1963వ సంవత్సరంలో గుహలను మూసేశారు. అప్పటి నుంచి ఇప్పటి వరకు ఎవరూ అక్కడికి వెళ్లడానికి అనుమతి లేదు.

## పొవిగ్లియా ద్వీపం

అనేక రకాల ద్వీపాలు మన ప్రపంచ పటంలో ఉన్నాయి. వాటిలో కొన్ని పురాతనమైనవి కూడా ఉన్నాయి. అలాంటి వాటిల్లో ఒకటి పొవిగ్లియా ద్వీపం. ఇటలీలో ఉందిది. 2000 సంవత్సరాలకు ముందే ఈ ద్వీపం గురించి కొన్ని పురాణాలలో రాయబడిందట. 1348లో వెనిస్ నగరంలో ప్లేగు వ్యాధితో బాధపడుతున్న కొన్ని వేల మందిని మొదటిసారిగా ఈ ద్వీపానికి తరలించారు. ఆ తర్వాత తిరిగి 1793లోనూ, ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలోనూ అదే వ్యాధితో బాధపడుతున్న వేలాది మందిని మళ్ళీ ఈ ద్వీపానికే తరలించారు. 1922లో అక్కడ కొన్ని భవనాలను కట్టి, అప్పుడు ఆ ద్వీపంలో బ్రతికున్న వారికి చికిత్స అందించారు. అయితే అప్పటికే అంతకు ముందు అక్కడికి పంపించిన వారు చనిపోయి ఆత్మలుగా తిరుగుతూ ఆ ద్వీపానికి వచ్చిన వారందరినీ చంపుతున్నారనీ, అది ఒక దయ్యాల ద్వీపమనీ ప్రజలు అనుకోవడం మొదలు పెట్టారు. ఈ దయ్యాల కథని నమ్మడం నమ్మకపోవడం సంగతటుంచితే, అలా పుకారు లేవడంతో 1968లో ఆ ద్వీపంలోని అన్ని భవనాలను మూసేసి తిరిగి వచ్చేశారు. అప్పటి నుంచి ఆ ద్వీపానికి వెళ్ళడానికి ఎవరికీ అనుమతి లేదు.

## రహస్య ప్రాచీన భాండాగారం

ఈ భాండాగారం కూడా ఇటలీలోనే ఉంది. ఈ భాండాగారంలో అరలు 52 మైళ్ళ పొడవునా ఉంటాయట. ఈ ప్రాచీన భాండాగారంలో క్యాథలిక్ చర్చి మతపరమైన చట్టచర్యలు రాసున్న పత్రాలు భద్రపరచబడి ఉన్నాయట. 1881 వరకు ప్రాచీన భాండాగారం లోపలకు వెళ్ళడానికి ఒక్క పోప్‌కు మాత్రమే అనుమతి ఉండేదట. అయితే ఇప్పుడు మాత్రం ఎవరైనా సరే, వారు ద డావిన్సీ కోడ్స్ సంస్థ నుంచి ముఖ్యమైన పరిశోధన చేస్తున్నవారిగా గుర్తింపు పొంది, ఆ గుర్తింపు కార్డు కలిగి ఉంటేనే ప్రవేశానికి అర్హులు.

## అవర్ లేడీ మేరీ ఆఫ్ జాయిన్ చర్చి

ఇథియోపియా దేశంలో ఈ చర్చి ఉంది. దీన్ని 4వ శతాబ్దంలో ఆఫ్రికా దేశాన్ని పరిపాలించిన మొదటి క్రైస్తవ చక్రవర్తి నిర్మించాడు. ఈ చర్చిలో ఉన్న మరో చిన్న గది కూడా చర్చి లాంటిదే. ఒకరకంగా దాన్ని గర్భగుడి అనుకోవచ్చు. అందులో ఉన్న ఓ పవిత్రమైన ఆర్క్‌ను పూజించడానికి ఆ









చక్రవర్తి కాలంలో ఒక మతగురువును నియమించారు. ఆ మతగురువుకు మాత్రమే ఆ చర్చిలోకి వెళ్ళేందుకు అక్కడ ప్రార్థన చేసేందుకు, అగరొత్తులు వెలిగించేందుకు అనుమతి ఉండేది. ఆ మత గురువు చనిపోయేంతవరకు ఆ గర్భగుడిలోనే ఉండాలి, బయటకి రాకూడదు అనే నిబంధన ఉండేదట. ఆయన చనిపోయే ముందు తన వారసుడిగా ఎవరినైనా ప్రకటించి తదుపరి కన్ను మూసేవారట. ఇలా క్రైస్తవ చక్రవర్తి ఉన్నంత వరకు ఎలా చేయగలిగారో తెలియదు కానీ ఈ పద్ధతే అమలులో ఉండేది. అయితే ఆ తర్వాతే తెలిసింది. అసలు ఆ గర్భగుడిలోకి ఒక మనిషి వెళ్ళడానికి, అందులో నివసించడానికి, ఆ ద్వారం నుంచి బయటకు రావడానికి ఎంత మాత్రం దారిలేదని! మరి అప్పట్లో ఎలా ఉండేవారో అన్న అంశంపై, గర్భగుడిలో అమర్చబడ్డ ఆర్క్ గురించి ఇప్పటికీ అక్కడ పరిశోధనలు జరుగుతున్నాయి. ఆ చర్చి ఆచారం ప్రకారం ఎవరూ వెళ్ళడానికి అనుమతిలేదు కాబట్టి ఆ ఆచారాన్ని ఇప్పటికీ పాటిస్తూ లోనికి ఎవరినీ అనుమతించట్లేదు.

## జియాంగ్ న్యూ జాతీయ రక్షణ మ్యూజియం

చైనా దేశం నన్ జింగ్ నగరంలో ఉన్న ఈ జాతీయ రక్షణ మ్యూజియంలో ప్రపంచదేశాలపై చైనా గూఢచర్యం చేసిన పత్రాలు, గూఢచర్యంలో ఉపయోగించబడ్డ వస్తువులు భద్రపర్చబడ్డాయి. ఈ వస్తువులలో వారు వాడిన పెన్నులు, లిప్‌స్టిక్స్ , గూఢచర్యం ఎలా చేశారో అని రాసున్న పత్రాలు, మ్యాపులు ఉన్నాయి. ఈ మ్యూజియం చూడ్డానికి విదేశీయులకు అనుమతి లేదు. చైనా దేశస్థులకు మాత్రం అనుమతి ఉంది. అది కూడా ఎన్నో ఆంక్షలు విధించిన తర్వాతే, లోపలికి ప్రవేశం ఉంటుంది. దీనితో ఈ మ్యూజియం చూడాలనుకున్న అక్కడివారికి, ఆ ఆంక్షలు నచ్చక చాలామంది చూడ్డానికి వెళ్ళరట. దీంతో ఈ మ్యూజియం ఎవరూ వెళ్లలేని చోటుగానే ఉంటోంది.

## పైన్‌గాప్

ఆస్ట్రేలియా దేశంలోని ఉత్తరభాగంలో ఆస్ట్రేలియా, అమెరికా కలిసికట్టుగా నడుపుతున్న ఉపగ్రహ ట్రాకింగ్ స్టేషన్ పైన్‌గాప్. దీన్ని ముఖ్యంగా వాడుకునేది అమెరికా దేశమే! వారి దేశానికి చెందిన జాతీయ, అంతర్జాతీయ గూఢచార సంస్థలైన సి.ఐ.ఏ, ఎన్.ఎస్.ఐ, ఎన్.ఆర్.ఓ కార్యకలాపాలు ఇక్కడ నుంచే జరుగుతాయి. అమెరికా గూఢచార ఉపగ్రహాల నుంచి వచ్చే సమాచారం, ప్రపంచ నిఘా నెట్‌వర్క్ అందించే వార్తలను సేకరించే ప్రదేశం ఇది. దాంతో సాధారణ పౌరులను అక్కడికి అనుమతించరు. ఒకవేళ అనుమతి లేనిదే అక్కడికి వెళితే శిక్ష తప్పదు. ఇప్పటికే అలా వెళ్లడానికి ప్రయత్నించిన వారు ఖైదు చేయబడి, శిక్షలు అనుభవిస్తున్నారు.

## ఐసే గ్రాండ్ ష్రైన్

జపాన్ దేశంలోని షింటో మతం వారి అత్యంత పవిత్రమైన మందిరం ఇది. ఐసే అనే నగరంలో ఉన్నందున ఈ మందిరానికి ఐసే గ్రాండ్ ష్రైన్ అనే పేరు వచ్చింది. జపాన్ దేశంలోని షింటో మత మందిరాలన్నింటికీ ఇది ప్రధాన కేంద్రమన్నమాట. Amaterasuomikami (విశ్వానికి ప్రతిరూపకంగా భావించే) దేవతగా ఈ మందిరాన్ని భావిస్తారు. ఈ మతానికి చెందిన వారు ప్రకృతినే దైవంగా భావించి వానలు, సముద్రం, సూర్యుడిని కొలుస్తారు. వారే దైవాలని నమ్ముతారు. సుమారు 2000 సంవత్సరాల క్రితం ప్రకృతి అందించిన కొన్ని వస్తువులను అక్కడ భద్రపరిచేవారట. అలా ఆ మందిరం ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. అతిపవిత్రమైన ఈ మందిరంలోకి ఎవరూ వెళ్లకూడదు. జపాన్ దేశములోని షింటో మతస్థులు కూడా ఈ మందిరం బయటే ప్రార్థనలు చేసుకోవాలట.

## మెట్రో 2, రష్యా

మెట్రో స్టేషన్‌కి వెళ్ళకుండా ఉండడం అనేది ఎప్పుడైనా విన్నారా? మాస్కో నగరంలో ఓ మెట్రో రైల్వే లైను ఉంది. అది ఇప్పుడున్న మెట్రో రైల్వే లైనుకు సమాంతరంగా ఉంది. దాన్ని మెట్రో2 రైల్వేలైన్ అని పిలుస్తారు. ఇది ఒక రహస్య రైలు మార్గమని, దీన్ని రష్యా గూఢచార సంస్థ కెజిబి వాడుతున్నదని, ఈరైల్వే లైనును స్టాలిన్ పరిపాలనలో వేశారని, దీని రహస్యపేరు డి-6 అని, రష్యా రక్షణ శాఖ దీనిని నడిపిస్తున్నదని చెబుతారు. 1994లో రష్యా పట్టణాన్ని అన్వేషించే సమూహంలోని వ్యక్తి, పరిశోధనలో భాగంగా చేస్తున్న తవ్వకాలలో ఈ రైలు మార్గాన్ని కనుగొన్నానని తెలిపాడు. అయితే రష్యా ప్రభుత్వం అటువంటిదేమీ లేదని చెబుతోంది. ఇప్పటివరకు అధికారికంగా ఎవ్వరూ దీనికి సంబంధించిన విషయాలను వెల్లడించలేదు. ఈ రైలుమార్గాన్ని చూడటానికి ఎవ్వరికీ ప్రవేశం లేదు.

**- నివేదిత**





# అదొక మల్టీనేషనల్ సాఫ్ట్‌వేర్ కంపెనీ.

**కంప్యూటర్ సైన్స్ చదివిన ప్రతివాళ్ళూ ఆ కంపెనీలో ఉద్యోగం రావాలని కోరుకుంటారు. ఆ కంపెనీకి ప్రతిరోజు వేలకొద్దీ రెజ్యూమ్‌లు వస్తుంటాయి. వాటన్నిటినీ పరిశీలించడం అంటే మాటలు కాదు. అందుకే ఎక్కువగా కంపెనీ ఉద్యోగులు రిఫర్ చేసిన వాళ్ళనే ఇంటర్‌వ్యూకి పరిగణిస్తారు. ఇక ఇంటర్‌వ్యూ సంగతికొస్తే, అదొక ఏడు రౌండ్ల ప్రక్రియ. ప్రతిరౌండ్‌లో కొందరు ఎలిమినేట్ అయిపోతుంటారు. ఆఖరి రౌండ్ వరకూ రావటం, చివరివరకూ అనుమానాస్పదమే!**

అయితే కొన్ని టార్గెట్స్‌ని రీచ్ అవటం కోసం, కొన్ని రౌండ్లు తప్పించటం, అవసరమయిన స్కిల్స్ లేకపోయినా కొంతమందిని బాక్‌డోర్ ఎంట్రీ చేయించటం మామూలే! అటువంటివాళ్ళలో కొంతమంది కంపెనీలో ఉన్నతస్థానానికి చేరుకోవటం కూడా సర్వసాధారణమే!

అత్యుత్తమమైన వారంతా ఆ కంపెనీలోనే ఉంటారన్న ప్రచారమూ, దేశవిదేశాల్లో ఆ కంపెనీ ప్రొడక్ట్స్‌కి ఉన్న బ్రాండ్ వాల్యూ, కంపెనీ కల్పించే సదుపాయాలూ, విదేశీ పర్యటనలూ... ఇవన్నీ కలిసి ఐటీ యువతలో, ప్రతివారూ ఆ కంపెనీలోనే జాబ్ సాధించాలనుకోవడానికి ముఖ్య కారణాలు...

పదిహేనంతస్తుల బిల్డింగ్! నలుపురంగు అద్దాలతో పలకలు, పలకలుగా మెరిసి పోతోంది. చుట్టూ కొన్ని ఎకరాల ఖాళీస్థలం, పార్కింగ్ లాట్ నుంచి బిల్డింగ్ వరకూ దారి పొడుగునా క్రోటన్స్, రకరకాల పూలచెట్లు, అక్కడక్కడా 'పాములుంటాయి.... చూసి నడవమ'న్న

**(కొత్త సీరియల్ ప్రారంభం)**

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

కంఠంనేని స్వప్న





బోర్డులు....

పై అయిదు ఫ్లోర్లలో రీసెర్చ్‌వింగ్, తర్వాత అయిదు ఫ్లోర్లలో ఐటీ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, కింది ఫ్లోర్లలో సర్వీసెస్‌గా బిల్డింగ్ విభజించబడింది. రీసెర్చ్ వింగ్ లోకి మిగతా ఉద్యోగులు రాకుండా ఏక్సెస్ బ్లాక్ చేయబడి ఉంటుంది.

కార్ పార్క్‌చేసి బిల్డింగ్‌లోకి నడిచాడు అక్షయ్.

గమ్ నములుతూ, ఇయర్‌ఫోన్స్ పెట్టుకుని పాటలు వింటున్నాడతను.

అతడా కంపెనీలో ఫ్రెషర్‌గా చేరి అప్పటికి రెండేళ్ళు. చాలా ప్రత్యేకమైన వ్యక్తిగా పేరు తెచ్చుకున్నాడు. ఐఐటీ, ఐఐఎమ్ చేసి మేనేజ్‌మెంట్ జాబ్ కాకుండా టెక్నాలజీ కెరియర్‌ని ఏరి కోరి ఎంచుకున్నాడు. ఆ వయసువాళ్ళలో అరుదుగా కనిపించే క్రమశిక్షణ అతని సొంతం. చక్కటి కమ్యూనికేషన్ స్కిల్స్ ఉన్నాయి, ప్రతి విషయాన్నీ లోతుగా పరిశోధించి, టీమ్‌లో వాళ్ళకయినా, పై మేనేజ్‌మెంట్‌కి అయినా వాళ్ళ పరిభాషలో తేలిగ్గా, అర్ధమయ్యేలా చెప్పటం వల్ల అందరూ అతన్ని అభిమానిస్తారు. కంపెనీ రాజకీయాలకు అతీతంగా పనిచేస్తూ, రెండేళ్ళ వ్యవధిలోనే రెండు ప్రమోషన్లు పొందాడు. ప్రస్తుతం టెక్నాలజీ లీడ్‌గా ఉన్నాడు.

చక్కటి లీడర్‌షిప్ స్కిల్స్, ఎటువంటి కొత్త టెక్నాలజీనయినా అవలీలగా అర్ధం చేసుకుని దానితో ప్రయోగాలు చేయటంతో అతని టీమ్ ఎప్పుడూ అప్-టు-డేట్‌గా ఉండడం... ఇవన్నీ ఒక ఎత్తయితే అతని రూపం అతనికి పెద్ద ప్లస్ పాయింట్.

ఆరడుగుల ఎత్తు, రోజూ ఎక్సర్‌సైజు చేస్తాడనిపించే అథ్లెటిక్ బాడీ... చూడగానే కట్టిపడేసే అందం అతనిది.

చాలా రేర్‌గా నవ్వుతాడు. నవ్వినప్పుడు మాత్రం పారిజాతాలు విరజిమ్మినట్టుగా ఉంటుంది. ఆ నవ్వు చూసినవాళ్ళు ఒక్కక్షణం ఫ్రీజ్ అయిపోయి చూస్తుంటారు. చాలాసందర్భాల్లో దీనివల్ల అతను ఇబ్బందికి లోనయ్యాడు. బహుశా నవ్వటం తగ్గించుకున్నది కూడా అందుకేనేమో!

ఆ రోజతను తెలుపురంగు కాలర్ టీషర్ట్ వేసుకున్నాడు. కింద ఖాకీస్, బ్రౌన్‌కలర్ షూస్. వెనక భుజాలకి వేలాడుతున్న బ్లాక్ కలర్ ల్యాప్‌టాప్ బ్యాగ్.

జెల్ పెట్టటం వల్లనేమో జుట్టు తడిసినట్లుగా, నిలబడినట్లుగా ఉంది.

విశాలమైన కారిడార్స్, చల్లగా తగులుతున్న ఏసీ గాలి...

రిసెప్షన్‌లోకి అడుగుపెట్టగానే ఆహ్లాదకరమైన అనుభూతి. అప్పుడే అమర్చిన పూలనుంచి వస్తున్న పరిమళంతో ఆ రూమంతా గుబాళిస్తోంది.

'హాయ్ అక్షయ్' అందంగా నవ్వింది రిసెప్షనిస్ట్.

పక్కనే ఉన్న ఫ్లవర్ ఎరేంజ్‌మెంట్ నుంచి ఒక డాఫడిల్ తీసి చేతికిచ్చింది. "నిన్ను చూసి టైమ్ సెట్ చేసుకోవచ్చు అక్షయ్! ఇంత కరెక్ట్‌గా టైమ్‌కి ఇంకెవరయినా వస్తే వాళ్ళకిద్దామని ఎప్పటినుంచో ఎదురుచూస్తున్నా. " అంది.

బదులుగా నవ్వాడతను.

ఎలివేటర్ అయిదో అంతస్తులో ఆగింది.

పాంట్‌జేబుకి హుక్ చేసి ఉన్న బాడ్జ్‌ని లాగి స్వయిప్ చేశాడు.

గ్లాస్ డోర్స్ ఓపెన్ అవగానే లోపలికి నడి

**అదొక మల్టీనేషనల్ కంపెనీ. ఆరునెలల క్రితమే ఆ కంపెనీలో చేరిందామె. ఆ రోజు వర్క్ ఫినిష్ చేసి, కాఫీ కోసమని పాంట్రీకి వెళ్ళింది. తిరిగి వచ్చిన ఆమెకి వాతావరణమంతా ఏదో తేడాగా కనిపించింది. ఫ్లోర్ మొత్తం సుగంధ పరిమళంతో నిండిపోయింది. చుట్టూ చూసింది. మగవాళ్ళందరూ కళ్ళు తేలేసి కాన్ఫరెన్స్ రూమ్‌వైపు ఎగబడి చూస్తున్నారు. ఆమెకేమీ అర్థం కాలేదు. ఆ రూంలో ఏం జరుగుతోంది?**

చాడు.

●●●

గూగుల్ నుంచి, ఓపెన్ ఆఫీస్ కల్చర్‌ని అందరూ అడాప్ట్ చేసుకుంటున్న రోజులు. కంపెనీ డైరెక్టర్ల నుంచీ అందరూ వరసగా ఉన్న ఆ క్యూబ్స్ లోనే కూర్చుంటారు. ప్రతి క్యూబ్‌లో ఒక వైట్ బోర్డ్, ఫోన్, ట్వంటీవన్ ఇంచెస్ మానిటర్, ల్యాప్ టాప్ లాక్ చేసుకోవటానికి డాకింగ్ స్టేషన్ ఉన్నాయి. ఫ్లోర్ అంతా బూడిదరంగు కార్పెట్. క్యూబికల్స్ గోడలు ఆకుపచ్చ రంగులో ఉన్నాయి.

ఫ్లోర్ నాలుగువైపులా వరసగా అద్దాలతో, కాన్ఫరెన్స్ రూమ్సు కనబడుతున్నాయి. ప్రతి రూములో వీడియో కాన్ఫరెన్స్‌లకి వీలుగా పెద్ద స్క్రీన్, స్పీకర్ ఫోన్స్, వైట్‌బోర్డ్, టేబుల్, కుర్చీలు ఉన్నాయి.

పసుపురంగు డాఫడిల్‌ను దారిలో పడేసి, తన క్యూబ్ వద్దకు నడిచాడు అక్షయ్.

తొమ్మిదయింది. ఇంకా ఎవరూ వచ్చినట్లు లేరు అనుకున్నాడు.

సిస్టమ్ ఆఫ్ చేసి హెడ్‌ఫోన్స్ తగిలించుకున్నాడు.

ఇంటర్‌నెట్ బ్రౌజర్ ఓపెన్‌చేసి 'టెక్ రిపబ్లిక్ డాట్ కామ్' చదవటం మొదలెట్టాడు.

ప్రతిరోజూ తన నైపుణ్యాలను, నాలెడ్జ్‌ని మెరుగుపరుచుకోవడానికి ప్రయత్నిస్తుంటాడతను. కొద్దిపాటి సమయాన్ని దానికే కేటాయిస్తుంటాడు.

సరిగ్గా గంటవగానే కాఫీకప్ తీసుకుని లేచి నిలబడ్డాడు.

'ఇంకా ఎవరూ వచ్చినట్లు లేరు, రోజులాగే' అనుకుంటూ పాంట్రీ వైపు నడిచాడు. దారిలో ఒక క్యూబ్‌లో లైట్ కనబడుతుంటే అటు నడిచాడు.

అక్కడ వెంకట్ ఫోన్‌తో, కంప్యూటర్‌తో కుస్తీ పట్టడం కనిపించింది.

"పొద్దునే వచ్చినట్లున్నావీ రోజు?" అడిగాడు అక్షయ్.

"ఇంటికెళ్తేగా? శుక్రవారం నుంచి ఇక్కడే ఉన్నా! ఏవో బగ్స్ వస్తే చూస్తున్నా?" కంప్యూటర్ మీద నుంచి చూపు మరల్చకుండా చెప్పాడు వెంకట్.

పాంట్రీలో కాఫీ కలుపుకుని, అక్కడే ఉన్న న్యూస్‌పేపర్ చదివి మళ్ళీ తన క్యూబ్ వైపు నడిచాడు అక్షయ్.

మెల్లిమెల్లిగా ఆఫీస్ నిండుతోంది.

మళ్ళీ తన డెస్క్ దగ్గరకెళ్ళి, ముందురోజు టీమ్‌లో వాళ్ళు రాసిన కోడ్‌ని రివ్యూ చేయటం మొదలెట్టాడు.

అప్పుడప్పుడూ 'హాయ్', 'హెలో' వినబడుతున్నాయి.

తల తిప్పకుండానే చేయి ఊపుతున్నాడు.

సడన్‌గా దభ్‌మన్న శబ్దం వినపడింది.

ఉలిక్కిపడి తల తిప్పి చూశాడు.

వేసుకున్న హైహీల్ షూ మెలికపడి కింద పడింది కాబోలు, చిన్నగా పైకి లేస్తోంది కావ్య.

అయిదున్నర అడుగుల ఎత్తుతో, చామన చాయలో ఆరోగ్యంగా కనబడుతోంది. ఒత్తయిన నల్లటి జుట్టుని గట్టిగా లాగి జడ వేసుకుంది.

విపరీతమయిన హడావుడి మనిషి. ఖచ్చితమైన అభిప్రాయాలతో చుట్టుపక్కల వాళ్ళని ఠారెత్తిస్తుంటుంది.

ఆమె ఆ కంపెనీలో చేరి ఆరు నెలలవుతోంది. అప్పుడప్పుడే హైహీల్స్‌కీ, ఫ్యాషన్స్‌కీ అలవాటు పడుతోంది. కాస్త బొద్దుగా ఉండటంతో అన్నిరకాల డ్రెసెస్ తనకి సూట్ అవ్వవని నిర్ణయించుకుని, డైటింగ్‌కి అలవాటు పడుతున్న దశలో ఉంది.

అందరూ తనవైపే చూస్తుండటంతో, అవమానంగా అనిపించిందేమో బలవంతంగా నవ్వి తన క్యూబ్‌కి వెళ్ళిపోయింది.

సిస్టమ్ పక్కనే ఉన్న వినాయకుడి విగ్రహానికీ, శివుడు, వెంకటేశ్వరుడి పటాలకీ దణ్ణం పెట్టి టపటపా చెంపలు వాయించుకుంది. వాటి ముందు పువ్వు ఉంచింది.

టిష్యూపేపర్ తీసి మానిటర్ మొత్తం తుడిచింది. శానిటైజర్ చేతులకి రాసుకుంది. తర్వాత బాగ్‌లోనుంచి దువ్వెన, మాయిశ్చరైజర్ తీసుకుని వాష్‌రూమ్ వైపు నడిచింది.

"ఇప్పుడొక అరగంట బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తల దువ్వి, మొహం కడిగి ఫ్రెషప్ అవుతుంది. ఆఫీస్‌కి లేట్‌గా రావటమే కాక ఈ కార్యక్రమాలన్నీ ఇక్కడే!" అటునుంచి వెళ్తూ అక్కసుగా అన్నాడు బ్రహ్మి.

వాళ్ళు చేస్తున్న ప్రాజెక్ట్‌కి, అతను ప్రాజెక్ట్ మేనేజర్.

మేనేజ్‌మెంట్‌కీ, టీమ్‌కీ మధ్య శాండ్‌విచ్!

"ఈవెనింగ్ రిలీజ్ ఎక్కడివరకూ వచ్చింది అక్షయ్?" అక్షయ్ దగ్గరకు వెళ్ళాడు.

●●●

కావ్య, రోహిణి పక్కపక్కనే ఉన్న డెస్కుల వద్ద కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వేళ్ళు మాత్రం కీబోర్డ్ మీద టకటకలాడుతున్నాయి.

"ఈ రోజు అక్షయ్‌ని చూశావా?" అడిగింది రోహిణి.

"ఏం?"

"వైట్ టీ షర్ట్‌లో ఎంత హాండ్సమ్‌గా ఉన్నాడో!" ఆమె కళ్ళు వెలిగిపోతున్నాయి.

"నాకతను ఐఐటీ, ఐఐఎమ్ అంటే నమ్మకం లేదు. అంత ఫిట్‌నెస్ కాన్షియస్‌గా బ్రతికేవాళ్ళు, కనీసం కళ్ళజోడన్నా లేకుండా అంతంత చదవటం ఇంపాసిబుల్. అందులో మగవాళ్ళు.." అంది కావ్య.

"అదేంటలా అంటావు? బ్యాక్‌గ్రౌండ్ వెరిఫికేషన్ చేసే ఇస్తారు కదా! ఊరికే చెప్తే నమ్ముతారా ఏంటి? సర్టిఫికెట్స్ అన్నీ చెక్‌చేసే ఉంటారు".

"వీళ్ళ మొహాలకి ఐఐటీ, ఐఐఎమ్ సర్టిఫికెట్స్ ఇదివరకెప్పుడు చూశారనీ, అవి కరెక్టో కాదో సర్టిఫై చేయటానికి?" మొండిగా అంది కావ్య.

"నీవి మరీ అర్థంపర్థం లేని అభిప్రాయాలు, అనుమానాలు. హి ఈజ్ వెరీ ఇంటెలిజెంట్!" ఖచ్చితంగా అంది రోహిణి.

తల పక్కకు తిప్పేసరికి ఇద్దరి మధ్యలో బ్రహ్మి కూర్చుని ఉన్నాడు.

"ఈ రోజన్నా క్లయింట్‌కి, పాచ్ రిలీజ్ చేస్తామా తల్లీ?" ఆశగా అడిగాడు.

"ఏంటండీ... వెటకారమా? ఒక్క వారం రోజులు లేట్ అయినందుకే అలా అడుగుతున్నారు" మొహం మాడ్చుకున్నారు రోహిణి, కావ్య.

"నా మొహానికి అదొక్కటే తక్కువమ్మా! పని అవలేదింకా అంటే పైవాళ్ళు గంటకొకసారి వర్క్ ఎంతవరకూ వచ్చిందో రిపోర్ట్ ఇవ్వమంటారు. అవని పనికి రిపోర్ట్ ఏం రాస్తాను? నాలో ఏ మాత్రం క్రియేటివిటీ ఉన్నా అంతా ఈ రిపోర్ట్‌లు అర్థమయి, అవకుండా రాయటానికే సరిపోతోంది. ఎంతవరకూ వచ్చిందని అడిగితే మీకు కోపం" ఏడుస్తున్నాడో, నవ్వుతున్నాడో తెలీకుండా పెట్టాడు మొహం.

"లెట్‌మీ హాండిల్ దిస్" వచ్చాడు అక్షయ్.

"ఇవాళ ఎట్టిపరిస్థితుల్లోనూ రిలీజ్ చేయిస్తాను" మాటిచ్చాడు.

"కావ్యా, నీ కోడ్‌లో క్రిటికల్ బగ్ ఉంది. అర



# తన జోలికి వస్తే...

*కిక్ బాక్సింగ్‌లో ఒక్క పంచ్ ఇస్తానంటోంది తాప్సీ. తాప్సీ తాజా సినిమా కోసం కిక్‌బాక్సింగ్‌ను చాలా కష్టపడి నేర్చుకుంది. ఏదో సినిమా కోసమని కాకుండా సీరియస్‌గా నేర్చుకుందట! అసలు అబ్బాయిల కన్నా అమ్మాయిలకే కరాటే, కిక్‌బాక్సింగ్ వంటివి నేర్పించాలని అంటోంది. తన జోలికి ఏ ఆకతాయన్నా వస్తే కిక్‌బాక్సింగ్‌తో బుద్ధి చెబుతుందట! అన్నట్టు ఇక గ్లామర్ అవతారానికి దూరంగా ఉండాలని కూడా నిర్ణయించుకుందట! అయితే గ్లామర్ కాకుండా ఎలాంటి పాత్రలు చేయాలన్నది మాత్రం నిర్ణయించుకోలేకపోతోందట!*

గంటలో ఫిక్స్ చేయాలి" అతని గొంతులో అధికారం ధ్వనిస్తోంది.

"కోడ్ రాసేప్పుడే అన్నీ చెక్ చేసుకోవాలి. రెండు వారాల నుంచి మీరు రాసిన కోడ్ ఇదా? ఒక స్టాండర్డ్ ఫాలో అయ్యారా? ఒకసారి మెయిల్ చెక్‌చేసుకో. రివ్యూ కామెంట్స్ పంపాను" సీరియస్‌గా ఉందతని గొంతు.

"నెర్డ్!" గొణుక్కుంటూ మెయిల్ ఓపెన్ చేసింది కావ్య.

"ఇవాళ కొద్దిగా లేట్‌గా ఉండాల్సి వస్తుంది" టెస్ట్ టీమ్‌ని బ్రహ్మీ బతిమాలటం వినిపిస్తోంది.

"రోజూ ఏంటండీ? పగలంతా ఖాళీగా ఉండి ఇంటికి వెళ్ళే టైమ్‌లో ఇంతకోడ్ మా మొహాన కొట్టిపోతారు డెవలప్‌మెంట్ టీమ్ వాళ్ళు. మేము రాత్రంతా ఉండి టెస్ట్‌చేసి చావాలి" కసురుకుంటున్నాడు టెస్ట్ లీడ్ సుధీర్.

"మీరు సరిగ్గా టెస్ట్ చేస్తే ఇన్ని బగ్స్ ఎందుకుంటాయంటారు డెవలప్‌మెంట్ టీమ్ వాళ్ళు. నేనేం చేయనయ్యా" నెత్తి కొట్టుకున్నాడు బ్రహ్మీ.

ప్రతీ సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఇది మామూలే! తను ఇప్పటివరకు అయిదు కంపెనీలు మారాడు. డెవలప్‌మెంట్ టీమ్, టెస్టింగ్ టీమ్ పిల్లీ, ఎలకల్లా కొట్టుకు చస్తుంటారు ఎక్కడయినా. ఉరుమురిమి మంగళంమీద పడ్డట్టు అది ఎప్పుడు ప్రాజెక్టు మేనేజర్ మీద కొస్తుందో తెలీదు. మేనేజ్‌మెంట్‌కూడా టీమ్ జోలికిపోదు. టెక్నికల్ జార్గాన్, బజ్ వర్డ్స్ వాడతారు. అవి అర్థం కాలేదని టీమ్‌కి తెలిస్తే తమ పరువుపోతుందని, ప్రాజెక్ట్ మేనేజర్‌ని నిలదీయటం తేలిక అనుకుంటారు.

ఇష్యూ ఉంటే మాకెందుకు చెప్పలేదంటారు. చెప్తే ఇంకా ముందెందుకు చెప్పలేదంటారు. గంటకొక రిపోర్ట్ పంపమంటారు. దానికి కావలసిన డేటా మళ్ళీ టీమ్‌దగ్గరే ఉంటుంది. వాళ్ళు సహాయ నిరాకరణ చేస్తారు, తమ మీద మేనేజ్‌మెంట్‌కి చెప్పినందుకు.

ఇదంతా ఒక ఎత్తయితే టీమ్‌లో ఎవరినైనా ఆన్‌సైట్ పంపాల్సివస్తే అదింకా పెద్ద తలనొప్పి. ఆన్‌సైట్ వాళ్ళు అక్కడ జల్సాచేస్తూ తమమీద ప్రెజర్ పెడుతున్నారని ఆఫ్‌షోర్ టీమ్ వాళ్ళ అనుమానం! క్లయింట్ ఒత్తిడి తమ మీద ఉంటే ఆఫ్‌షోర్ టీమ్ పని చేయకుండా పట్టించుకోవట్లేదని ఆన్‌సైట్ వాళ్ళ కంప్లయింట్. ఏ కొంచెం తేడా వచ్చినా టీమ్స్ నుంచో, క్లయింట్ నుంచో తన మీద కంప్లయింట్ వెళ్ళిపోతుంది పై వాళ్ళకు.

"ఛా... నా బతుకు" తిట్టుకున్నాడు బ్రహ్మీ.

టెస్ట్‌లీడ్ సుధీర్, టెక్‌లీడ్ అక్షయ్ ఒకళ్ళ నొకళ్ళు భస్మం చేసేలా చూసుకున్నారు.

•••

లంచ్ టైమ్...

కెఫెటేరియా అంతా కోలాహలంగా ఉంది.

ఇటాలియన్, చైనీస్, ఇండియన్... అన్ని కౌంటర్స్ ఉన్నాయి. ఎవరికి కావలసినవి వాళ్ళు తెచ్చుకుని టేబుల్ దగ్గర కూర్చుంటున్నారు. ఇంటినుంచి లంచ్ తెచ్చుకున్న వాళ్ళు బాక్సులు ఓపెన్ చేస్తున్నారు.

"ఈ ప్రాజెక్ట్ మేనేజర్ల వల్లే సమస్యలన్నీ. వీళ్ళు క్లయింట్‌కి, ఇంకో రెండు వారాలు కావాలని గట్టిగా చెప్పొచ్చుగా. రాత్రీపగలూ చేయలేక చస్తున్నాం" ఎవరో అనటం వినిపిస్తోంది.

"వీళ్ళ కోడ్ అంతా తప్పుల తడకే! ఏ మొహం పెట్టుకుని క్లయింట్‌ని టైమ్ అడుగుతాం?" అటుగా వెళ్తూ గొణుగుతున్నాడొక ప్రాజెక్ట్ మేనేజర్.

హర్ష, అక్షయ్ ఒక మూలగా ఉన్న టేబుల్‌వద్ద లంచ్ చేస్తున్నారు.

హర్ష అదే కంపెనీలో రీసెర్చ్ డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తున్నాడు. సన్నగా, పొట్టిగా, చామనచాయలో, కళ్ళజోడు పెట్టుకుని సింపుల్‌గా ఉన్నాడు. అపర మేధావి అనీ, ఎటువంటి సమస్య నయినా చిటికెలో పరిష్కరిస్తాడనీ అతనికి పేరు.

వాళ్ళిద్దరూ ఐఐటీలో క్లాస్‌మేట్స్.

హర్ష చదువైపోగానే ఉద్యోగంలో చేరిపోతే, అక్షయ్ ఐఐఎమ్‌లో చదివి అదే కంపెనీలో చేరాడు.

ఎవరూ వాళ్ళ టేబుల్ దగ్గర కూర్చునే సాహసం కూడా చేయట్లేదు. ఇద్దరూ సీరియస్‌గా ఇండస్ట్రీ ట్రెండ్స్ గురించి చర్చిస్తున్నారు.

హర్ష ఫోన్ బీప్‌మంది.

మెసేజ్ ఓపెన్‌చేసి చూశాడు.

ఒక్కక్షణం షాక్ అయినట్లుగా పెట్టాడు మొహం.

"వెరీ ఫన్నీ" పెద్దగా నవ్వాడు.

"ఎవరో నన్ను ఫూల్‌ని చేయాలని చూస్తున్నారు" అక్షయ్‌కి చూపించాడు.

'వంద హృదయాలు కూడా నీ మీద నాకున్న ప్రేమని మోయలేవు' మెసేజ్ చదివి,

నవ్వాడు అక్షయ్.

చుట్టూ చూశారు.

రోహిణి బర్గర్ తింటూ ఫోన్ చూసుకుంటోంది.

కావ్య ఆమె పక్కనే ప్లేట్‌లో పప్పు, అన్నం కలుపుకోవటం కనిపిస్తోంది.

"నాకు రోహిణి మీద డౌట్" అనుమానంగా అన్నాడు హర్ష.

"ఆమె మొహం! తర్వాత ఏం తినాలో రీసెర్చ్ చేస్తుండి ఉంటుంది ఫోన్లో" కొట్టిపారేశాడు అక్షయ్.

•••

కాన్ఫరెన్స్ రూమ్‌లో పర్‌ఫార్మెన్స్ రివ్యూ మీటింగ్

జరగటం కనపడుతోంది. రూమ్ లోపలి కంటే చుట్టుపక్కల ఉన్న క్యూబ్స్‌లో ఉన్నవాళ్ళకి ఇంకా స్పష్టంగా వినపడుతోంది.

ఆ సంవత్సరం టీమ్ మెంబర్ చేసిన పనిని బట్టి అతని మేనేజర్ ఒక రేటింగ్‌ని, రేటింగ్‌కి అను గుణంగా శాలరీని పెంచటం, ప్రమోట్ చేయటం జరుగుతుంది.

రాజేష్‌కి రిపోర్ట్ చేసేవాళ్ళొక నలభైమంది వరకూ ఉన్నారు.

కావ్య, అక్షయ్, రోహిణి అందరూ అతనికి రిపోర్ట్ చేస్తారు.

టీమ్‌కి ఏవయినా సమస్యలుంటే పరిష్కరించటం, వాళ్ళ కెరియర్ గ్రోత్‌కి సహాయపడి మెంటర్ చేయటం, వాళ్ళు పనిచేసే ప్రాజెక్టుల నుంచి ఫీడ్ బాక్ తీసుకుని వాళ్ళని ఇవాల్యుయేట్ చేసి, రేటింగ్ ఇవ్వటం రాజేష్ బాధ్యతల్లో కొన్ని.

"ఏదీ, నీ పని గురించి నువ్వేం రాసుకున్నావో చూద్దాం".

టూల్ ఓపెన్ చేసి చూశాడు.

రాజేష్‌కి బీపీ పెరిగింది.

'ప్రతిదానికీ లా పాయింట్లు లాగుతున్నాడు' పళ్ళు నూరాడు.

"మిగతావాళ్ళు నాలుగు ప్రాజెక్టులు చేశారు. అయినా ప్రాజెక్ట్ వర్క్ చేయటం అనేది నీ జాబ్. ఎక్స్‌ట్రాగా ఏం చేశావు? కంపెనీ కోసం ఏం చేశావు?" అడిగాడు.

కాస్త పవర్ ఉండి, పైకి వెళ్తున్న కొద్దీ అనవ సరమయిన అహం మొదలవుతుంది కొంత మందిలో. ముఖ్యంగా వర్త్ లేని వాళ్ళలో ఇది మరీ ఎక్కువ. తన లోపాలని అవతలివాళ్ళు ఎత్తి చూపిస్తారనే ఉలుకు అది.

పరిస్థితి అర్థమయింది బాలుకి.

నోరు మూసుకోవటం ఉత్తమమనుకున్నాడు.

వాదనలో తనే గెలిచానన్న ఆనందంతో అన్నా తనని స్పేర్ చేస్తాడు.

అదే జరిగింది.

గొప్పగా ఆర్గ్యూ చేశానన్న తృప్తితో కళ్ళు మెరుస్తుండగా చెప్పాడు రాజేష్.




బాలు రివ్యూ జరుగుతోంది.

మేనేజర్ అది చదువుతున్నంతసేపూ ఇబ్బందిగా కదులుతూనే ఉన్నాడు బాలు.

చదవటం ముగించాడు.

"సో, ఏం రేటింగ్ ఇవ్వచ్చంటావు?" అడిగాడు.

తను ఏమేమి పనులు చేశాడో మళ్ళీ ఏక రువు పెట్టబోయాడు బాలు.

"అవన్నీ నేను చదివాను కానీ, నిజాలు మాట్లాడుకుందామిప్పుడు" అన్నాడు రాజేష్.

ఈ సంవత్సరం తన రేటింగ్ దారుణంగా ఉండబోతోందని అర్థమయిపోయిందతనికి.

"నువ్వు మీటింగ్‌కి లేట్‌గా వచ్చావనీ, ముందు ప్లాన్ చేయకుండా నాలుగురోజులు మానేశావనీ నీ మీద కంప్లయింట్లున్నాయి".

"అవి లాస్ట్ ఇయర్‌వి. రివ్యూ ఈ సంవత్సరా నికి కదా!" లాజిక్ తీశాడు.

గతుక్కుమన్నాడు రాజేష్.

మళ్ళీ సర్దుకుని "కాబట్టే ఈ ఇయర్ నీకు ఎవరూ ప్రాజెక్ట్ ఇవ్వటానికి ముందుకు రాలేదు" అన్నాడు.

"నేను సంవత్సరం పొడుగునా కనీసం రెండు ప్రాజెక్టులలో ఉంటూ వచ్చాను" అన్నాడు బాలు.

ఒక ట్రెయినింగ్ టైమ్‌కి పూర్తి చేయలేదనీ, రెండు బగ్స్ మిస్ చేశాడనీ, ఆటిట్యూడ్ సరిగా లేదనీ, అయినా తను మంచివాడిని కాబట్టి మరీ దారుణ మైన రేటింగ్ ఇవ్వట్లేదనీ చెప్పాడు.

కాసేపటికి డోర్ ఓపెన్ అయింది.

బయటికొచ్చాడు బాలు.

ఏడుపే తక్కువన్నట్లుగా ఉందతని మొహం.

దాదాపు ప్రపంచంలో ప్రతిచోటా, ప్రతి ఇండస్ట్రీ లోనూ ఉన్నట్లే ఐటీ సంస్థల్లోనూ కనిపించని రాజ కీయాలెన్నో! రిక్రూట్‌మెంట్ దగ్గరనుంచీ, పర్ ఫార్మెన్స్ రివ్యూలూ, ప్రమోషన్లూ, ఇలా ఏదో ఒక దాంట్లో ఆశ్రితజన పక్షపాతం ఉంటుంది. ఎవరో ఒకరు వీటికి బలవుతూనే ఉంటారు. అయితే ఇవి రాజకీయాలు కాదనీ, ఆఫీస్‌లో ఆ మాత్రం డిప్లొ మసీ అవసరమే అనీ ఆట బాగా అలవాటయిన వాళ్ళు వాదిస్తుంటారు.

తర్వాత శిల్ప రివ్యూ మొదలయింది.

ఆమె వర్క్ గురించి, ఆమే ఆశ్చర్యపోయేలా, అనుమానపడేలా తనమీద తనే అసూయ పడేలా మెచ్చుకున్నాడు.

ఫ్రెషర్‌గా జాయినయిన బాచ్‌లో ఆమె ప్రతిభ అద్భుతమన్నాడు.

"కానీ ఎస్క్యూఎల్‌లో కొద్దిగా ఇంప్రూవ్ అవ్వాలి. డోంట్‌వర్రీ! రోజూ నాతో మీటింగ్ పెట్టు. నేను నీకు నేర్పిస్తాను. మీ బాచ్‌మొత్తంలో నువ్వేబెస్ట్ అని నిరూపించుకోవచ్చు" చెప్పాడు.

లేచి మెల్లగా ఆమె కూర్చున్న దగ్గరికి వచ్చాడు.

టేబుల్ ఎక్కి అంచుమీద కూర్చున్నాడు.

"ఇవాళ ఈవెనింగ్ ఫ్రీయేనా?" అడిగాడు.

"డిన్నర్‌కి వెళ్దామా?" అన్నాడు.

ఆమె జవాబు బయటికి వినిపించలేదు.

తర్వాత తలుపు తెరుచుకుంది.

శిల్ప బయటికొచ్చింది.

ఆమె మొహంలో ఎక్స్‌ప్రెషన్ ఎవరికీ అర్థం కాలేదు.

•••

అక్షయ్, కావ్య కోడ్‌ని రివ్యూ చేశాడు.

"మచ్ బెటర్! ఈ మూడు బగ్స్ ఫిక్స్ చేయి" చెప్పాడు.

"ఒకటి కాస్తా మూడయ్యాయి. మచ్ బెటర్ అని కాంప్లిమెంట్ ఒకటి" తిట్టుకుంది కావ్య.

కాసేపటికి మళ్ళీ వచ్చాడు. "ఈ రోజవు తుందా?"

పక్కనే కూర్చుని ఏమేమి మార్పులు చేయాలో చెబుతుంటే కావ్య చకచకా పని పూర్తిచేసింది.

దూరంగా బ్రహ్మి టెస్టర్‌ని కాళ్ళు పట్టుకుని ఈడ్చుకు రావటం కనబడుతోంది.

•••

పాంట్రీ నుంచి కాఫీ తెచ్చుకుని కాసేపు ఫోన్ మాట్లాడి లోపలికొచ్చింది కావ్య.

ఏదో తేడాగా ఉంది, వాతావరణమంతా!

ఫ్లోర్ మొత్తం సుగంధపరిమళం.

మగవాళ్ళందరూ కళ్ళు తేలేసి కాన్ఫరెన్స్ రూమ్ వైపుకి ఎగబడి చూస్తున్నారు. కావ్యకి ఏం జరుగు తుందో అర్థం కాలేదు.

తన క్యూబికల్ వైపుకి నడుస్తుండగా కాన్ఫ రెన్స్ రూమ్ డోర్ తెరుచుకుంది. మళ్ళీ పర్‌ఫ్యూమ్ సువాసన అందరినీ చుట్టుముట్టింది.

బయటికి అడుగుపెట్టింది సీమ.

దాదాపు అయిదడుగుల ఎనిమిదంగుళాల ఎత్తుంది. దానికి తోడు హైహీల్స్.. గులాబీ రంగులో ఉందామె.

నడుము వరకూ వదిలేసుకున్న సిల్కీహెయిర్.

మోకాళ్ళు దాటిన నలుపురంగు స్కర్ట్. పైన షాకింగ్ పింక్ టాప్.

చక్కటి ఫీచర్స్.

ఆడవాళ్ళే కళ్ళు తిప్పుకోలేని అందం.

అప్రయత్నంగా అక్షయ్‌వైపు చూసింది కావ్య. అప్పుడే అతనూ అనుకోకుండా ఇటుచూశాడు. రెండు కళ్ళు మూసి, తెరిచి అల్లరిగా నవ్వాడు.

సీమ సరాసరి అక్షయ్ దగ్గరకెళ్ళింది.

అతని డెస్క్‌పై కూర్చొని నవ్వుతూ మాట్లాడు తోంది.

కావ్యకి చెప్పలేనంత దిగులుగా, ఉక్రోషంగా అనిపించింది.

ఎవరినయినా పట్టుకుని నాలుగు తన్నాలని పించింది.

**(ఇంకా వుంది)**

## సరదాగా....

**నీకేమనిపిస్తోంది?**

ఇద్దరు పెద్ద మనుషులు ఒక క్యాంపు కోసం బయటకు వెళ్ళారు. రాత్రి సుష్టుగా భోంచేసి వెంట తెచ్చుకున్న గుడారం వేసుకుని చక్కగా మాట్లాడుకుంటూ నిద్రపోయారు. కొద్దిసేపటి తర్వాత ఒకాయనకు మెలకువ వచ్చింది. రెండో అతన్ని నిద్రలేపి,

"ఈ ఆకాశం, ఈ నక్షత్రాలు చూస్తుంటే నీకు ఏమనిపిస్తుంది?" అని అడిగాడు.

"లెక్కలేనన్ని నక్షత్రాలు కనిపిస్తున్నాయి" అన్నాడు.

"అది సరే వాటి నుంచి నువ్వేమి తెలుసుకున్నావు?"

"జ్యోతిషశాస్త్రం ప్రకారం శని సింహరాశిలో ప్రవేశిస్తున్నాడు."

"ఖగోళ శాస్త్రం ప్రకారం మిలియన్ల కొద్దీ పాలపుంతలు, బిలియన్ల కొద్దీ గ్రహాలు ఈ విశ్వాంతరాళంలో నాకు గోచరిస్తున్నాయి"

"వాతావరణ శాస్త్రం ప్రకారం రేపటి దినం ఆకాశం నిర్మలంగా ఉంటుంది"

...

"ఓరి నీ పాండిత్యం తగలెయ్యా!! మన గుడారం ఎవరో ఎత్తుకుపోయారయ్యా.."

**ఒక ప్రశ్న?**

రామాపురం అనే గ్రామంలో రామన్న, సోమన్న, వీరన్న అనే ముగ్గురు వర్తకులు ఉండేవారు. వారు కేవలం వర్తకులు మాత్రమే కాదు మంచి స్నేహితులు కూడా. వీరిలో రామన్నకి ధైర్యవంతుడు, తెలివైన వాడనే పేరుంది. రామాపురం దగ్గరలోనే ఉన్న కాంచీపురం పట్టణంలో ప్రతివారం సంత జరుగుతుంది. వ్యాపార నిమిత్తమై ప్రతివారం ముగ్గురు స్నేహితులు కలిసివెళ్ళి వస్తుంటారు. అయితే కాంచీపురం చేరుకోవాలంటే దారిలో ఒక అడవి ఉంటుంది. అడవిదాటితే ఆ నగరం వస్తుంది. దొంగల భయం, దయ్యాల భయం, జంతువుల భయంతో సాధారణంగా రాత్రివేళల్లో ఎవ్వరూ ఆ అడవిలో ప్రయాణం చేయరు. ఓసారి సంత ముగించుకుని తిరుగుముఖం పట్టారు ఈ ముగ్గురు స్నేహితులు. అయితే చీకటి పడడంతో కాస్త ఆలస్యం అయింది. ఇదే సమయంలో నలుగురు దొంగలు వారిని చుట్టుముట్టారు. వారి దగ్గరున్నదంతా ఇవ్వాల్సిందిగా బెదిరించి వాళ్ల ముగ్గురినీ బంధించి తీసుకెళ్తుండగా, 'చంపుతా మింగుతా' అంటూ ఒక భూతం ఎదురైంది వారికి. అందరూ భయపడిపోతుండగా, తెలివి, ధైర్యం ఉన్న రామన్న భూతంతో "భూతమా! మేము ఏడుగురం వరసలో నిలబడతాము. మొదటి నుంచి ప్రతి 4వ వాణ్ణి లెక్కపెట్టి తిను. వంతు వచ్చిన మొదటి నలుగుర్ని తిని నీదారిన నువ్వు పో" అని అన్నాడు. అతని ఒప్పందానికి భూతం సరే అంది. రామన్న ఏడుగుర్ని ఒక వరసలో నిలబెట్టాడు. దయ్యం ప్రతి నాలుగవ వాణ్ణి తినేసింది. నాలుగుసార్లూ దొంగలవంతే వచ్చింది. దీంతో అటు దొంగలు, ఇటు దయ్యం రెండింటి పీడ వదిలించేశాడు రామన్న. ప్రశ్న ఏంటంటే రామన్న ఆ ఏడుగురిని వరుసలో ఎలా నిలబెట్టాడు?

**సమాధానం**

రామన్న బాగా ఆలోచించి, సోమన్న, వీరన్నలని 2, 3 స్థానాల్లో నిల్చోబెట్టి, తాను 7వ స్థానంలో నిల్చున్నాడు. దొంగలను 1,4,5,6 స్థానాల్లో నిలబెట్టాడు. దీంతో వరుసలో నిల్చున్న ప్రతి నాలుగవ వాడు దొంగే అయ్యాడు.

పెద్దనోట్లు రద్దు నాకు హాయిగా వుంది పిన్నీ... ఈ 20 రోజుల నుండి యింటి పనులు వంట పనులు అన్నీ ఆయనే....

గంగారావు ATM సెక్యూరిటీ

గవర్నమెంటు సెక్యూరిటీ యివ్వలేదు... ఆయనకి షుగరుందిగా పిన్నీ!! బయట స్వీట్లు తినేస్తున్నారని నేనే ప్రైవేట్ సెక్యూరిటీ పెట్టించా!!

బంగారం లాంటి గోడకి కన్నం పెట్టావు కదరా!! తలుపు గొండిలో నేనే తీసేవాడిని కదా..? మాట కట్టిపెట్టాను.. పట్టుకుపో!!



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 10

(గతవారం తరువాయి)

**'మండలాధీశుడు' నా కెరీర్‌లో ఎంత కీలకమైన చిత్రమో, అంతే ప్రధానమైన సినిమా 'అహనా-పెళ్లంట!'. ఆ చిత్రం విడుదలై దాదాపు మూడు దశాబ్దాలు కావస్తున్నా ఇప్పటికీ 'అహనా-పెళ్లంట!' అనగానే అందరి ముఖాల్లోనూ నవ్వు కనిపిస్తుంది. ఆ సినిమా అవకాశం నాకు వచ్చిన విధానం, అందులో నేను చేసిన 'లక్ష్మీపతి' అనే పాత్రను తీర్చిదిద్దిన తీరు చాలా ఆసక్తికరంగా ఉంటుంది.**

## అరగంట సేపు నా ఒళ్ళు నాకు తెలియలేదు

ఒకరోజు సాయంత్రం హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో కూర్చుని ఉన్నా. మద్రాసు ఫ్లయిట్ అనౌన్స్‌మెంట్ కోసం వెయిట్ చేస్తున్నా. అప్పుడు హైదరాబాద్, మద్రాసు మధ్య ఇప్పుడున్నంత ఫ్రీక్వెంట్‌గా ఫ్లయిట్లు లేవు. పొద్దునొకటి, రాత్రి ఒకటి ఉండేవి. ఎయిర్‌పోర్టులో కూడా ఇప్పుడున్నన్ని రూల్స్ లేవు. వ్యవహారం చాలా ఫ్లెక్సిబుల్‌గా ఉండేది. ఇప్పుడు విమాన ప్రయాణాలు అందరికీ చేరువయ్యాయి కానీ, అప్పట్లో విమానాల్లో తిరగడం చాలా గొప్ప.

'భగవంతుడు మనకు విమానాల్లో తిరిగే అదృష్టాన్ని కల్పించాడు' అని అనుకుంటూ కూర్చుని, అటూ ఇటూ చూస్తున్నా. దూరంగా రామానాయుడు గారు కనిపించారు. ఆయన పక్కన సూట్‌కేసు ఉంది. చేతిలో పేపరేదో ఉంది. దాన్ని తిరగేస్తున్నారు. హీరోలకి ఏమాత్రం తీసిపోని విగ్రహం ఆయనది.

'ఎర్రగా ఉంటాడు. ముక్కు బావుంటుంది. మంచి క్రాఫ్..అందగాడు' అనుకున్నా. అప్పటివరకు ఆయన గురించి వినడమే కానీ ఎప్పుడూ దగ్గర నుంచి చూడలేదు. అదే చూడటం! వెళ్ళి నమస్కారం చెబుదామనిపించింది. కానీ

'చెప్పాలా? వద్దా? అప్పటికే ఇండస్ట్రీలో సురేష్ ప్రొడక్షన్స్ అంటే పేరున్న సంస్థ. ఆ సంస్థ యజమాని, మూవీ మొఘల్ అనిపించుకుంటున్న రామానాయుడుగారు, నేనెళ్ళి విష్ చేస్తే పలుకుతారా? లేదా?' ఇలా నాలో నేనే సవాలక్ష ప్రశ్నలతో సతమతమవుతున్నా.

అంతలోనే చెయ్యెత్తి 'హలో...' అన్నట్టు ఊపారు రామానాయుడుగారు.

కాస్త ధైర్యం వచ్చింది. అప్పటిదాకా నా మనసును పట్టి పీడించిన ప్రశ్నలన్నీ పటాపంచలైపోయాయి.

'శ్రీనివాసరావు.. ఇట్రావయ్యా' అని పిలిచారు నాయుడుగారు.

మరుసటి క్షణం ఆయన ముందు నిలుచున్నా. చేతులు జోడించి వినయంగా, 'నమస్కారం అండీ' అని అన్నా.

'ఇలా కూర్చో' అని కుర్చీ చూపించారు. కూర్చున్నాక..

'నీకో విషయం చెప్పాలయ్యా. అనుకోకుండా నువ్వు ఇక్కడే కనిపించావు. జంధ్యాలతో ఓ సినిమా చేస్తున్నా. ఇవాళే ఫైనలైజ్ అయింది. జంధ్యాలంటే కామెడీనే కదా! చాలా మంచి కథ కుదిరింది' అని చెప్పుకుంటూ పోతున్నారు.

'అంతకు ముందు ఎప్పుడూ ఇద్దరం కలిసిందీ లేదు, ఏమీ లేదు. ఈ విషయాలన్నీ ఈయన నాకెందుకు చెప్తున్నారు? అనుకోకుండా ఇక్కడే కలిశావు అని అంటారేంటి?' అని నా మనసులో అనుమానం మొదలైంది. అయినా పెద్దాయన చెబుతున్నారు కదా అని వినసాగాను.

'చాలా మంచి వేషం ఒకటుందయ్యా. ఫ్రాంక్‌గా చెప్పాలంటే ఆ సినిమాలో ఆ వేషం పండితేనే సినిమా సక్సెస్ అవుతుంది. లేకుంటే ఓ మాదిరిగా ఆడుతుంది. గత 20 రోజుల నుంచి నేను, జంధ్యాల ఒక విషయంలో పోట్లాడుకుంటున్నాం' అని అన్నారు.

'పోట్లాట ఎందుకండీ?' అని అప్రయత్నంగా పైకే అనేశా.

'పోట్లాట అంటే డిస్కషన్ లేవయ్యా. ఆ వేషాన్ని రావుగోపాలరావుతో వేయించాలని నేను సజెషన్ ఇచ్చా.

జంధ్యాలేమో 'వద్దు వద్దు' అని అంటున్నాడు. 'ఏమిటీ? కారణం' అని అడిగితే...

'అది పిసినారి వేషం. పిసినారితనానికి పరాకాష్టగా ఉంటుంది. ఆ పాత్రే సినిమాకు ఆయువు పట్టు. ఎంత మేకప్ చేసినా, ఏం చేసినా గోపాలరావుగారి ఫేస్.. పాపం పూర్‌గా రాదండీ. ఆ రిచ్‌నెస్ ఫేస్‌లో పోదు' అని సమాధానం చెప్పాడు' అన్నారు నాయుడుగారు.

'ఆయన అన్నదీ నిజమే కదండీ. గోపాలరావు గారు అందగాడు. ఎర్రటి స్కిన్, కర్లింగ్ హెయిర్.. చూట్టానికి గొప్పగా ఉంటారండీ' అని అన్నా.

'ఓర్నీ.. జంధ్యాల కూడా అదే అన్నాడయ్యా..

'రావుగోపాలరావుగారికి గుండు కొట్టించాలన్నా, ఇంకోటి చేయాలన్నా కష్టమవుతుంది. ఆయనేమో చాలా పిక్చర్లు చేస్తున్నారు. అయినా ఆ వేషం మీద ఆయనకు నేననుకున్న లుక్ రాదండీ' అని నిన్న గట్టిగా చెప్పాడు జంధ్యాల.

'సరే జంధ్యాల... ఇంతకీ మరి ఆ వేషాన్ని ఎవరితో వేయిస్తావు?' అని అడిగితే,



జంధ్యాల





**అహనా-పెళ్ళంట! సినిమాలో కోటగారికి అవకాశం వచ్చింది. పిసినారి పాత్ర! జుట్టు కత్తిరించారు. పగిలిన కళ్ళజోడు పెట్టారు. కాస్ట్యూమ్స్ తెచ్చిస్తే వేసుకున్నారు కానీ ఇంకా ఏదో చేయాలి, పాత్రకు నప్పాలి అని ఆలోచిస్తున్నారు డైరెక్టర్ జంధ్యాల గారు. ఇంతలో కోటగారు తన చుట్టూ ఉన్నవాళ్ళను పక్కకి జరగమన్నారు. అందరూ చూస్తుండగానే కింద మట్టిలో పడుకొని కాసేపు అటూఇటూ దొర్లారు. కోటగారు అలా ఎందుకు చేశారు? అసలేం జరిగింది?**

'కోట శ్రీనివాసరావుతో చేయిస్తాను అన్నాడయ్యా' అని చెప్పి ముగించారు నాయుడు గారు.

చివరి వాక్యం నాకు చాలా స్పష్టంగా వినిపించింది. అయినా,

నేను విన్నది కలో, నిజమో అర్థం కాలేదు నాకు. అంతలోనే ఆయన అందుకుని,

'నాకు ఆయన చెప్పినప్పుడు నిజంగా నీ మీద అంత నమ్మకం కలగలేదు. కానీ జంధ్యాల అంత గట్టిగా ఎందుకు చెబుతున్నాడా? అని 'మండలాధీశుడు' చూశా. మంచి ఆర్టిస్టువయ్యా. సరే అందులో ఏదో చేశావనుకో... ఆ సంగతి వదిలెయ్. మా సినిమాలో పిసినారి వేషం నీకే ఇచ్చేయాలని డిసైడ్ అయ్యా. నువ్వు చెయ్ బావుంటుంది. ఓ 20 రోజులు డేట్లు కావాల్సి వస్తాయి. మా వాళ్ళు ఎవరైనా వచ్చి కలుస్తారు నిన్ను' అని అన్నారు. నమ్మండి.. ఒక్క అరగంట సేపు నా ఒళ్లు నాకు తెలియలేదు. అంత ఆనందపడ్డా.

ఓ పెద్ద ప్రొడ్యూసర్ తన సంస్థలో ఆఫర్ ఇవ్వడం, అందులోనూ మహానుభావుడు గోపాలరావుగారు వేయాల్సిన వేషాన్ని నాకు ఇవ్వడం... ఆ విషయాన్ని తలచుకునేకొద్దీ గమ్మత్తుగా అనిపించసాగింది. ఎందుకంటే రామానాయుడుగారి సినిమాలో చేయడమంటే నా స్టాండర్డ్ పెరిగినట్టేనని నాకు తెలుసు. ఆయన ఆ క్షణం ఇచ్చిన ఆఫర్ నన్ను ఇంకో మెట్టు ఎక్కించినట్టు అనిపించింది. అందుకే గాల్లో తేలినంత ఆనందం నాలో. ఇప్పట్లాగా సెల్‌ఫోన్లు ఉంటే ఎవరో ఒకరికి ఫోన్ చేసి చెప్పుకునేవాడినేమో! అవేమీ లేవుగా... అందుకే ఒక్కడినే సంతోషపడుతూ కూర్చున్నా.

### అలా మొదలైంది

'అహనా-పెళ్లంట!'కి ఎస్.గోపాల్‌రెడ్డిగారు కెమెరామేన్. దేవరయామిజాలలో ఓ బిల్డింగ్‌లో తీశారు. గుడి పక్కనే ఉంటుంది ఆ ఇల్లు. మొదటి రోజు షూటింగ్ స్పాట్‌కి వెళ్ళా. వైట్ అండ్ వైట్ డ్రస్సు, పైన తెల్ల తువాలు, నెత్తిన తెల్లటి టోపీ పెట్టుకుని ఉన్నారు జంధ్యాలగారు. అంతకు ముందే నాకు ఆయనతో పరిచయం ఉంది. బెజవాడలో ఉన్నప్పుడే ఒకరికి ఒకరం బాగా తెలుసు. కానీ ఎప్పుడూ మాట్లాడుకోలేదు. హైదరాబాద్‌కి వచ్చాకే ఇద్దరి మధ్యా పలకరింపులు మొదలయ్యాయి. నన్ను చూడగానే,

'శ్రీనివాసరావుగారు మీరెన్ని సినిమాలు చేస్తున్నారు?' అని అడిగారాయన.

నేను లెక్కచెప్పడం మొదలుపెట్టా.

'చాలా సినిమాలు చేస్తున్నారు, మంచిది... కానివ్వండి. ఇంతకీ అన్నీ విగ్గులేనా?' అని అన్నారు.

' మరి విగ్గులే పెడతారనుకుంటానండీ. ఇప్పుడైతే రెండు సినిమాలు విగ్గు పెట్టుకుని చేస్తున్నాను' అని అన్నా.

'అయితే పర్లేదులెండి.. రండి' అని అన్నారు.

మా మధ్య ఈ సంభాషణ జరుగుతున్నంత సేపూ ఆయన చూపు, నా క్రాఫ్ వంకే ఉంది. ఎందుకో అర్థం కాలేదు.

సరేనని ఆయన వెంటే వెళ్ళా. పక్కనే గొడ్ల సావిడిలోకి తీసుకెళ్లారు.

'కూర్చోండి' అన్నారు.

కూర్చున్నాక నా తల చుట్టూ ఒక తాడు కట్టారు. అక్కడున్నతనికి జంధ్యాల గారు ఏవో సూచనలిచ్చారు.

అతను సరేనని... ఆయన చెప్పిన షేప్‌లో నా తల జుట్టు కత్తిరించాడు. నన్ను అటూ ఇటూ తిప్పి చూసి, 'ఆ.. లక్ష్మీపతి క్యారెక్టర్‌కి ఓకే. ఇతనికి శిష్యుడిగా వేసే వ్యక్తి ఇంకెలాంటి తల కట్టుతో ఉండాలి?' అని కాసేపు ఆలోచించారు. అక్కడే, పక్కనే ఉన్న బ్రహ్మానందాన్ని కూర్చోపెట్టి అరగుండు చేశారు. అలా ఒక ప్రక్రియ పూర్తయింది.

ఆ తర్వాత కళ్ళజోడు గురించి చర్చ మొదలైంది.

'కళ్ళజోడు మంచిది పెట్టుకుంటే ఆ పాత్రకు అన్యాయం చేసినట్టు అవుతుంది. మరి కళ్ళజోడుని ఎలా పగలగొట్టాలి?' అని అన్నారు డైరెక్టర్‌గారు.

గోపాలరెడ్డిగారేమో.. 'ఆ పని నాకు వదిలెయ్యండి. నేను చేస్తాను' అని చెప్పి ఒక రాయి మీద కళ్ళజోడును పెట్టి వేలితో కేరంబోర్డు కాయిన్‌ని కొడతామే... అలా రెండుసార్లు ఆ గ్లాస్ మీద కొట్టారు. అంతే గ్లాసు చిట్లింది. చిట్లిన అద్దం రాలకుండా విజిబుల్ టేప్ ఉంటుంది కదా... అంటిచ్చినట్టు కూడా తెలియదు. అందుకని దాంతో అతికించారు. కళ్ళజోడుకి ఒకవేపు తాడు కట్టారు. దాంతో కళ్ళజోడు పని పూర్తయింది.

అంతలో నాకు కాస్ట్యూమ్స్ తెచ్చిస్తే వేసుకుని, ఆ కళ్ళజోడు పెట్టుకున్నా.

నన్ను చూసి పక్కనున్న వాళ్ళతో, 'లక్ష్మీపతి దుస్తులు మురిగ్గా ఉంటే బావుంటుందయ్యా. ఇలా నీటుగా ఉంటే అతనికి సూటవదు' అని అన్నారు జంధ్యాలగారు.

'కాసింత తప్పుకోండి' అని అన్నా. నా చుట్టూ ఉన్న వారందరూ దూరం జరిగారు. వెంటనే కింద పడుకుని అటూ ఇటూ కాసేపు దొర్లాను. బట్టలు మురిగ్గా మారాయి.

'ఇలా సరిపోతుందాండీ' అని అడిగా.

అది చూసి 'అదేంటండీ .. అలా దొర్లేశారూ!' అని అన్నారు జంధ్యాలగారు.

'మీరే కదండీ... గుడ్డలు మురిగ్గా కావాలన్నారు' అని అన్నా.

ఆయనేమీ మాట్లాడలేదు. నా భుజం తట్టి అక్కడి నుంచి వెళ్ళిపోయారు. అక్కడి నుంచి షూటింగ్ మంచి ఊపులో పడింది.

ఒకరోజు జంధ్యాలగారు నన్ను పిలిచి, 'మీ ప్రవర్తన చూడగానే మీ బామ్మర్దికి పిచ్చిపట్టాలండీ. పిచ్చి కూడా మామూలు పిచ్చి కాదు. ఒంటిమీద ఉన్న బట్టలు చింపుకోవాలి. ఆ రేంజ్‌లో ఉండాలి. మీ ఫేస్ ఎక్స్‌ప్రెషన్‌తోనే అది జరగాలి. ఎలా చేస్తారో ఆలోచించండి' అని అన్నారు.

మేం మాట్లాడుకుంటున్నప్పుడు అటుగా పక్కనే ఉన్నాడు ఈవీవీ సత్యనారాయణ. 'అహనా-పెళ్ళంట!'కు అతనే కో డైరెక్టర్. తాను చేస్తున్న పని వదిలేసి నా దగ్గరికి వచ్చాడు.

'ఇదిగో పోయిన వారం మనం మాట్లాడుకుంటున్నప్పుడు కళ్ళు రెండూ అదోలా పైకి తిప్పి చూపించావు కదా. ఇప్పుడలా చేయగలవా?' అని అడిగాడు ఈవీవీ.

పరిశ్రమకి వెళ్ళిన కొత్తకదా... నాకు తెలిసిన విద్యలన్నిటినీ ఖాళీ సమయాల్లో ఎవరో ఒకరికి చేసి చూపిస్తూ ఉండేవాడిని. అలా ఒకసారి అంధుడిగా ఉంటే ఎలా ఉంటానో చేసి చూపించా ఈవీవీకి.. అది తనకి చటుక్కున గుర్తుకొచ్చినట్టుంది. జంధ్యాలగారి వైపు చూసి,

'అంధుడిలాగా శ్రీనివాసరావు కళ్ళు భలే పెడతాడండీ' అని అన్నాడు.

అందుకు జంధ్యాలగారు నన్ను చూసి, 'నిజమా? పెడతారా?' అని అన్నారు.

అవునన్నట్టు తలూపా.

'ఏదీ ఒకసారి చెయ్యండి' అన్నారు.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

**ఒంటినిండా చందనం, కళ్ళకు కాటుక, నుదుట తిలకం, మెడలో పూలదండ, పట్టు పంచె, నడుముకు చుట్టుకున్న పైకండువా, చేతిలో చిడతలు, కాళ్ళకు గజ్జెలు... ఇదీ హరిదాసు అవతారం.**

**ఆ వేషంలో ఆదిశేషయ్య 'రుక్మిణీ కల్యాణం' హరికథ చెబుతున్నాడు. రామాలయం ముందు నిర్మించిన వేదిక మీద గజ్జెలు ఘల్లు ఘల్లు మంటూండగా చిడతలు వాయిస్తూ, హుందాగా నాట్యం చేస్తున్నాడు ఆదిశేషయ్య. ఆయన తీయని గొంతుతో పాడుతుంటే చెవులకు వీనులవిందుగా ఉంది. దానికి తగ్గట్లుగా వయొలిన్, తబలా వాయిద్యాలు మోగుతున్నాయి.**

జనం తమను తాము మైమరచి వింటున్నారు. పద్యం పాడితే పసందుగా ఉంటుంది. పాట పాడితే పరవశత్వం కలుగుతుంది. సన్నివేశాన్ని వర్ణిస్తూ వచనం చెబుతూంటే ఆయా






# బాల హరిదాసు

## -పోట్లూరు సుబ్రహ్మణ్యం

పాత్రల్లో జనం లీనమైపోతారు.

శ్రీకృష్ణుణ్ణి చూసి సిగ్గుల మొగ్గయ్యే రుక్మిణీ పాత్రలో పరకాయ ప్రవేశం చేసి చిలుకపలుకులు పలికేవాడు. మధురంగా పాటపాడుతూ నాట్యం చేసేవాడు. రుక్మిణీని తన రథంలో అపహరించుకుని వెళ్లే సన్నివేశంలో ఆమె సోదరుడు రుక్మి యుద్ధానికి వస్తే కృష్ణుడు అతనితో వీరోచితంగా పోరాడుతాడు. ఆ సన్నివేశంలో విల్లు ఎక్కుపెట్టి బాణం వేసే సన్నివేశాన్ని ప్రేక్షకుల కళ్ళముందు జరిగినట్లే నటించి చూపేవాడు.

ఆదిశేషయ్య హరికథ అంటే ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో గొప్పపేరు. ఆయన హరికథలు పల్లెల్లోనే కాదు, పట్నాల్లో కూడా బాగా సక్సెస్ అయ్యాయి. చాలా ఇంటరెస్టింగ్‌గా చెప్పేవాడు. జనం కూడా అంతే ఇంటరెస్టింగ్‌గా వచ్చేవారు. హరికథ అనంతరం పట్నాల్లో అయితే పళ్లెం నిండుగా కరెన్సీ కాగితాలు పడేవి. పల్లెల్లో అలా కాదు. ఊళ్లోనే ఉండి ఒక్కో కథని వారం రోజుల పాటు వివరంగా చెప్పేవాడు. అతనికి, అతని పరివారానికి వారం రోజులపాటు భోజనాలు, వసతి గ్రామపెద్ద ఏర్పాటు చేసేవాడు. రోజూ మంగళం చెప్పినప్పుడు హారతి పళ్లెంలో చిల్లర నాణేలు పడేవి.

ఆఖరిరోజు హరిదాసుకు సన్మానం చేసేవారు. బస్తాలతో ధాన్యం ఇచ్చేవారు. ఆ ధాన్యాన్ని బండ్లలో ఇంటికి చేర్చేవారు. ఈ విధంగా సంక్రాంతి పోయిన తరువాత ఖాళీగా ఉన్న రైతులకు, వారి కుటుంబాలకు, కూలీలకు, వారి పిల్లలకు ఈ హరికథలు మంచి కాలక్షేపం. కుర్రవాళ్ల పట్టణాలకి వెళ్లి సినిమాలు చూసినప్పటికీ, గ్రామం వదలని పెద్దవాళ్లకు, ఆడవాళ్లకు, సినిమాలంటే ఇష్టం లేని వారికీ, ఇదో మంచి కాలక్షేపం. నాలుగు రోజులు ఇంట్లో విశ్రాంతి తీసుకుని మళ్లీ ఇంకో గ్రామానికి ప్రయాణం కట్టేవాడు.

ఇలా వచ్చే ధాన్యం భోజనానికి సరిపోతే,

పట్నాల్లో వచ్చే డబ్బులు మిగతా కూరలకూ, ఇతర ఖర్చులకూ పెట్టుకునేవాడు ఆదిశేషయ్య. రోజులు సుఖంగానే గడిచిపోతున్నాయి. ఆదిశేషయ్యకు ఇద్దరు కూతుళ్లు, ఒక కొడుకు. ఇద్దరు కూతుళ్లకూ తగిన సంబంధాలు చూసి, పెళ్లి చేశాడు. కొడుకు పదవ తరగతి చదువుతున్నాడు.

ఆదిశేషయ్యకు తన కొడుకును బాగా చదివించాలని కోరిక. వాడిని మంచి ఉద్యోగంలో చూడాలనేది అతని ఆలోచన. కారణం రోజురోజుకీ హరికథల మీద ప్రజలకు ఆసక్తి తగ్గిపోతూ ఉంది. ఈ టి.వి.ల వల్ల పల్లెప్రజల్లో చాలా మార్పులు వచ్చాయి.

కాని ఆదిశేషయ్య కొడుకు అక్షయకుమార్‌కి మాత్రం చదువు అబ్బడం లేదు. ఒట్టి మట్టిబుర్ర! మట్టిబుర్ర అనేకంటే అతనికి చదువంటే ఆసక్తి లేదు. ఇంట్లో వాళ్ల బాధపడలేక చదువుతున్నాడు. వాడి ఫ్రెండ్సేంటో, వాడేంటోగా ఉంటాడు. వాడికి ప్రస్తుత పరిస్థితి వివరించి, చదువుకోవాల్సిన అవసరం గురించి నొక్కి చెప్పేవాడు. నయాన భయాన ఎంతచెప్పినా, అది కొడుకు బుర్రకు ఎక్కేది కాదు.

వీడికి మంచి బ్రతుకు బ్రతికే అదృష్టం లేదనుకున్న ఆదిశేషయ్య, తనలాగే ఇక హరికథలు చెప్పుకొని బ్రతకవలసిన వాడే అని నిర్ణయించుకుని హరికథలు నేర్పడం మొదలుపెట్టాడు. కాని అదీ వాడికి నేర్చుకోవడం చాలా కష్టమయిపోయింది. అనేకసార్లు తనతోపాటుగా పల్లెలకు తీసుకువెళ్ళాడు కొడుకుని. వాళ్లకి పరిచయం చేశాడు. తన తదనంతరం తన కొడుకే హరిదాసని, తనని ఆదరించినట్లు అతన్నీ ఆదరించమని అందరినీ వేడుకున్నాడు. కాని కొడుకు అక్షయకుమార్‌కి హరికథలు చెప్పడం ఏమాత్రం ఇష్టంలేదు. ఎంతసేపటికీ ఫ్రెండ్స్, తిరుగుళ్లు...

రోజులు గడుస్తున్నాయి. వీడెలా బ్రతుకుతాడో నన్న దిగులు ఎక్కువయిపోయింది ఆదిశేషయ్యకు. ఆ దిగులుతో ఒకరోజు పక్షవాతం వచ్చి మంచాన పడ్డాడు. టౌనులో ఆదిశేషయ్యకు ఒక చిన్న పెంకుటిల్లుంది. ఆదిశేషయ్యకు వైద్యం చేయిస్తూ ఎలాగో

> **అతడు హరికథ చెబుతూంటే జనం మైమరచిపోతారు. గొంతువిప్పి పాట పాడితే పరవశులవుతారు. సన్నివేశాన్ని వర్ణిస్తూ అతడు హరికథ మొదలుపెట్టాడంటే ఎంతసేపయినా అలా వింటూ కూర్చోవాల్సిందే! కానీ అతడికి కొడుకు గురించే దిగులు. వాడిది ఒట్టి మట్టిబుర్ర! ఇంతలో అతడు మంచాన పడ్డాడు. బతుకుదెరువు కష్టమైంది. ఆ సమయంలో అతడేం చేశాడు?**

కొన్ని నెలలు నెట్టుకొచ్చింది అతని భార్య. అతడికి కొంతవరకు నయమయింది. తన పని తాను చేసుకుంటాడు గాని, మాట ఇంకా బాగా రాలేదు.

ఒకరోజు ఆదిశేషయ్య భార్య, కొడుకుని పిలిచి, "నాయనా... మీనాన్న సంపాదించి దాచిన ధాన్యంతో, డబ్బుతో ఇన్ని రోజులు గడిచాయి. ఇంట్లో ఇక రూపాయిబిళ్ళ లేదు. నువ్వు ఏదో ఒక ఉద్యోగం చేసుకుని డబ్బులు తెస్తే తప్ప ఇక రోజు గడవదు" అంది కన్నీళ్లతో.

"పదోక్లాసు ఫెయిలయిన వాడికి ఉద్యోగం ఎవరిస్తారు? నేనేమని అడిగేది?" అని విసుక్కున్నాడు అక్షయకుమార్.

"అవున్నాయనా! ఇప్పుడేడిస్తే ఏం లాభం. ముందు ఖర్చులకి డబ్బులు చూడు"

అక్షయకుమార్‌కి ఏమీ పాలుపోవడం లేదు. మిత్రులు ఆటో అద్దెకు తీసుకుని తోలమన్నారు. బేల్దారు కూలిపనికి వెళ్లమన్నారు మరికొందరు. అలాంటి పనులే కాస్త తేలిగ్గా దొరికే పనులు. వాటిని తాను చేయలేడు. తన అసమర్థత గురించి ఇంట్లో చర్చించాడు. తండ్రి కళ్ళ నీళ్ల పెట్టుకున్నాడు.

"మీ నాన్నకు ఈ చుట్టుపక్కల ఉన్న పేరుప్రతిష్టలు మంటగలిపి కూలికి పోతావా? మీనాన్న దగ్గర హరికథలు కూడా నేర్చుకోలేక పోతివి. ఎందుకురా నీ బ్రతుకు" తల్లి ఏడ్చింది.

రాత్రంతా ఆలోచించిన అక్షయకుమార్ ఒక నిర్ణయానికి వచ్చాడు. అదేమిటంటే తాను హరికథలు చెప్పాలి. తన తండ్రి చెప్పే పాత పద్ధతిలో తను చెప్పలేడు. ఎందుకంటే తనకా హరికథలు వంటబట్టలేదు. అంతేకాకుండా ప్రజల ట్రెండ్ మారిపోయింది. దానికి అనుగుణంగా హరికథలు చెప్పి సంపాదించాలి.

నిద్రలేవగానే తన మిత్రులతో చర్చించాడు. అందరూ అదే బాగుందన్నారు. వెంటనే తన మిత్ర బృందంలోనే ఒకడికి ఆర్కెస్ట్రా ఉంది. వాళ్లను మాట్లాడుకున్నాడు. తరువాత ప్రెస్‌కి వెళ్లి పాంప్లెట్స్ వేయించాడు. ఆ దసరా ఉత్సవాల్లో తన తండ్రికి బాగా పరిచితమైన 'వేదాయపాలెం' అనే గ్రామం ఎన్నుకున్నాడు. విజయదశమి నవరాత్రుల్లో తొమ్మిది రోజులకు తొమ్మిది కథలు ఎన్నుకున్నాడు.

'నూతన ఆర్కెస్ట్రాతో అధునాతన సినిమా కథలు హరికథలుగా చెప్పబడును' అన్నది పాంప్లెట్ యొక్క హెడ్డింగు.

మొదటిరోజు అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీ నటించిన 'ప్రేమనగర్', రెండవరోజు, ఎన్.టి. రామారావు, శ్రీదేవి నటించిన 'వేటగాడు', మూడవ రోజు శోభన్‌బాబు, మంజుల నటించిన 'మంచి మనుషులు', నాలుగవరోజు కృష్ణ, విజయనిర్మల నటించిన 'మోసగాళ్లకు మోసగాడు', అయిదవ రోజు చిరంజీవి, మాధవి నటించిన 'ఖైదీ', ఆరవ రోజు మోహన్‌బాబు, దివ్యభారతి నటించిన 'చిట్టెమ్మ మొగుడు', 'ఏడవరోజు నాగార్జున, అమల నటించిన 'శివ' ఎనిమిదవ రోజు వెంకటేష్, మీనా నటించిన 'సుందరకాండ', తొమ్మిదవరోజు బాలకృష్ణ, రోజా నటించిన 'భైరవద్వీపం'.

ఈవిధమైన హరికథలు ఆదిశేషయ్య కొడుకు అక్షయకుమార్ చెబుతాడనేసరికి పెద్దవాళ్లకు ఆశ్చర్యంగానూ, యువకులకు ఉత్సాహంగానూ, పిల్లవాళ్లకు సంబరంగానూ ఉంది. 'పిల్ల హరిదాసు అక్షయకుమార్ హరికథ' అంటూ చుట్టుపక్కల ఊళ్లకు పాకిపోయింది.

మొదటిరోజు వేదిక ముందు జనం గుమిగూడారు. స్టేజీమీద అక్షయకుమార్ తెల్లప్యాంటు, తెల్లషర్టుతో టక్ చేశాడు. హిప్పీజుట్టు కాకిగూడులా దువ్వాడు. కాళ్లకు నల్లని బూట్లు తొడుక్కున్నాడు. చేతిలో చిడతలు, కళ్లకు కూలింగ్ గ్లాసులు...

వెనుక ఆర్కెస్ట్రా మొదలుకాగానే హరికథ మొదలుపెట్టాడు. మొదట దర్శకుడు, నిర్మాత పేర్లు చెప్పాడు. తరువాత నటీనటుల పేర్లు చెప్పాడు. తరువాత కథ చెప్పడంలో లీనమయి



## గ్లామర్ చూపించబోతున్న గోపికమ్మ

'ముకుంద' సినిమాలో 'గోపికమ్మా...' పాటను ఎవరూ అంత త్వరగా మరిచిపోలేరు. ఆ పాటలో నటించిన పూజాహెగ్డేనూ మరిచిపోలేరు. ఈ సినిమా తరువాత బాలీవుడ్ బాట పట్టిన పూజా తిరిగి టాలీవుడ్‌కి వచ్చేసింది. ఇప్పుడు 'దువ్వాడ జగన్నాథం' డిజె సినిమాలో తనలోని గ్లామర్ అంతా చూపించబోతోందట! ఈ సినిమాలో కొత్త పూజా దర్శనమిస్తుందట! ఇక నుంచి గ్లామర్, స్కిన్‌షోకీ, లిప్‌లాక్‌లకీ ఎలాంటి అభ్యంతరం చెప్పనని కూడా ఈ అమ్మడు సెలవిస్తోంది. మొత్తానికి బాలీవుడ్ సినిమా ఫ్లాప్ పూజా మీద బాగానే పనిచేసింది అంటున్నారు టాలీవుడ్ జనాలు.

పోయాడు.

"తనకు జమీందారు ఇంట్లో దొంగతనం ఆరో పింపబడినప్పుడు పిల్ల జమీందారు అయిన అక్కి నేని నాగేశ్వరరావు, తన సెక్రటరీ అయిన హీరో యిన్ వాణిశ్రీని తన కారులో ఇంటికి దూరంగా తీసుకుని వచ్చి కారాపి, కిందికి దిగిన వాణిశ్రీతో 'లతా! ఎందుకు చేశావీ పని' అని అడుగుతాడు. అప్పుడు వాణిశ్రీ ముఖం మొదట వెలవెల పోగా, తరువాత అవమానంతో ఆమె ముఖం కందగడ్డలా మారుతుంది. ఇప్పుడు అందరూ ఒక్కసారి 'శ్రీమ ద్రారమణ గోవిందో అనండి" నడుం మీద చేయి పెట్టుకుని నాట్యం చేస్తూ అన్నాడు అక్షయ కుమార్.

సినిమా పిచ్చితో ఒక్కో సినిమాను పదిసార్లు చూసే అక్షయకుమార్, ముందురోజు, క్యాసెట్లో సినిమాను మళ్ళీ మళ్ళీ చూసి, దాన్ని అనుకరిస్తూ సినిమాను చూసిన విధంగా ప్రతి పాత్రలోనూ పరకాయ ప్రవేశం చేసి ప్రేక్షకులకు సదరు సినిమా చూపించాడు. ప్రజల్లో విపరీతమైన స్పందన వచ్చింది. పళ్లెంలో ఈసారి డబ్బులు బాగా పడ్డాయి.

ఇదే పద్ధతిలో మిగతా సినిమాలను కూడా




ప్రేక్షకులకు కళ్లకు కట్టినట్లు చెప్పిన పిల్ల హరి దాసు, మోడరన్ హరిదాసుగా కూడా పేరు పడ్డాడు. ఇంతకు ముందు తన తండ్రి... రాత్రి తొమ్మిది గంటలకు హరికథ మొదలుపెట్టి, వేకు వజాము కోడికూసే వరకూ చెబుతూ ఉండే వాడు. ఇప్పుడు అక్షయకుమార్ అలా కాదు. రాత్రి ఎనిమిది గంటలకు మొదలుపెట్టి పదకొండుగంట లకు ముగించేస్తున్నాడు. ఇది ప్రేక్షకులకు బాగా నచ్చింది.

కొడుకు డబ్బు తెచ్చి తండ్రి ముందు పోశాడు. తండ్రి చాలా సంతోషించాడు, తన కంటే కొడుకు బాగా ప్రయోజకుడయినందుకు! మాట రాదు కనుక కళ్లతోనే కొడుకుని ఆశీర్వదించాడు.

ఆరోజు తన దగ్గర పనిచేసే వయొలినిస్టు, తబ లిస్టు వచ్చి తనకా విషయం చెప్పినప్పుడు మొదట ఆదిశేషయ్య నివ్వెరపోయాడు. తరువాత చాలా బాధపడ్డాడు. చేతులకు, నోటికి పక్షవాత మొచ్చినా చెవులకు మాత్రం రాలేదు. వాళ్ళు చెప్పినదేం టంటే.. అక్షయకుమార్ తమను పక్క వాయిద్యా లకు తీసుకువెళ్లటం లేదని, మోడరన్ ఆర్కెస్ట్రాతో సినిమా కథలను హరికథలుగా చెప్పి హరికథా కళను భ్రష్టుపట్టిస్తున్నాడని! దాంతో తబలిస్టు, వయొలినిస్టులకు జీవనం కరువయ్యింది.

ఆదిశేషయ్య కళ్లలో క్రోధం కనిపించింది. ఆయన సైగలనందుకొని లోపలికెళ్ళి ఆయన భార్య కొంత డబ్బు తెచ్చి ఇద్దరు విద్వాంసుల చేతుల్లో పెట్టింది.

స్నేహితులతో నగరమంతా బలాదూరుగా తిరిగి రాత్రి పొద్దుపోయి వచ్చిన కొడుకుతో, "నువ్వు హరికథలు చెప్పే పద్ధతి మీనాన్నకు నచ్చలే దురా! చాలా బాధపడ్డాడు. మీ నాయన చెప్పిన పద్ధతిలోనే నువ్వూ హరికథలు చెప్పు నాయనా" అంటూ వేడుకుంది తల్లి.

"ఎప్పుడూ పాత చింతకాయ పచ్చడి కథ లేనా? నాకు చేతినిండా డబ్బులొస్తున్నాయి. ప్రజలు పిజ్జాలు, బర్గర్లు ఇష్టపడుతున్నారు. అరిసెలు, అప్ప డాలను అసహ్యించుకుంటున్నారు. నేను హరి కథలు చెప్పే పద్ధతి ఇంతే! ఆనాటి పద్ధతులు అనుసరించను" అని ఖండితంగా చెప్పేశాడు అక్షయ కుమార్.

తల్లి నిస్సహాయంగా తల వాల్చింది. తండ్రి కళ్లల్లోకి నీళ్ళు ఉబికాయి.

ఆ రాత్రి అక్షయకుమార్‌కు ఒక కల వచ్చింది. ఆ కలలో అతనికి తేజోవిరాజితుడైన ఒక వృద్ధుడు కనిపించాడు. లావైన మీసాలు మెలి తిరిగి ఉన్నాయి. ముఖాన వెడల్పైన బొట్టు, భుజం మీద నుండి నడుం వరకు చుట్టిన పట్టు కండువా, మెడలో పులిగోరు పతకం, ముంజేతికి బంగారు కంకణం, చేతిలో పొన్నుకర్ర... అతనెవరో కాదు, హరికథా పితామహుడు ఆదిభట్ల నారా యణదాసు!

ఆయన కళ్లల్లో ఎంత వెలుగున్నా, ముఖంలో విచారం మాత్రం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఆయన చివరి దశలోని నారాయణదాసు రూపం.

అక్షయకుమార్ అప్రయత్నంగా రెండు చేతు లెత్తి నమస్కారం పెట్టాడు. "నువ్వెవరివి తాతా" అన్నాడు భయంభయంగా.

"నువ్వు... తాతా అన్నందుకు చాలా సంతోషంగా ఉంది నాయనా. నాపేరు ఆదిభట్ల నారాయణ దాసు. మాది నాటి శ్రీకాకుళం జిల్లా, నేటి విజయ నగరం జిల్లాలోని పార్వతీపురానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో ఉన్న అజ్జాడ గ్రామం నాయనా. నేను ఆగస్టు చివరితేదీన 1864వ సంవత్సరంలో పుట్టాను. సరిగ్గా ఇప్పటికి 150 సంవత్సరాల క్రితం అన్నమాట" ఆగాడు నారాయణదాసు.

"నువ్వా తాతా! మా నాయన నిన్ను పదేపదే మెచ్చుకునేవాడు. ప్రతి హరికథకు ముందు నిన్ను తలచుకుని, హరికథ ప్రారంభించేవాడు."

"అవును నాయనా... ఆ హరిదాసునే! కాని నువ్వు మా హరిదాసుల పరంపరలో చెడబుట్టావు నాయనా!"

"అదేంది తాతా... అట్లంటావు. ఈ మోడరన్ యుగంలో హరికథలు వినేవాడే లేడు. అట్లాంటి దానికి నేను జవసత్వాలు కల్పించి మళ్ళీ జనాన్ని హరి కథల వైపు మళ్ళించాను, నా టెక్నిక్స్‌తో! కాలానికి తగ్గట్లు మారాలి తాతా" ధైర్యంగా అన్నాడు అక్షయ కుమార్.

"మనవడా, నీ ఆలోచన నాకు నవ్వు తెప్పి స్తోంది. నీ పద్ధతి అవలంబిస్తే చివరకు హరికథ అనే కళ నామరూపాల్లేకుండా పోతుంది. మనిషి పుట్టినప్పటి నుంచి నేలమీద కాళ్లతోనే నడుస్తు న్నాడు. అలాకాక కాళ్లు పైకెత్తి చేతులతో నడిస్తే నువ్వు చెప్పినట్లు కొంతకాలం వినోదంగా, విచి త్రంగా, జనం గుంపులుగా కూడా చూస్తారు. అదొక వింత. అదీ కొంతకాలమే! తరువాత దాన్ని పిచ్చి అని ప్రచారం చేసి ఏవగించుకుంటారు.." ఆగి గాలి పీల్చుకున్నాడు నారాయణదాసు. మళ్ళీ మొదలుపెట్టాడు. "మేము చదువూ సంధ్యాలేక పోయినా సంగీత పరిజ్ఞానం, నాట్య పరిజ్ఞానం కలిగి, హరికథల్ని ఇంపుగా చెప్పేవాళ్ళం. కొన్ని కథల్ని సొంతంగా తయారు చేసుకునేవాళ్లం. సంస్కృతంలో కూడా హరికథల్ని చెప్పి ఆంధ్రా లోనే కాక మైసూరు, మహారాష్ట్ర, ఒరిస్సా. ఇంకా అనేక రాజుల దగ్గర, సంస్థానాధీశ్వరుల దగ్గర అనేక సన్మానాల్ని పొందినవాడిని. నువ్వు వ్యాపా రధోరణి గల సినిమా కథల్ని నీ విచిత్ర వేషధార ణతో చెప్పి హరికథల్ని భ్రష్టు పట్టిస్తున్నావు. నువ్వు అలాంటి కథలు చెప్పనని నాకు మాటియ్యి. లేకపోతే నిన్ను భూతంలా పట్టి గొంతు పిసికి చంపేస్తాను" అన్నాడు గుడ్లురిమి.

అక్షయకుమార్ భయపడి పోయాడు. ముస లితాత అన్నంత పనీ చేసేటట్లున్నాడు. అతనికి ఏమీ పాలుపోలేదు. చచ్చిపోవడం కంటే జీవన పోరాటమే మేలుగదా అనుకున్నాడు.

"అలాగే! నీకు మాటిస్తున్నాను తాతా! మంచి గురువు వద్ద జేరి హరికథలు నేర్చుకుంటాను. సంప్రదాయ పద్ధతిలో కథలు చెప్పి హరిదాసు లకు మంచిపేరు తెస్తాను. నన్ను వదులు తాతా" దయ్యాలంటే భయపడే అక్షయకుమార్ వణికి పోతూ అన్నాడు.

హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణ దాసు శాంతించాడు. ప్రేమతో అక్షయకుమార్‌ని దీవించాడు.

కల చెదిరింది. కర్తవ్యం ముందు కనిపిం చింది.

**సెల్: 94911 28052**

## హెచ్‌ఐవి, హెర్పిస్‌లకు చికిత్స ఉంది

హెచ్ఐవి సోకితే మరణం తప్పదనే భావన ఇప్పటికి చాలా మందిలో ఉంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

### హెర్పిస్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

### హోమియో చికిత్స

హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్సపనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది.

## హెపటైటిస్ వైరస్ కట్టడి సాధ్యమే

**హెపటైటిస్ :** హెపటైటిస్ వైరస్ ప్రభావం ప్రధానంగా కాలేయంపై ఉంటుంది. ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. అయితే హెపటైటిస్ బి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీ సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం జరుగు తుంది. అజీర్తి, పొట్ట ఉబ్బరంగా అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. అడ్వాన్స్ స్టేజ్‌కు వెళ్లినట్లయితే బరువు కోల్పోవడం, వికారం, వాంతులు, ఏకాగ్రత లోపించడం, కుడివైపు పొట్టలో నొప్పి, కాలేయం వాపు వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంత మైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయంలో పేరుకుపోయిన కొవ్వు నిలువలను తగ్గించడం హోమియోతో మాత్రమే సాధ్యమవుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## రోజూ నొప్పులుంటే బతుకు నరకమేగా?

మానవుని శరీరంలో సుమారు ఆరువందల యాభై కండరాలు ఉంటాయి. ఇవి శరీర బరువులో సగభాగం ఉంటాయి. కండరాలు కట్టలుగా కట్టబడిన కొన్ని పీచునారలు(ఫైబర్)కలిగి ఉంటాయి. వీటివలన కండరాలకు కుదించుకుపోవడం, మళ్లీ తరువాత తమ పూర్వస్థితికి వచ్చే సామర్థ్యం ఉంటుంది. కండరాలు ఎముకలకు టెండాన్స్‌లో కలప బడతాయి. కండరాలు శ్రమించినపుడు లాక్టిక్ యాసిడ్ అనే రసాయనాన్ని విడుదల చేస్తాయి. ఈ రసాయనం వలన కండరాలు తొందరగా అలసటకు లోనవుతాయి. కండరాల నొప్పి సాధారణమైన సమస్య. ఇది ఒకటి లేక చాలా కండరాల వలన రావచ్చు. ఈ నొప్పి లిగమెంట్స్, టెండాన్స్, ఎముకలు లేదా శరీరఅవయవాల వలన కూడా రావచ్చు.

### కారణాలు

గాయాలు, కండరాలుపై ఎక్కువ ఒత్తిడి పడటం, వ్యాయామం, శారీరక శ్రమ అధికంగా ఉండటం, శరీరంలో పొటాషియం, కాల్షియం మోతాదు తగ్గడం, ఏసీఈ ఇన్‌హిబిటర్స్, బి.పి కి వాడే మందులు, కొకైన్, స్టాటిన్స్ అంటే శరీరంలో కొవ్వుని తగ్గించే మందులు వాడటం వలన రావచ్చు. ఇన్‌ఫ్లూయెంజా, మలేరియా, కండరాలపై గడ్డలు, పోలియో వంటి ఇన్‌ఫెక్షన్ల వల్ల రావచ్చు. ఫైబ్రోమయాల్జియా, డెర్మటో మైటోసిస్ వంటి వ్యాధుల వల్ల వచ్చే అవకాశం ఉంది.

### హోమియో వైద్యం

నొప్పి నివారణ మాత్రలు వేసుకోవడం వల్ల తాత్కాలిక ఉపశమనం ఉంటుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది. కండరాల నొప్పులు శాశ్వతంగా తగ్గిపోతాయి. ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

## తల తిరుగుతోందంటే...!

**నిలుచుంటే** ఎక్కడ పడిపోతామనే ఫీలింగ్. తల గిర్రున తిరుగుతున్నట్లు అనిపిస్తుంటుంది. ఈ సమస్యకు సర్వైకల్ స్పాండిలోసిస్ కూడా కారణం కావచ్చు. అంటే మెడ వెన్నుపూసలో మార్పులు రావడం వల్ల వివిధ రకాల లక్షణాలు కనిపిస్తాయి. అందులో వర్టిగో ఒకటి. ఈ సమస్య పురుషుల్లో తొందరగా, ఎక్కువగా వస్తుంది. వయసు పెరిగే కొద్దీ వృద్ధులలో 90 శాతం పైన వెన్నుపూసలలో మార్పులు చూస్తాము. 40 ఏళ్లు దాటిన పురుషుల్లో వెన్నుపూసకు సంబంధించిన మార్పులు సర్వసాధారణమని పరిశోధనల్లో తేలింది. వెన్నుపూసలో మార్పుల వల్ల నరాల మీద ఒత్తిడి ఏర్పడి మెడనొప్పి వస్తుంది. మెడ పట్టి వేయడం, తలనొప్పి, కళ్లు తిరగడం, భుజాలు, చేతుల నొప్పి, తిమ్మిర్లు ఉంటాయి.

### లక్షణాలు ఇలా ఉంటాయి

తలతిరగడం, మెడ పైభాగంలో నొప్పి రావడం, మెడ అటూ ఇటూ తిప్పలేకపోవడం, ముందుకు వంగినప్పుడు మెడలో నొప్పి ఎక్కువ కావడం, మెడ నుంచి భుజాల వరకు లాగినట్లు నొప్పి రావడం, క్రమంగా చేతులకు రావడం జరుగుతుంది. పైకి చూసే కళ్లు తిరగడం, ఛాతీ భాగంలో నొప్పి, సూదులు పొడిచినట్లుగా నొప్పి, కండరాల రిఫ్లెక్స్‌లో మార్పులు, మల మూత్ర విసర్జనలపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది.

### హోమియో వైద్యం

హోమియోలో సర్వైకల్ స్పాండిలోసిస్‌కు కచ్చితమైన చికిత్స ఉంది. ఈ చికిత్సను ఓపికగా కొన్ని నెలలు తీసుకుంటే వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ కండరాలకు బలం చేకూర్చవచ్చు. ఆపరేషన్ వరకు వెళ్లాల్సిన అవసరం తప్పుతుంది. హోమియో మందుల వల్ల ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు. వ్యాధి పునరావృతం ఉండదు.






# ఆయనకెందుకీ బాధ్యత

**పార్లమెంట్‌లో మోదీకి సమాధానం చెప్పడానికి మన్మోహన్ సింగ్‌ను ఎంపిక చేసి కాంగ్రెస్ పెద్ద తప్పు చేసినట్టు కనిపిస్తోంది.**

**పెద్ద నోట్ల రద్దు మీద ప్రధాని నరేంద్ర మోదీకి పార్లమెంట్‌లో సమాధానం ఇవ్వడానికి కాంగ్రెస్ పార్టీ మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్‌ను ఎంచుకుని పెద్ద తప్పు చేసినట్టు కనిపిస్తోంది. పెద్ద నోట్లను రద్దు చేయడం 'వ్యవస్థీకృత దోపిడీ', 'చట్టబద్ధమైన లూటీ' అంటూ మన్మోహన్ అభివర్ణించడం ప్రజల్లో అంతగా ఆదరణ పొందడానికి అవకాశం లేదు.**

ఆయన పదేళ్ళపాటు ప్రధానిగా ఉన్న కాలంలో భారతదేశ చరిత్రలోనే అతి పెద్ద కుంభకోణాలు అనేకం చోటు చేసుకున్నాయి. అందులో ఒక కుంభకోణంతో ఆయనకు కూడా అంతో ఇంతో సంబంధం ఉందనే ఆరోపణలు కూడా వినవచ్చాయి. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే అవినీతి నిర్మూలన గురించి మాట్లాడడం ఆయనకు తగ్గట్టుగా లేదు. ఆయన పదేళ్ళ పదవీ కాలంలో అవినీతి కార్యకలాపాలు తప్ప చెప్పుకోదగిన, గుర్తుంచుకోదగిన ఒక్క కార్యక్రమమూ జరగలేదంటే అందులో అతిశయోక్తేమీ లేదు.

ఆయన మేధావి, అద్భుతమైన ప్రజ్ఞాపాటవాలు గలవాడు, వినయ విధేయతలున్నవాడు. అంతేకాదు, తిరుగులేని ఆర్థికవేత్త. ఇందులో సందేహమే లేదు. కానీ, అవినీతి గురించి మాట్లాడగలిగినంత నైతిక బలం, విశ్వసనీయత ఆయన దగ్గర లేవు. ప్రధానిగా ఉండగా తన మంత్రుల్లో కొందరు అవినీతి కార్యకలాపాల్లో మునిగి తేలుతున్నా, కొన్ని లక్షల కోట్ల రూపాయల ప్రజల సొమ్మును ఆయన మంత్రులే లూటీ చేసినా, ప్రభుత్వాన్ని నిలువునా మోసం చేసినా, ఖజానాను దోచుకున్నా పట్టించుకోకపోవడంతోనే ఆయన అవినీతిపై మాట్లాడే నైతిక అధికారాన్ని కోల్పోయారు. పదేళ్ళ యూపీఏ పాలనలో బొగ్గు, 2జీ స్పెక్ట్రమ్, హెలికాప్టర్లు, కామన్వెల్త్ గేమ్స్, ఆదర్శ్ హౌసింగ్ సొసైటీ, బ్యాంకింగ్ రంగం వంటి అనేకానేక కుంభకోణాలు చోటుచేసుకున్నాయి. ఇవన్నీ వెలుగు చూసిన కుంభకోణాలు మాత్రమే. ఇందులో ఒక్కొక్క కుంభకోణం విలువా లక్షల కోట్లలోనే ఉంది. ఇక విదేశీ బ్యాంకుల్లో సొమ్ము దాచుకోవడం అనే కార్యక్రమం అడ్డూ ఆపూ లేకుండా సాగిపోయింది. ఆ అవినీతి చర్యల ఫలితాలను దేశ ప్రజలు ఇప్పుడు అనుభవిస్తున్నారు.

ఇక 2013, 2014 ఆర్థిక సంవత్సరాల్లో దేశంలోని 29 ప్రభుత్వ బ్యాంకులు సుమారు 1.14 లక్షల కోట్ల రూపాయల మొండి బకాయిలను మాఫీ చేసినట్లు గత ఫిబ్రవరిలో పత్రికలు రాశాయి. 2012 మార్చి నాటికి 15,551 కోట్ల రూపాయలున్న మొండి బకాయిలు 2015 మార్చి నాటికి 52,542 కోట్ల రూపా

## ఆయన హయాంలో ఏం జరిగింది?

ప్రస్తుత ఎన్‌డీఏ ప్రభుత్వం పెద్ద నోట్లను రద్దు చేస్తూ తీసుకున్న చర్యతో జనం కష్టనష్టాలు ఎదుర్కొంటున్న మాట నిజమే. సాధారణ ప్రజానీకం కనీవినీ ఎరుగని సమస్యలు ఎదుర్కొంటున్నమాటా నిజమే. కానీ, మన్మోహన్ ప్రభుత్వ కాలంలో మాదిరిగా రెండంకెల ద్రవ్యోల్బయలకు పెరిగిపోయాయి. అందువల్ల పేదల సొమ్ము లూటీ అయిందని, ప్రజా ధనాన్ని దోపిడీ చేశారని మన్మోహన్ సింగ్ అనడం ఆశ్చర్యం అనిపించక మానదు. ఆయన పదేళ్ళ పరిపాలనా కాలంలో లూటీ అయినంత ప్రజాధనం మరే ప్రభుత్వ కాలంలోనూ కాలేదు. ఇందులో ఒక్క కుంభకోణాన్ని కూడా ఆయన నిరోధించే ప్రయత్నం చేయకపోవడం నిజంగా ఆశ్చర్యకరం. ఆయన ప్రధాని పదవిలో ఉన్నారే తప్ప ఏనాడూ పరిపాలించలేదన్నది అందరికీ తెలిసిన విషయమే. ఒక వైపు ఓ కుటుంబ ఒత్తిడికీ, మరో వైపు సంకీర్ణ భాగస్వాముల ఒత్తిడికీ లొంగి ఆయన చివరి వరకూ మౌన ప్రేక్షకుడి పాత్రే పోషించారన్నది ఎవరూ విస్మరించలేని విషయం.





**పెద్దనోట్ల రద్దు విషయంలో మోదీ ప్రభుత్వాన్ని ఎండగట్టడంలో మాజీ ప్రధాని డాక్టర్ మన్మోహన్‌సింగ్ పార్లమెంటులో విఫలమయ్యారు. ఈ విషయంలో ఆయన ఒక ఆర్థికవేత్తగా మాట్లాడతారని అంతా ఆశించారు. కానీ ఆర్థిక నిపుణులు సైతం పెదవి విరిచేలా ఆయన రాజకీయవేత్తగా మాట్లాడారు. ఈ విషయంలో కాంగ్రెస్‌పార్టీ తప్పులో కాలేసింది!**

ణాన్ని వారేమీ అనుభవించడం లేదు. కుంభకోణాలతో వారి ధనాన్ని ఎవరూ దోచుకోలేదు. రెండంకెల ద్రవ్యోల్బణం కారణంగా ప్రజల ఆదాయం సగానికి సగమైపోయి, నానా అవస్థలూ పడాల్సి వచ్చింది. ఉపాధి, ఉద్యోగావకాశాలు కూడా బాగా తగ్గిపోయాయి. పెద్ద నోట్ల రద్దు కారణంగా చోటు చేసుకున్న "యాభై రోజుల విధ్వంసం' గురించి మాట్లాడిన మన్మోహన్ సింగ్ తన పాలనా కాలం గురించి మరచిపోవడం ఆశ్చర్యం కలిగిస్తోంది. దేశ ప్రజలు యాభై రోజుల నుంచి నోట్ల కోసం నానా అవస్థలూ పడడం చిన్న విషయమేమీ కాదు. కానీ, 2009 మే నుంచి 2014 మే వరకు సుమారు రెండు వేల రోజుల పాటు జనం ఇబ్బందులు పడడం సమంజసమేనా? సగటు వార్షిక ద్రవ్యోల్బణం అప్పట్లో 10.1 శాతానికి చేరింది. పేదలు నానా కష్టాలూ పడ్డారు. రూపాయి 50 శాతం పతనమైపోయింది. వ్యాపారాలు కుప్పకూలిపోయాయి. అయినవాళ్ళకు టెలికామ్ లైసెన్సులను పంచేశారు. చివరికి సుప్రీం కోర్టు వాటిని రద్దు చేసింది. ఇష్టం వచ్చినట్టు, ఏక పక్షంగా గనుల లైసెన్సుల పందారం చేశారు. చివరికి సుప్రీం కోర్టు వాటికి అడ్డుకట్ట వేసింది. గనుల తవ్వకాలు నిషేధించింది. 2008 వరకూ విజృంభించి ఉన్న ఆర్థికాభివృద్ధి యూపీఏ ప్రభుత్వ తప్పటడుగుల కారణంగా 5-6 శాతం పడిపోయింది. "యాభై రోజుల విధ్వంసం" అని వ్యాఖ్యానించే ముందు మాజీ ప్రధాని ఈ విషయాలను కూడా దృష్టిలో పెట్టుకోవాల్సింది.

ఆర్థికవేత్తగా, పదేళ్ళపాటు ప్రధానిగా మన్మోహన్‌కు ఉన్న అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని కాంగ్రెస్ మేధావి వర్గం ఆయనను మోదీపై దాడికి ఎంపిక చేసి ఉంటుంది. అయితే, నిజానికి ఆయనను ఎంచుకోవడం ద్వారా ఆ వర్గం తన వాదనను తానే బలహీనపరచుకుందనిపిస్తోంది. మన్మోహన్ సింగ్ గనుక తన అధికారాన్ని సక్రమంగా ఉపయోగించుకుని ఉంటే, తన దగ్గరకు వచ్చే ఫైళ్ళను పరిశీలించి ఉంటే, 2జీ, బొగ్గు, కామన్వెల్త్ గేమ్స్ వంటి కుంభకోణాలు జరిగి ఉండేవి కావని 2014లో అప్పటి కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) వినోద్‌రాయ్ ఓ మీడియా ఇంటర్వ్యూలో అభిప్రాయపడ్డారు. కాగ్ నివేదికలో మన్మోహన్ పేరును ఎటువంటి పరిస్థితుల్లోనూ చేర్చవద్దంటూ అప్పట్లో పలువురు కాంగ్రెస్ ఎంపీలు తనపై ఒత్తిడి తెచ్చారని కూడా ఆయన గుర్తు చేసుకున్నారు. పైగా ఆ ఎంపీలంతా జాయింట్ పార్లమెంటరీ కమిటీలో సభ్యులని కూడా ఆయన చెప్పారు.

### అవినీతి బాగోతాల చరిత్ర

పెద్ద నోట్ల రద్దు వల్ల దీర్ఘకాలంలో దేశం బాగుపడుతుందంటూ మోదీ చేసిన వ్యాఖ్యకు సమాధానంగా మన్మోహన్ సింగ్, "దీర్ఘకాలంలో మనమంతా చనిపోతాం" అని అన్నారు. మన్మోహన్ ఇక్కడ ప్రముఖ బ్రిటీష్ ఆర్థికవేత్త జాన్ మేనార్డ్ కీన్స్ మాటలను ఉటంకించారు. నిజానికి ఆయన ప్రధానిగా ఉండగా ఏనాడూ కీన్స్ సిద్ధాంతాలను అమలు చేయలేదు. అవినీతినిగానీ, బంధుప్రీతిని గానీ, ప్రజల సొమ్ము దుర్వినియోగం కావడాన్ని గానీ ఏనాడూ నివారించలేదు. అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు, ఆర్థిక నిపుణులు, ఆర్థిక వ్యవహారాల పత్రికలు మోదీ చర్యను సమర్థించాయి. మోదీ చర్య స్వల్పకాలంలో ఆర్థికాభివృద్ధిని కుంటుపరచవచ్చు కానీ, దీర్ఘకాలంలో పన్ను వసూళ్ళను పెంచి ఆర్థిక రంగాన్ని సుస్థిరం చేస్తాయని అంతర్జాతీయ నిపుణులు వ్యాఖ్యానించారు. నోట్ల రద్దు వల్ల బ్యాంక్ డిపాజిట్లు ఇబ్బడిముబ్బడిగా పెరుగుతాయని, వీటివల్ల వడ్డీ రేట్లు తగ్గుతాయని, ద్రవ్యోల్బణం అదుపులో ఉంటుందని కూడా వారు చెప్పారు.

పెద్ద నోట్లను రద్దు చేసిన తరువాత మోదీ, ఓ యాభై రోజులు ప్రజలు ఇబ్బందులు పడాల్సి వస్తుందనీ, ఆ తరువాత ఆర్థిక వ్యవస్థ గాడిలో పడి అంతా సర్దుకుంటుందనీ చెప్పారు. ఈ మాటల్ని మన్మోహన్ ఎద్దేవా చేశారు. ఎద్దేవా చేసే బదులు, ఆయన ఓ ఆర్థికవేత్తగా తగిన సూచనలు, సలహాలు ఇవ్వాల్సింది. పెద్ద నోట్ల రద్దును విభేదించడానికి తన కారణాలను ఆయన ఆర్థిక కోణంలో వివరించాల్సింది. ఆర్థిక నిపుణుడిగానే కాక, ప్రధానిగా కూడా తనకున్న విశేష అనుభవాన్ని ఉపయోగించుకుని, మోదీ నిర్ణయంతో విభేదించాల్సింది. అయితే, ఆయన కేజ్రీవాల్, మమతా బెనర్జీ, మాయావతి వంటి రాజకీయ నాయకుల మాదిరిగా రాజకీయంగా ఈ అంశాన్ని పరిశీలనలోకి తీసుకున్నారు. ఓ రాజకీయవేత్తగా మాట్లాడే ప్రయత్నం చేశారు.

తన పార్లమెంట్ ప్రసంగంలో ఆయన వీటి మీద చేసిన వ్యాఖ్యలు ఆయనను ఓ ఆర్థికవేత్తగాగాక ఓ పార్టీ ప్రతినిధిగా ప్రజల ముందుంచుతున్నాయి. ఓ ఆర్థికవేత్తగా పెద్ద నోట్ల రద్దు ప్రభావాన్ని విశ్లేషించాల్సిన వ్యక్తి రాజకీయ నాయకుడుగా మారాలనుకోవడంతో ఆ విషయంలో విఫలమయ్యారు. పైగా ఆయన నైతికత గురించి మాట్లాడడం పెద్ద మైనస్ పాయింట్‌గా కనిపిస్తోంది. ఆయన ఓ విద్యావేత్తగా, ఆర్థికవేత్తగా మాట్లాడతారని, రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్‌గా, ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడిగా, ఆర్థిక మంత్రిగా, ప్రధానిగా ఆయన తన అనుభవాన్నంతటినీ రంగరించి మాట్లాడతారని ఆశించిన వారిని ఆయన తీవ్రంగా నిరుత్సాహపరిచారు. ఆయన ఆర్థికవేత్తకు ఎక్కువ, రాజకీయవేత్తకు తక్కువ అని ఆర్థిక నిపుణులు సైతం పెదవి విరిచారు. పెద్ద నోట్ల రద్దు వల్ల ఎదురయ్యే కష్టనష్టాలను ఎలా నివారించవచ్చో కూడా ఆయన చెప్పి ఉంటే ఆయన విలువ పెరిగేది. అధికారంలో ఉండగానే కాదు, ఇప్పటికీ ఆయన సోనియా గాంధీ మాట జవదాటని వ్యక్తిగానే కనిపిస్తున్నారు.

తన హయాంలో ఆయన సాధించింది ఏమైనా ఉందా అంటే అది భారత-అమెరికా అణు ఒప్పందమే. అది కూడా ఆయన రాజకీయ పార్శ్వం మీద ఆధారపడిందే తప్ప ఆర్థిక పార్శ్వం మీద ఆధారపడింది కాదు. ఆయన పాలనా కాలంలోనే జరిగిన 'ఓటుకు నోటు' కుంభకోణం భారతీయ పార్లమెంటరీ చరిత్రలోనే అతి అధ్వానమైన కుంభకోణం. ఇటువంటి కుంభకోణం తన హయాంలో జరిగినందుకు ఆయనలో ఏ కోశానా పశ్చాత్తాపం కూడా కనిపించకపోవడం దురదృష్టకరం. ఆయన ఏనాడూ రాజకీయవేత్త కాలేరు. కనీసం ఆర్థికవేత్తగానైనా మళ్ళీ గుర్తింపు పొందడానికి ప్రయత్నించాల్సింది.

నవ్య

# వెట్టై

## (ది వారియర్)

**-మధుబాబు**




**కూర్చోమని పెద్దమ్మ చూపించిన కుర్చీలో కూర్చోనుకూడా కూర్చోలేదు రమణయ్య పంతులు. 'తప్పకుండా చెపుతాను తల్లీ... అక్కడికివెళ్ళి కారులో నుంచి కాలు కింద పెట్టీ పెట్టగానే నేను చేయబోయే మొట్టమొదటి పని అది. ఆ అబ్బయ్య స్పీడును తగ్గించేమాట! చెప్పి తీరవలసిన మాట..' అంటూ నమస్కారం చేశాడు. పెద్దమ్మకి కూడా తలూపి, ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయకుండా బయటికి వచ్చేశాడు.**

వేటమాంసం వేపుడుతో పీకలదాకా మెక్కి, తను కారులోనే నిద్రకు ఉపక్రమించబోతున్నాడు అతని డ్రైవర్. చెప్పాపెట్టకుండా వచ్చిన పంతులుగారిని చూడగానే గబ గబా లేచి బయటికి వచ్చాడు.

'నీకు ఆవలింతలు ఏమైనా వస్తాయని అనుమానంగా ఉంటే ముందుగానే చెప్పు. పెద్దమ్మగారిని అడిగి వాళ్ళ మనిషిని ఎవరినైనా వెంట తీసుకుపోదాము' అతని ముఖంలోకి కోరగా చూస్తూ అన్నాడు పంతులుగారు.

కంగారు పడిపోయాడు డ్రైవర్. 'అబ్బెబ్బే.. అలాంటి దేమీలేదు సారూ. చక్రం ముందు కూర్చోనంతవరకే మగత. ఒకసారి స్టీరింగు పట్టుకుంటే ఇంక నిద్రగిద్ర జాన్తానై' అంటూ చటుక్కున స్టీరింగ్ ముందుకు చేరుకుని ఇంజన్ స్టార్ట్ చేశాడు.

వెనుక సీట్లో కూర్చుని డోర్‌ని మూస్తూ వెనుక ఉన్న భవంతికేసి చూశాడు పంతులుగారు. మిద్దెమీద నిలబడి

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా ఆమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తు చేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో గొప్ప సినిమా నిర్మించేందుకు కథాన్వేషణలో పడతాడు దర్శ కుడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. సంబంధిత వీడియో డీసీపీ వద్ద రహస్యంగా ఉంది. తనకు ఆపద పొంచిఉండటంతో, డీసీపీ ఆ దర్శకుడి ఫ్లాట్‌కి వెళ్ళి, కార్యాచరణపై సుదీర్ఘంగా ఆలోచనలు చేస్తుంది. సీఎంతో కలిసి పకడ్బందీగా ప్లాన్‌చేసి, సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. డీసీపీని బదిలీపై వేరే ప్రాంతానికి పంపిస్తారు.

ఆ తర్వాత.....

ఉన్నది పిచ్చమ్మి... నీడ మాదిరి.

తన కదలికలు ఆమెకు కనిపించే అవకాశం లేదని తెలిసి కూడా చేతులు రెండింటినీ కలిపి నమస్కారం చేశాడు ఆయన.

'పోనీ త్వరగా' అంటూ డ్రైవర్‌ని హెచ్చరించాడు. పొగలు విడుస్తూ కదిలింది ఆ కారు. అర గంట తరువాత ఊరి పొలిమేరల్ని దాటి ఒక హైవే మీదికి వెళ్ళిపోయింది.

•••

'అబ్బయ్యా... నిద్రలేచావా? మెలకువ వచ్చిందా?' పెద్ద కంఠంతో శంకరయ్య పిలవటంతో, ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు వెట్టి. తన కోసం సిద్ధం చేయించిన పట్టెమంచం మీద నించి కాలు కింద పెట్టాడు.

'ఇప్పుడు టైం పగలు ఎనిమిది గంటలు దాటి పది నిమిషాలపైనే అయింది. అందరూ కాఫీలు రెండేసిమార్లు తాగి, టిఫిన్లు తినటానికి సిద్ధం అవుతున్నారు. ఇక్కడ నువ్వేమో... అసలు ఈ లోకాన్ని గురించి మర్చిపోయినట్టు గురకలు పెడుతున్నావు'. ఆ గది ముందుకు వస్తూ బిగ్గరగా అన్నాడు శంకరయ్య.

'కొంచెం గొంతు తగ్గించండి శంకరయ్యగారూ! ఇక్కడ ఏదో గలాటా జరుగుతున్నదనుకుని పరిగెత్తుకు వస్తారందరూ" అంటూ పూర్తిగా దిగి, నేరుగా బాత్‌రూమ్ వైపు నడిచాడు వెట్టి.

తళతళ మెరిసిపోతున్న సిల్వర్‌ట్రేలో సెగలు పొగలు వెలువరిస్తున్న రెండు కాఫీ గ్లాసుల్ని పెట్టుకుని రెండు నిమిషాల తరువాత అవుట్‌హౌస్‌లో ప్రత్యక్షమైంది సంపంగి.

'అబ్బయ్య ఏడి? ఇంకా నిద్ర లేవలేదా? రాత్రి తాగిన మందుమత్తు ఇంకా దిగలేదా?' ముందు గదిలో టీపాయ్ మీద సిల్వర్‌ట్రే పెడుతూ అడిగింది.

అబ్బయ్యకి తాగుడు అలవాటు లేదని వెంటనే చెప్పబోయి ఎందుకనో ఆ మాటను తన నోటిలోనే అదిమేసుకున్నాడు శంకరయ్య.

'వయసు మీదున్న అబ్బడు... నీ మాట నా మాట వినిపించుకునే రకం కాదు' ముక్తసరిగా చెప్పి, ఒక గ్లాసును తాను తీసుకున్నాడు.

'శివారెడ్డిసారు ఇప్పటివరకూ మూడుమార్లు అడగబట్టిండు. తొందరగా తెమిలి తొరతొరగా వచ్చి కనిపించమని చెప్పండి' హెచ్చరించి, ఖాళీ సిల్వర్ ట్రేని ఊపుకుంటూ అవతలికి వెళ్ళిపోయిందామె.

'ఇదివరకటి సినిమాల్లో ఒక నటీమణి అచ్చం ఇలాగే నడిచేది. ఈ సంపంగిని చూస్తుంటే నాకు ఆ ముఖమే కళ్ళముందు మెదులుతోంది' అంటూ



**పెద్దమ్మ కూర్చోమని చెప్పినా వినకుండా అప్పటికప్పుడు బయలుదేరాడు రమణయ్యపంతులు. కదిరి వెళ్ళాక, ముందుగా శివారెడ్డిని కలవకుండా నేరుగా వెట్టి ఉన్న అవుట్‌హౌస్ వైపు వెళ్ళాడు. పిచ్చమ్మి చెప్పిన మాటలు చెప్పి, తనకేమీ అర్థం కాలేదని, ఆ మాటలకర్థం ఏమిటని అడిగాడు వెట్టిని. దీర్ఘాలోచనలో పడ్డాడు వెట్టి. అసలు పిచ్చమ్మి చెప్పమన్న మాటలు ఏమిటి? దానికి వెట్టి ఏమన్నాడు?**

బాత్‌రూమ్‌లోంచి బయటికి వచ్చాడు వెట్టి.

'నువ్వు తాగి తలకు పోసుకుని, ఆ మత్తులో పొర్లిగింతలు పెడుతూ ఉంటావని అనుకుంటోంది తను' టీపాయ్ మీది గ్లాసును తనే అతనికి అందిస్తూ చెప్పాడు శంకరయ్య.

'ఆ మాట నాకు వినపడింది. మీ సమాధానం కూడా నాకు చాలా బాగా నచ్చింది. నేను అటువంటి వాడినేనని వీళ్ళు అనుకోవటమే మంచిది' సోఫాలో కూర్చుని, కాఫీని సిప్ చేస్తూ అన్నాడు వెట్టి.

'ఒకమాట అడుగుతాను. ఏమీ అనుకోవు కదా' ఉన్నట్లుండి సీరియస్‌గా అన్నాడు శంకరయ్య.

కాఫీని సిప్ చేయటం కంటే, అది వెలువరిస్తున్న సువాసనల్ని ఆస్వాదించటమే బాగుంటుందనుకుంటున్న వెట్టి ఆశ్చర్యంగా చూశాడు.

'అడగమంటావా అబ్బయ్యా?' రెట్టించాడు శంకరయ్య.

తల ఊపాడు వెట్టి. గ్లాసును రెండే రెండు గుక్కల్లో ఖాళీ చేశాడు. ఒకసారి ద్వారం వైపు చూసి, టీపాయ్ కిందిభాగంలో అతి జాగ్రత్తగా పెట్టిన సిగరెట్ పాకెట్‌లో నుంచి సిగరెట్‌ని తీసి వెలిగించుకున్నాడు.

'నీది చిత్తూరు ప్రాంతమని తెలిసింది. బాగానే ఉంది. మీ నాయన ఎవరు? అమ్మ, అక్క, చెల్లి, అన్నతమ్ముళ్ళు ఎవరెవరు ఏడేడ ఉన్నట్టు? అసలు నీ కుటుంబం కథ ఏంటి?' అడిగాడు శంకరయ్య.

సిగరెట్ పొగను గుండెలనిండా పీల్చుకుని విసురుగా బయటికి వదులుతూ 'ఇప్పుడు ఉన్నట్లుండి నా కుటుంబం గురించి అడగాలని ఎందుకు అనిపించింది?' ఎదురు ప్రశ్న వేశాడతను.

'ఒంటరివాడిని చేసి నిన్ను నానాపాట్లూ పెట్టాడంటివి ఈ వీరభోజుడు. చెట్టంత బిడ్డడు ఉన్నట్టుండి కనిపించకుండా పోతే ఏమీ పట్టనట్టు గమ్మున ఉంటారా ఎవరైనా? లగెత్తుకుంటూవచ్చి కనిపించినోళ్ళందర్నీ పేరుపేరునా మాట్లాడించకుండా ఆగుతారా? ఆ భద్రయ్యనే పట్టుకుంటే జరిగింది ఏమిటో బయటికి వచ్చేస్తుంది కదా.. పోలీసు రిపోర్టు ఇస్తే ఆళ్ళు ఎంక్వైరీలు చేస్తారు కదా..' గబగబా అన్నాడు శంకరయ్య.

'అటువంటివి ఏవీ జరగలేదు. ఇంకో నెల తర్వాత జరుగుతాయి' అన్నాడు వెట్టి.

'నాకు అర్థం కాలేదు. అర్థం అయ్యేటట్టు చెప్పు' పట్టినపట్టు వదలకుండా గట్టిగా అడిగాడు శంకరయ్య.

'అర్థం అయ్యేటట్టు చెప్పటానికి ఇది సరైన సమయం కాదు. వీరభోజుడి దెబ్బకి నేను తల్లకిందులు అయిపోయినట్టు నా తల్లిదండ్రులకి తెలియదు. నాకు అక్కాచెల్లెళ్ళు ఎవ్వరూ లేరు. ఒకే ఒక అన్న ఉన్నాడు' అన్నాడు వెట్టి.

'అదే... అదే సంగతిని నేను అడుగుతున్నా. ఆళ్ళకి నువ్వు ఏమైపోయావోననే బెంగ, బాధ ఏమీ లేనట్టు కనిపిస్తోంది' ఆవేశంగా అన్నాడు శంకరయ్య.

అది చూసి చిన్నగా నవ్వాడు వెట్టి.

'నవ్వుతున్నావా? నా మాటలు నీకు నవ్వులాటగా వినిపిస్తున్నాయా?' ఈసారి ఉక్రోషంగా అడిగాడు శంకరయ్య.

సగం వరకూ కాలిన సిగరెట్‌ని కిందపడేసి కాలి మడమతో నలిపేశాడు వెట్టి. 'నా కుటుంబాన్ని గురించిన వివరాలు మీకు తెలియాలంటే కొన్నిరోజులు ఆగాల్సిందే! ఇప్పుడు మాట్లాడుకోవాల్సిన మాటలు కావు అవి' అన్నాడు.

అప్పుడు కూడా వదిలిపెట్టలేదు శంకరయ్య. 'మరెప్పుడు?' అని అడిగాడు.

'నేను తలపెట్టిన పని పూర్తయిన వెంటనే నేనే మీకు చెపుతాను. అప్పటివరకూ ఆ వివరాల సంగతి మర్చిపోండి. మీకు వచ్చిన అనుమానం ఆ వీరభోజుడికి కూడా వచ్చిందంటే... కొత్తకొత్త సమస్యలు పుట్టుకొస్తాయి' సీరియస్‌గా చెప్పాడు వెట్టి.

'నిజమేనబ్బయ్యో! వాడు వట్టి సన్నాసి.. ఇప్పటికిప్పుడు పనికట్టుకుని ఆళ్ళని ఎతకబట్టినా పట్టగలడు. నేను మర్చిపోయినా! నువ్వు కూడా మర్చిపో' అన్నాడు.

'అయిందా కాఫీ తాగటం?' అంటూ ప్రణవి ముఖద్వారం దగ్గర ప్రత్యక్షం అవటంతో, అటు చూశారు వారిద్దరూ.

'అన్నయ్య అడుగుతున్నాడు. ఈ అబ్బయ్యకి జరగాల్సిన సేవలు సరిగ్గా జరుగుతున్నాయో లేదో, నన్ను స్వయంగా చూడమని ఆర్డర్ వేశాడు' నడుము మీద చేతులు వేసుకుంటూ చెప్పింది ఆమె.

వద్దువద్దనే అనుకున్నాడు వెట్టి. అసలు అటువంటి ఆలోచన తన మనసులోకి రాకూడదని ఎంతగా అనిపించినా కంట్రోల్ చేసుకోవటం చేతకాలేదు. అతని చూపులు ఆటోమేటిక్‌గా ఆమె వెనుక భాగంలోకి మరలాయి.

నీడ మాదిరి వెన్నంటే ఉన్నది ప్రత్యూష. తలస్నానం చేసింది కాబోలు పట్టుకుచ్చుల మాదిరి గాలికి ఊగుతూ ముఖం మీదికి వంగుతున్నాయి నల్లటి ముంగురులు.

'ఇక్కడ మాట్లాడుతున్నది నేనైతే నువ్వు నా వెనక్కి చూస్తావేమిటి?' కనుబొమలు ముడివేసి కోపంగా చూస్తూ అడిగింది ప్రణవి.

ఉలికిపాటును నేర్పుగా కప్పి పుచ్చుకుంటూ చిరునవ్వు నవ్వాడు వెట్టి.

'కాఫీలు తాగటం అయిపోయింది. ఒక్క అరగంట టైం ఇస్తే స్నానం కూడా పూర్తి చేసుకుని డ్యూటీ ఎక్కుతాను' అంటూ ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా మళ్ళీ బాత్‌రూమ్ వైపు వెళ్ళాడు, చాలా వేగంగా.

'బెదిరిపోయాడు. మొట్టమొదటిసారిగా తనని నేను బెదరగొట్టగలిగాను' వెనుక ఉన్న ప్రత్యూషకి చెప్పింది ప్రణవి నవ్వుతూ.

'బెదిరిపోవటం ఏమిటి తల్లీ? నువ్వు బెదరగొట్టింది ఎవరిని?' అయోమయంగా అడిగిన శంకరయ్య వైపు తిరిగి మరింత తియ్యగా నవ్వింది ఆమె.

'అయినదానికి కానిదానికి ఈ నవ్వులు ఒలకబోయటం ఏమిటో..' తనలో తను అనుకుంటూ, తలెత్తి అవుట్‌హౌస్ వెలుపలికి చూశాడు శంకరయ్య. 'అరెరే... వచ్చేశాడు పంతులుగారు.. పంతులుగారు వచ్చేశాడు' అంటూ చివాలున సోఫాలో నుంచి లేచాడు.

మెయిన్‌గేటును క్రాస్ చేసి లోపలికి వచ్చింది కారు. మెయిన్ బిల్డింగ్ దగ్గరికి పోకుండా అవుట్‌హౌస్ ముందుకే వచ్చి ఆగింది.

'అమ్మ వచ్చిందా పంతులుగారూ... అమ్మా' అంటూ వేగంగా దగ్గరికిపోయి, తన తల్లి కనిపించకపోవటంతో తెల్లబోయింది ప్రణవి.

'అమ్మ తర్వాత వస్తానని చెప్పింది తల్లీ. ముందు నేను అబ్బయ్యతో మాట్లాడాలి. అమ్మ అతనికి చెప్పమన్న మాటల్ని అర్జంటుగా చెప్పిన తర్వాతనే మిగిలిన విషయాలు' అంటూ అవుట్‌హౌస్ లోపలికి వచ్చి, సోఫాలో చేరగిలబడ్డాడు రమణయ్యపంతులు.

'పంతులుగారు వచ్చిండు అబ్బయ్యా. నువ్వు కాస్తంత బయటికి తొంగిచూస్తే నీకు ఏదో మాట చెప్పాలని అంటున్నాడు' బిగ్గరగా అన్నాడు శంకరయ్య.

'కూర్చోమని చెప్పండి. రెండు నిమిషాలు.. సంపంగికి కబురు పంపి కాఫీ తెప్పించి ఇవ్వండి' బాత్‌రూమ్ వైపు నుంచి వినవచ్చింది వెట్టి కంఠం.

'వచ్చిన వాళ్ళకి ఎటువంటి మర్యాదలు చేయాలో నువ్వు మాకు చెప్పవలసిన అవసరం లేదు. మాకు తెలుసు. ముందు నువ్వు బయటికిరా' కోరగా హెచ్చరించి ప్రత్యూష వైపు తిరిగింది ప్రణవి.



# అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయనూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేధిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా, పెద్దా అందరు శ్వాసకోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్థానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జిన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్‌క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇస్నోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికముర్రిన్స్, ఆరమ్‌ఫైఫిలమ్, ఇఫ్రెసియా, ఆలెయంసెప మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.



# నడుంనొప్పికి ఆయుర్వేద చికిత్స

**ప్రస్తుత పరిస్థితుల్లో మానవుని జీవనం ప్రకృతి సహజ విధానాలకు విరుద్ధంగా ఉంటోంది. పెరిగి పోతున్న పని ఒత్తిడి, పోషకాహారం సరిగా తీసుకోక పోవడం వల్ల ఈ రోజుల్లో 40 ఏళ్లకే నడుంనడప్పి వస్తోంది. శారీరకంగా, మానసికంగా సమస్యలు కలిగించే నడుంనొప్పిని దూరం చేయాలంటే ఆయుర్వేద చికిత్సే ఉత్తమమైన మార్గం అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ మనోహర్.**

నేటి జీవనవిధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్తమైన దిన చర్యలు, స్వప్న విపర్యం అంటే రాత్రివేళ నిద్రపోక పోవడం, పగటిపూటనిద్రపోవడం వంటి అలవాట్లు శరీర వ్యవస్థను బాగా దెబ్బ తీస్తున్నాయి. ఆందోళన, మానసిక ఒత్తిడి కూడా అనేక అనారోగ్యలకు కారణ మవుతున్నాయి. వీటిలో అతిముఖ్యమైనది నడుంనొప్పి. ఆయుర్వేదశాస్త్రం నడుం నొప్పికి 'గృధ్రసీవాతం' గా నామకరణం చేసింది. తొంభైశాతం మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒక్క సారి నడుంనొప్పి బారినపడతారని కొన్నిఅధ్యయనాల్లో స్పష్టమయింది. **కారణాలు:** ఎక్కువసమయం ఒకే భంగిమలో కూర్చోవటం, స్థూలకాయం, ఎక్కువగంటలు విపరితంగా శ్రమించడం, అతిగా బరువులు మోయడం, ద్విచక్ర వాహనం మీద ఎక్కువ దూర ప్రయాణం చేయడం, రోడ్డు ప్రమాదాలు,దీర్ఘకాలికరుగ్మతలు, వంశ పారంపర్య వ్యాధులు ఇవన్నీ నడుంనొప్పికి కారణాలు. ఈ కారణాల వల్ల వాత ప్రకోపం జరుగుతుంది. ఫలితంగా ముందుగా పిరుదుల పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి ఆ తరువాత నడుం భాగం, ప్రత్యేకించి ఎల్-4, ఎల్-5 వెన్నుపూసల మధ్య ఉండే సయాటికా నరం మీద ఒత్తిడి పడటంవల్ల నడుంనొప్పి వస్తుంది. డిస్కులో వచ్చే మార్పులు. వెన్నుపూసల మధ్య ఉండే డిస్కుల్లో కొన్ని మార్పులు జరిగినప్పుడు డిస్కుల మీద ఒత్తిడి పెరుగు తుంది. వాపు రావడం, డిస్కుకి రక్త ప్రసరణ సరిగా లేక పోవడం, డిస్కు అరిగి పోవడం వంటి సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్కులలో వాపువస్తే అందులోనుంచి ద్రవం బయటకు వచ్చి మేరుదండం నుంచి వచ్చే నరాల పైన ఒత్తిడి పెరుగు తుంది. దీనివల్ల వెన్ను నొప్పి వస్తుంది.

**లక్షణాలు:**నడుంనొప్పి, వాపు, కాస్త శ్రమించినా సూదుల తో గుచ్చినట్లుగా నొప్పి తీవ్రంకావడం, కాళ్ళలో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. సకాలంలో చికిత్స అందకపోతే స్పర్శజ్ఞానం కోల్పోతారు.సమస్య తీవ్రమైతే మలమూత్రాల మీద నియంత్రణ కోల్పోయే ప్రమాదం ఉంది. పెయిన్ కిల్లర్స్ వాడకూడదు. పెయిన్‌కిల్లర్స్‌తో మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు వస్తాయి. వెన్నుసంబంధిత సమస్యలను వెంటనే గుర్తించి చికిత్స తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా ఉంటుంది.

**ఆయుర్వేదచికిత్స:** నడుంనొప్పిసమస్యకు ఆయుర్వేద శాస్త్రం సూచించి న సమగ్రమైన చికిత్సా పద్ధతుల్లో నిదాన పరి వర్జనము, శమన చికిత్స, శోధనచికిత్స అని మూడు ప్రధానమైనవి ఉన్నాయి. **నిదానపరివర్జనము:** వ్యాధికి కారణమయిన విషయాలను పాటించక పోవడం. ఉదా॥ విరుద్ధ ఆహార, విహార సేవన (రాత్రి మేల్కోవటం, పగలు నిద్రపోవటం).**శమనచికిత్సలు:** వ్యాధితాలూకు దోషాలను శమింప చేయాటానికి తెచ్చే ఔషధాలు. ఇందులో రోగ బలాన్నిబట్టి, రోగిబలాన్నిబట్టి చూర్ణాలు, గటికలు, కషాయాలు, లేహ్యాలు, తైలాలు వంటి ఔషదాలు రోగికి ఇవ్వడం జరుగుతుంది. కానీఈ శమన చికిత్సవల్ల ఒక్కో సారి ప్రకోపించిన దోషాలుమళ్ళీ తిరగబడవచ్చు అందుకే వ్యాధితీవ్రతను బట్టి శమన చికిత్సలతో పాటు కొందరికి పంచకర్మ (శోధన చికిత్స) కూడా అవసరం. ప్రకోపించిన దోషాలను(వాత, పిత్త, కఫ) దీని ద్వారా సమంగా చేసి శరీర శుద్ధిని, అగ్ని బలాన్ని పొందవచ్చు. ఆయుర్వేదంలోని స్వేద కర్మ ద్వారా వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి కీళ్లకదలికలను సులభతరం చేయువచ్చు. బిగుసుకుపోయిన కీళ్లను స్వేదకర్మ ద్వారా వదులుగా, మృదువుగా మార్చవచ్చు. **కటివస్తి:** ఇది ఆయుర్వేదంలోని ఒక విశిష్టప్రక్రియ. అరిగిపోయిన మృదలాస్థి (కార్టిలేజ్)కి రక్తప్రసరణ పెంచినొప్పి తీవ్రతను తగ్గించడంలో ఈ ప్రక్రియఎంతగానో ఉపయోగపడు తుంది. ఇదే క్రమంలో సర్వాంగధార చికిత్స కూడా వీటికి బాగా ఉపయోగపడుతుంది. వస్తికర్మ, ఆయుర్వేద శాస్త్రం లో వస్తికర్మచికిత్స అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించు కుంది. ఈ వస్తికర్మచిన్నపేగులు, పెద్దపేగులలోని ఎంటరిక్ నర్వస్ సిస్టమ్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా నాడీ కణాలలో ఏర్పడిన లోపాలను సరిచేసి బలం చేకూర్చ వచ్చు. అలాగే పక్వాశయ వాతస్థానంకాబట్టి ప్రకోపించిన వాతాన్నికూడా సహజస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** అవసరమైన పోషకాహారం తీసుకుంటూ వైద్యులు సూచించిన విధానా లను అనుసరించడం చాలా ముఖ్యం. ఔషదచికిత్సల తరువాత క్రమం తప్పకుండా వ్యాయామం కూడా చేస్తే నడుం నొప్పి సమస్యనుంచి శాశ్వతంగా విముక్తి కలుగుతుంది.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ఆమె చెప్పవలసిన అవసరం లేదు. అప్పటికే మెయిన్ బిల్డింగ్ దగ్గరికి వెళ్ళిపోయిందామె. సరిగ్గా ఐదు నిమిషాల తర్వాత మరోసారి ట్రేని పట్టుకుని వచ్చింది సంపంగి.

'వచ్చీరాగానే ముందు తన దగ్గరికి రాకుండా ఇక్కడ దిగబడటమేమిటని శివారెడ్డి సారు కోపం చేస్తున్నాడు' అంటూ ట్రేలోని గ్లాసును పంతులు గారికి అందించింది.

'వస్తున్నానని చెప్పు' ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు పంతులుగారు.

'రావయ్యా అబ్బయ్యా.... సాయంత్రందాకా ఆ గదిలోనే కూర్చుంటావా?' అసహనంగా పిలవ బోయాడు శంకరయ్య.

తడి తలను ఆఖరిసారి తుడుచుకుని టవల్‌ని అవతలికి విసిరేస్తూ బెడ్‌రూమ్‌లోంచి బయటికి వచ్చాడు వెట్టి.

'అదేంటి? నువ్వు పడకగదిలో-' బ్లాంక్‌గా చూస్తూ కామెంట్ చేయబోయాడు శంకరయ్య.

'స్నానం ఎప్పుడో అయిపోయింది. దుస్తులు వేసుకుంటుంటే అరిచారు మీరు..' అంటూ రమణయ్య పంతులుగారికి నమస్కారం చేశాడు వెట్టి.

'చెప్పండి పంతులుగారూ... వినటానికి రెడీగా ఉన్నాను' అన్నాడు.

తను బయలుదేరే ముందు పిచ్చమ్మి మాట్లాడిన మాటని యాజిటీజ్‌గా రిపీట్ చేశాడు పంతులు గారు.

'ఇక్కడికి వచ్చీరాగానే నీకు చెప్పమని చెప్పిన మాటలు ఇవి. చెల్లాచెదురైన వరిపనల్ని జాగ్రత్తగా కోయటం ఏమిటో, ఆత్రపడకూడదనటం ఏమిటో నాకైతే ఒక్క ముక్క కూడా అవగతం కాలేదు' అన్నాడు.

చుట్టలు చుట్టుకున్న శరీరం మీద తలను ఆనించుకుని, పరమ ప్రశాంతంగా పడుకుని ఉన్న తాచుపాము వెంటనే కళ్ళు ముందు మెదిలి, తనకు తెలియకుండానే తలఊపాడు వెట్టి.

'ఆ మాటలకి అర్థం ఏమిటి అబ్బయ్యా?' కుతూహలంగా అడిగాడు శంకరయ్య. గుమ్మంలోనే నిలబడిన ప్రణవి, ప్రత్యూషల ఇద్దరి వదనాల్లోనూ సేమ్‌ఫీలింగ్స్ మెదులుతూ ఉండటాన్ని కను చివరల నుంచి గమనించుకుంటూ చిరునవ్వు నవ్వాడు అతను.

'అర్థాలుపర్థాలు ఇప్పుడు వివరంగా చెప్ప టానికి వీలుపడదు' అంటూ శంకరయ్యకి చెప్పి 'మీరు శివారెడ్డిసారుకు కనిపించి రండి. మధ్యాహ్నం మనం మాట్లాడుకోవాల్సిన మాటలు చాలా ఉన్నాయి' అని పంతులుగారితో అన్నాడు.

'నేను కూడా అదే అనుకుంటున్నాను అబ్బయ్యా. మనం మాట్లాడుకుని తీరాలి. ఆ తల్లిమాటల్ని తలచు కున్నకొద్దీ సస్పెన్స్‌తో నా తల పగిలిపోతోంది' అంటూ సోఫాలోంచి లేచాడు పంతులుగారు. ఖాళీ గ్లాసును శంకరయ్య చేతికి అందించి, పెద్దపెద్ద అడుగులు వేస్తూ మెయిన్ బిల్డింగ్ వైపు బయలు దేరాడు.

ఆయన వెనకే తను కూడా కదిలింది ప్రణవి. 'మేము లేకుండా మీరు ఎవరితోనూ ఏమీ మాట్లాడ కూడదు. మీరు మాట్లాడుకునేది ఏమిటో మాకు కూడా తెలిసి తీరాలి. గుర్తుపెట్టుకోండి' అవుట్ హౌస్‌లో ఉండిపోయిన వెట్టికి వార్నింగ్ ఇచ్చి మరీ బయలుదేరింది.

•••

'నిన్ను చౌడేశ్వరి గుడికి వెళ్ళిరమ్మని చెప్పాను కదా.. ఇంకా వెళ్ళలేదేమిటి?' టిఫిన్ చేయటం కోసం వచ్చిన వెంటనే, వెట్టిని తన దగ్గరికి పిలిచి సూటిగా అడిగాడు శివారెడ్డి.

'చిన్న అనుమానం వచ్చింది సారూ. ఏ గుడికి పోయి రావాలి? ఈ కదిరి చుట్టుపట్ల చిన్నాచితకా గుళ్ళు చాలానే ఉన్నాయి..' తడుముకోకుండా చెప్పాడు వెట్టి.

'అనుమానం అంటూ వస్తే వెంటనే దాన్ని బయటపెట్టాలి. మా నాన్నగారు వెళ్ళే గుడికి వెళ్ళి రావాలి. అది ఇక్కడికి నూటయాభై కిలోమీటర్ల దూరం. పొద్దున్నే పోతే రాత్రికి గాని తిరిగిరావటం కుదరదు' చిరాకుగా అన్నాడు శివారెడ్డి.

'చిరాకుపడాల్సిన అవసరం లేదు సారూ..' అంటూ మాటని ఆపి కనుచివరల నుంచి ఆ గది వెనుక భాగంలో ఉన్న ద్వారం వైపు చూశాడు వెట్టి.

కనపడీ కనపడనట్టు నిలబడి చెవులు రిక్కించి వింటోంది సంపంగి. పెదవుల మీదికి పరి గెత్తుకు రాబోయిన నవ్వును అతి బలవంతంగా అదుముకున్నాడు అతను. 'రేపు తెల్లవారగానే నేను అక్కడ ఉంటాను. మొట్టమొదటి పూజ మనదే! తిరిగి మధ్యాహ్నానికల్లా ప్రసాదం తీసుకువచ్చి మీకు అందిస్తాను. మీరు దాన్ని గురించి ఆలోచించ వలసిన అవసరం లేదు. అదీకాక బాజిరెడ్డిసారు నన్ను గుడికి వెళ్ళమని చెప్పాడేగాని, ఎప్పుడు వెళ్ళాలో చెప్పలేదు. వెళ్ళటమే ముఖ్యమని నేను కూడా గట్టిగా అడగలేదు' శివారెడ్డి మొఖం మీది చూపుల్ని మరల్చకుండా వినయంగా చెప్పాడు.

'ఏదో ఒకటి వెంటనే చేసెయ్. బద్ధకించకు' చిరాకుగానే అన్నాడు శివారెడ్డి.

'డాక్టరుగారు చెప్పినట్టు ఈయన ఆరోగ్యం స్టడీగా ఇంప్రూవ్ అవుతున్న లక్షణాలు కనిపిస్తూనే ఉన్నాయి. చిరాకు మాత్రం ఎక్కువ అయింది. కారణం ఏమిటో?' వెనక్కి తిరిగి ఆ గది బయటికి వస్తూ ప్రణవిని అడిగాడు వెట్టి.

'అమ్మ ఇప్పుడప్పుడే ఇక్కడికి వచ్చేదిలేదని తెగేసి చెప్పి పంపించింది. అదీ అసలు కారణం' రహస్యంగా సమాధానం ఇచ్చిందామె.

చెల్లాచెదురుగా పడిపోయిన వరిపనల్ని అతి జాగ్రత్తగా కోసి ఆరబెట్టాలనే పిచ్చమ్మి మాటలు గుర్తుకు వచ్చేశాయి వెట్టికి.

ఏదో అతి ముఖ్యమైన పని పూర్తవ్వాలని కోరు కుంటున్నది ఆమె. అది జరిగిన తర్వాతనే తను అక్కడికి రావాలని ఫిక్స్ అయిపోయి ఉన్నది.

ఏమిటి ఆ పని?

'నువ్వు ఆలోచనలో పడ్డావంటే అందుకు ఏదో పెద్ద కారణమే ఉంటుంది. ఏమిటది?' సీరియస్‌గా చూస్తూ ప్రణవి క్వశ్చన్ చేయటంతో తన ఆలోచ నల్ని అతి బలవంతంగా అణచుకున్నాడు.

'అన్నీ తెలిసిన మొనగాడి మాదిరి వచ్చాను. అసలు విషయాన్ని అడగటం మర్చిపోయానని డైనింగ్ రూంలోకి ఎంటరవుతూ చెప్పాడు.

అతను ఊహించినట్లే వెంటనే వినవచ్చింది ప్రశ్న. 'ఏమిటి ఆ అసలు విషయం?' అని. అందుకు అతను సమాధానం చెప్పకముందే అక్క డికి వచ్చింది శివారెడ్డి భార్య.

'ఆయన చిరాకుపడ్డాడని నువ్వేమీ మనసు కష్టపెట్టుకోకు. నువ్వు ఒంటరిగా వెళ్ళాల్సిన అవ సరం లేదు. నీ వెంట నలుగుర్ని పంపిస్తాను. నీ అవసరాలన్నిటినీ వాళ్ళు గమనించుకుంటారు' అని అన్నది.

'వేరేవాళ్ళు ఎందుకు వదినమ్మా? ఇక్కడ ఉండి మేము విరగబొడుస్తున్నది ఏముంది? నేను, బాబాయ్ కూడా వెళ్ళి వస్తాము' తడుముకోకుండా చెప్పింది ప్రణవి.

తను, తనతోపాటు బాబాయ్ అనే అన్నది గాని, ఆమె ప్రత్యూషని గురించి మాట్లాడక పోవటం వెట్టికి నచ్చలేదు.

అతను నోరు తెరిచి ఆ మాటను బయటపెట్ట వలసిన అగత్యం లేకపోయింది. అతని ముఖంలో ఆ విషయం తనకి స్పష్టంగా కనిపించినట్టు చిన్నగా నవ్వింది శివారెడ్డి భార్య. 'ప్రణవి ఎక్కడ ఉంటే ప్రత్యూష అక్కడ ఉండి తీరుతుంది. పని

## అబ్బా...అనిపిస్తున్న హెబ్బా!



హెబ్బా పటేల్ తొలిసినిమాతోనే బ్లాక్ బస్టర్ అందుకున్న హీరోయిన్. కానీ స్పీడు మాత్రం పెంచలేదు. ఇప్పటి వరకూ మూడు సినిమాలు మాత్రమే చేసింది. మూడూ హిట్లే! తాజాగా 'ఎక్కడికి పోతావు చిన్నవాడా'తో మరో హిట్ అందుకుంది. ఈ సినిమాలో హెబ్బాపాత్రకి పెద్దగా పేరు రాకపోయినా హిట్ మాత్రం ఆమె ఖాతాలో పడిపోయింది. దీంతో చిన్న నిర్మాతలకు హెబ్బా మంచి ఆప్షన్ అయిపోయింది. 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాల'న్న చందంగా ఈ సినిమా సక్సెస్‌తో తన రెమ్యునరేషన్‌ను పెంచేసిందట! సినిమాకు 50 లక్షలు అడుగుతోందట ! హెబ్బా రేంజ్‌కి అది పెద్ద మొత్తమే అయినా, ఆమె సక్సెస్ రేటు చూసి అంత ఇవ్వడానికే సిద్ధపడుతున్నారట! అన్నట్టు తన రెమ్యునరేషన్‌ని సగం నగదు, సగం చెక్కు అడుగుతోందట!

# కాజల్ బాటలో కీర్తి

అన్నదమ్ముల సరసన, తండ్రీ కొడుకుల సరసన టాలీవుడ్‌లో నటించిన ఘనత యంగ్ హీరోయిన్లలో కాజల్ సొంతం. రామ్‌చరణ్, పవన్‌కల్యాణ్, ఇప్పుడు చిరంజీవి సరసన నటిస్తోంది. కీర్తి సురేష్ కూడా సరిగ్గా కాజల్‌నే ఫాలో అవుతోంది అంటున్నారు తమిళ తంబీలు. కోలీవుడ్‌లో సూర్య, కార్తీ సరసన నటిస్తోంది. కోలీవుడ్‌లో కీర్తి దెబ్బకు తమన్న, సమంతలాంటి వాళ్ళు సైడ్ అయిపోయారని చెబుతున్నారు.

గ్లామర్‌షో విషయంలో పరిమితులున్నా, నటన విషయంలో కీర్తికి వంక పెట్టే అవకాశం లేకపోవడం. మిగతా హీరోయిన్ల కన్నా కూడా కీర్తి చిన్నది కావడం వంటి కారణాలు ఆమెకి చాలా ప్లస్ అవుతున్నాయట!



కట్టుకుని పేరు చెప్పవలసిన అవసరం లేదు' నవ్వుతూనే చెప్పింది.

ఆ విషయం అంతకుముందు తనకు రెండు మూడుసార్లు చెప్పబడిందని అప్పుడు గుర్తుకు వచ్చి, నాలుక కరుచుకున్నాడు వెట్టి, ఎవరూ చూడకుండా.

'మీరందరూ కట్టకట్టుకుని ఇక్కడినుంచి వెళ్ళిపోవడం ఆయనకి నచ్చుతుందో నచ్చదో నేను చెప్పలేను. ఎందుకైనా మంచిది ఒకసారి అడిగి చెపుతా' అంటూ శివారెడ్డి గదికేసి వెళ్ళిపోయింది అతని భార్య.

ఆమె వచ్చి శివారెడ్డి నిర్ణయాన్ని అందరికీ తెలియచేయకముందే, తన నిర్ణయాన్ని ఖచ్చితమైన కంఠంతో ప్రణవికి వినిపించాడు వెట్టి.

'ఇది మనం అరేంజ్ చేస్తున్న ప్రోగ్రాం కాదు. వీరభోజుడు సెలెక్ట్ చేసి చెప్పినటువంటిది. అక్కడికి పోయిన తర్వాత గాని వాడు ఎటువంటి ఉచ్చులు పన్ని ఉంచాడో మనకి తెలియదు. తెలిసీ తెలియని పరిస్థితుల్లోకి మీ అందరినీ తీసుకుపోవటం నాకు ఇష్టం లేదు. ఇందాక ఏదో మాట వరసకు తోడు కావాలని ఉన్నట్లు చెప్పానుగాని, నిజానికి నాతోపాటు వేరే ఎవరూ రాకూడదు. ఒంటరిగా వెళితే తప్ప, వాడిని పల్టీ కొట్టించటం కుదరదు' అన్నాడు.

'నీకు ఏదైనా జరిగితే?' క్వశ్చన్ చేసింది ప్రణవి.

'ఏమీ జరగదు. నాకు తెలియకుండా వాడు నన్ను బుట్టలో వేయలేడు. ఒకసారి చేసిన తప్పునే మరోసారి చేయటం నాకు అలవాటు లేదు' అన్నాడు అతను.

'అతినమ్మకం చాలా ప్రమాదకరం. ఓవర్ కాన్ఫిడెన్స్ వద్దు' సన్నగా హెచ్చరించింది ప్రణవి వెనుక నుంచి ప్రత్యూష.

'గమ్మున ఉండండందరూ..' గుమ్మం దగ్గర్నుంచి శంకరయ్య హెచ్చరించటంతో కామ్ అయిపోయారు అందరూ.

'ఆయన వద్దంటున్నారు. ఎవరు వెళ్ళినా ఒంటరిగానే వెళ్ళి పూజ చేయించాలట... గుంపుగాపోయి దర్శనం చేసుకోవటానికి ఆ గుళ్ళో ఎవరినీ అనుమతించరంట' వస్తూనే చెప్పింది శివారెడ్డి భార్య.

ఆమెకు ఆరడుగుల దూరంలో వస్తున్న సంపంగిని గమనించాడు వెట్టి. 'అలాగే తల్లీ... రేపు తెల్లవారకముందే ఐదు గంటలకు బయలుదేరి వెళతాను. మంచి వెహికల్‌ని రెడీగా ఉంచమని చెప్పండి' అవసరం లేకపోయినా కొంచెం పెద్ద కంఠంతోనే అన్నాడు.

పెద్దవైపోయాయి ప్రణవి కనులు. ప్రత్యూష ముఖంలో వెంటనే ప్రత్యక్షమైంది అయోమయం. ఒకేసారి ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారిద్దరూ.

శివారెడ్డి భార్యకు మాత్రం ఎటువంటి అనుమానం రాలేదు. నిన్న ఆయన్ని హాస్పిటల్‌కి తీసుకుపోయిన కార్లోనే వెళ్ళు. దాన్నిమించిన వెహికల్ మన దగ్గర మరొకటి లేదు' తడుముకోకుండా చెప్పింది.

తలూపి, డైనింగ్ టేబిల్ మీద వరుసలో పేర్చి ఉన్న ప్లేట్లలో ఒకదాన్ని తన ముందుకు జరుపుకున్నాడు వెట్టి.

గబగబా ముందుకు రాబోయిన సంపంగిని, రావాల్సిన అవసరం లేదన్నట్లు చెయ్యి ఊపి, తానే వడ్డన చేసింది ప్రత్యూష.

హాట్‌పాక్‌లో ఉన్న పదార్థాలను అతని ప్లేటులోకి ట్రాన్స్‌ఫర్ చేసింది. 'ఇది కేవలం అల్పాహారం మాత్రమే. ఇప్పుడు ఇవన్నీ ఆరగిస్తే ఇక చీకటిపడే వరకూ ఏమీ తినలేను' అంటూ ప్రొటెస్ట్ చేయబోయిన అతన్ని, తన చూపులతోనే గద్దించి నోరు మూయించింది.

'ఎవరు ఎంత తినగలరో మాకు బాగా తెలుసు. నోరు మూసుకుని పెట్టింది ఆరగించి అవతలికి పోవటం ఆరోగ్యానికి చాలా మంచిది' ప్రత్యూష చూపుల్లోని భావాన్ని మాటల రూపంలోకి అనువదించింది ప్రణవి.

●●●

'చూస్తూ ఉండండి శంకరయ్యగారూ... ఇందాక మనం మాట్లాడుకున్న మాటలన్నీ ఒక్క అక్షరం కూడా పొల్లుపోకుండా బయటికి చేరవేయబడాలి'. బాత్‌రూం వెంటిలేటర్ దగ్గర కుర్చీమీద నిలబడుతూ శంకరయ్యకు చెప్పాడు వెట్టి.

ముఖద్వారం దగ్గర ఒక పక్కగా నిలబడి మెయిన్‌గేటు మీదనే దృష్టిని కేంద్రీకరించి ఉంచాడు శంకరయ్య. 'మనిషి కదలటం మాత్రమే కనిపిస్తుంది మనకి. మాటలు వినిపించవు. ఏమి చేరవేయబడ్డాయో, ఎలా చేరవేయబడ్డాయో తెలియదు కదా' వెట్టికి వినిపించేటట్లు అన్నాడు.

'చేరవేయబడ్డాయో లేదో తెలిస్తే చాలు.. ఏం చేరవేయబడ్డాయో మనకి ముందుగానే తెలుసు' చెప్పాడు వెట్టి.

అరగంట తర్వాత అతి నెమ్మదిగా మెయిన్ బిల్డింగ్‌లోంచి బయటికివచ్చి, మెయిన్‌గేటు దగ్గరికి పోయింది సంపంగి.

ఆవరణలో చాలామంది పనివాళ్ళున్నారు. వారెవరికీ ఆమెను గమనిస్తూ ఉండవలసిన అవసరం గాని, ఆమె చేతలను అనుమానించవలసిన అగత్యం గాని ఏదీ లేనట్టే ఉంది వాతావరణం.

'ఆ వీరభోజుడితో కనెక్షన్ పెట్టుకుందని మనం చెడుగా అనుకుంటున్నాము గాని, ఈ సంపంగి ఒకవిధంగా చాలా మంచిమనిషే అబ్బయ్యా... ఆమె అంటే అందరికీ అభిమానమే. అనుమానం వచ్చింది మనకి మాత్రమే' కొంచెంగా ముందుకు జరుగుతూ అన్నాడు శంకరయ్య.

రెండే రెండు నిమిషాలపాటు నిలబడి ఉంది సంపంగి, గేటుదగ్గర. మూడో నిమిషంలో, తాపీగా అడుగులు వేస్తూ ఆమె దగ్గరికి వచ్చాడు బాజిరెడ్డి డ్రైవర్.

ఒకే ఒక నిమిషం మాట్లాడిందామె. అంతకుమించి ఒక్క సెకనుకూడా ఎక్కువ సమయం తీసుకోకుండా నెమ్మదిగా వెనుతిరిగి బిల్డింగ్‌లోకి వెళ్ళిపోయింది.

ప్యాంటు జేబులో ఉన్న సెల్‌ఫోన్‌ని బయటికి తీసి, ఎవరితోనో మాట్లాడుతూ మళ్ళీ రోడ్డును క్రాస్ చేసి, అంతకుముందు ఎక్కడ నిలబడి ఉన్నాడో,

తిరిగి అక్కడికే వెళ్ళిపోయాడు బాజిరెడ్డి డ్రైవర్.

'చేరవేయబడ్డాయి మన మాటలు. నేను రేపు తెల్లవారుజామున ప్రయాణం అవుతానని బాజి రెడ్డికి తెలియచేయబడింది. ఎటువంటి వెహికల్లో బయలుదేరుతానో చెప్పబడింది' మరో మూడు నిమిషాలపాటు అతన్నే అబ్జర్వ్‌చేసి, బాత్‌రూమ్‌లో నుంచి బయటికి వస్తూ అన్నాడు వెట్టి.

'అయితే మనం ఆ కారుని తీసుకువచ్చి ఇక్కడ మనకి కనపడేటట్టు పెట్టుకోవటం చాలా మంచిది. సంపంగి లాంటోళ్ళు ఇక్కడ ఇంకెంతమంది ఉన్నారో తెలియదు. ఇంజన్లో చేతులుపెట్టి ఏదైనా మతలబు చేస్తే చాలా ప్రమాదం' వెంటనే అన్నాడు శంకరయ్య.

'ఇంజన్లో చేతులు పెట్టటాలు, బ్రేకుల్ని పాడు చేయటాలు... ఇవన్నీ సినిమాల్లో మాత్రమే కనిపించే మతలబులు. అటువంటివి ఏమీ జరిగే అవకాశం లేదు. ఆ కారునే ఉపయోగించదలుచుకుంటే, ఇంజన్‌ని స్టార్ట్ చేసిన రెండో క్షణంలో అన్నీ తెలిసిపోతాయి. కాని నేను దాన్ని తీసుకుపోవటం లేదు' ప్రణవిగాని, ప్రత్యూషగాని రావటం లేదని నిశ్చయం చేసుకుని సిగరెట్ వెలిగించుకుంటూ అన్నాడు వెట్టి.

అంతులేకుండా పోయింది శంకరయ్య ఆశ్చర్యానికి. 'అదేంటి? ఆ తల్లి నిన్ను ఆ కార్లోనే వెళ్ళమని చెప్పింది కదా..' అడిగాడు.

'చెప్పింది శంకరయ్యగారూ... చెప్పటం వేరు... మనం చేయటం వేరు. పంతులుగారు ఎక్కడ ఉన్నారో చూడండి' అన్నాడు అతను చాలా తాపీగా.

ఆశ్చర్యం కాస్తా అయోమయంగా మారిపోతుండగా, మళ్ళీ అవుట్‌హౌస్ వెలుపలికి చూశాడు శంకరయ్య.

పదినిమిషాల తర్వాత కనిపించాడు పంతులుగారు. ఎవరో పనివాళ్ళకి ఏవో సూచనలు ఇస్తూ సూటిగా అవుట్‌హౌస్‌లోకి వచ్చాడు.

'నువ్వు చెప్పినట్లే చేయటానికి ప్రయత్నం చేస్తున్నానబ్బయ్యా. మట్టి, మశానంతో పరమ అసహ్యంగా ఉందట. సర్వీసింగ్ చేయించి, టాంక్ నిండా పెట్రోల్ కొట్టించి సరిగ్గా ఎనిమిది గంటలకల్లా సిద్ధం చేస్తానని చెప్పాడు' వస్తూనే రిపోర్ట్ చేశాడు.

'అవసరం అయితే ఇంకా కొంచెం ఎక్కువ దూరం తిరగాల్సి వస్తుంది. స్పేర్‌గా ఇంకో ఐదు లీటర్ల క్యాన్‌లో పెట్రోల్ పోయించమని చెప్పండి" ప్యాంటుజేబులోంచి నోట్ల పొత్తికను బయటికి తీస్తూ చెప్పాడు వెట్టి.

'నువ్వు భలేవాడివి అబ్బయ్యా! ఆ నోట్లని నీకు ఇవ్వమని ప్రణవికి చెప్పింది నేను. మళ్ళీ వాటిని నాకే ఇస్తున్నావా?' కోపంగా అడిగాడు పంతులుగారు.

'మీకు కాదు సారూ. ఆ బుల్లెట్ బండి మనిషికి ఇవ్వండి. ఈ మాటల్ని బయట ఎవరికీ చెప్పొద్దని గట్టిగా హెచ్చరించండి' నోట్లని అలాగే పట్టుకుంటూ అన్నాడు వెట్టి. శంకరయ్యకి అధికం అయిపోయింది ఇంకాఇంకా అయోమయం.

'పెట్రోల్ ఏమిటి? బుల్లెట్ బండేమిటి? ఏం మాట్లాడుతున్నారు మీరు?' విసురుగా అడిగాడు.

'అదేంటి? మీ అమ్మాయి ప్రణవమ్మ వెనకాల తిరిగినట్టు, వచ్చినప్పటినుంచీ ఈ అబ్బయ్యనే అంటిపెట్టుకుని ఉన్నావు కదూ! నీకు తెలియకపోవడం ఏమిటి?' ఆశ్చర్యంగా అడిగాడు పంతులుగారు.

'అంటిపెట్టుకోవటం ఒక్కటే కాదు. కావిలించుకుని నిలబడినా కూడా తను చెప్పదలుచుకున్నవే మనకి తెలియనిస్తాడు. చెప్పకూడదని అనుకుంటే అరిచి గీపెట్టినా ఒక్క మాటని కూడా బయట పెట్టడు' కచ్చగా అన్నాడు శంకరయ్య.

తన ప్లాను ఏమిటో చెప్పనందుకు అతను నిజంగానే ఫీల్ అవుతున్నట్టు అర్థమై, 'చెప్పకపోవటానికి ఇక్కడ అంత గొప్ప విషయం ఏమీలేదు. నేను కారులో వెళ్ళను. బుల్లెట్ బైక్‌మీద వెళతాను. అది కూడా రేపు తెల్లవారుజామున కాదు. చీకటి పడిన వెంటనే బయలుదేరిపోతాను. వెలుగు రాక ముందే అక్కడికి చేరుకుంటే, ఆ వీరభోజుడి పథకం ఏమిటో పసికట్టటానికి వీలుంటుంది' అన్నాడు.

చిటికెలో మటుమాయం అయిపోయింది శంకరయ్య ముఖంలో ప్రత్యక్షమైన చిరాకు. 'అద్భుతం అబ్బయ్యా. ఇదీ ప్లానంటే! నువ్వు ఇంత ఎలర్ట్‌గా ఉంటావని వాడు ఊహించలేడు' సంతోషంగా అన్నాడు.

'వాడు ఊహించినా, ఊహించకపోయినా, అక్కడ జరగాల్సింది ఏదో జరిగి తీరుతుంది. ఇప్పుడు మనం చేయవలసిన పని ఇంకొకటి ఉంది. అది కేవలం మీ వల్లనే అవుతుంది' అన్నాడు వెట్టి.

శంకరయ్య, రమణయ్యపంతులు ఇద్దరూ కుతూహలంగా చూశారు.

'నేను ముందుగా చెప్పినట్టు కాకుండా, ఎడ్వాన్స్‌గా టూవీలర్ మీద బయలుదేరుతున్నట్టు బయటికి తెలియకూడదు. బాజిరెడ్డి డ్రైవర్‌ని, సంపంగిని ఎలా మేనేజ్ చేస్తారో అది మీరిద్దరూ డిసైడ్ చేసుకోవాలి' అన్నాడు వెట్టి.

'నిజమేనబ్బయ్యోవ్.. పదినిమిషాలకి ఒకసారి వచ్చి అది కావాలా? ఇది కావాలా? అంటూ ఉంటుంది సంపంగి. బిల్డింగ్ గేటుమీది నుంచి చూపుల్ని పక్కకు తిప్పడు, ఆ డ్రైవర్‌గాడు. గట్టి చిక్కే...' అన్నాడు శంకరయ్య.

'చిక్కులేదు గిక్కులేదు. ప్రణవమ్మకి చెపుదాము. తాను ఏదో ఒకవిధంగా మేనేజ్ చేస్తుంది' చాలా తేలికగా అన్నాడు రమణయ్యపంతులు.

'ఎలా? మనం చేయలేని పనిని ఆ బిడ్డ ఎలా చేయగలదు?' అసహనంగా అడిగాడు శంకరయ్య.

'అదేమిటో... పంతులుగారు కూడా ఇక్కడే ఉన్నారు. హల్లో ఎవ్రీబడీ?' అంటూ ప్రణవి ద్వారం దగ్గరికి వచ్చేసరికి, నవ్వులమయమైపోయింది పంతులుగారి ముఖం.

'వెయ్యేళ్ళ ఆయుష్షు తల్లీ నీకు. ఇప్పుడే తలుచుకున్నాము నిన్ను' అన్నాడు.

సిగ్గుపడటమో, సంతోషించటమో ఏదో ఒకటి చేయవలసిన ఆమె మాత్రం చాలా అనుమానంగా చూసింది.

'నేను ఎదుట లేనప్పుడు నా గురించి మాట్లాడారంటే అది తప్పకుండా ఆ వీరభోజుడికి సంబంధించిన విషయమే అయ్యుంటుంది. చెప్పండి త్వరగా' అంటూ వచ్చి సోఫాలో కూర్చుంది.

వెట్టి నిర్ణయించుకున్న పద్ధతిని, అతని ట్రావెలింగ్ ప్లాన్‌ని వివరంగా చెప్పాడు పంతులుగారు. 'సంపంగికి గాని, ఆ డ్రైవర్‌గాడికి గాని ఏమీ తెలియకూడదు. ఎలా మేనేజ్ చేస్తారో మీ ఇష్టం' అని అన్నాడు.

క్షణం కూడా ఆలోచించలేదు ప్రణవి. తలతిప్పి ప్రత్యూష వైపు చూసింది.

'తను వీరభోజుడు చెప్పినట్టు దూరంలో ఉన్న గుడికిపోయి వస్తాడు. ఇక్కడ మనం సంపంగిని వెంటబెట్టుకుని కదిరిస్వామికి సహస్రనామార్చన చేయించి వస్తాము' తడుముకోకుండా చెప్పింది ఆమె.

'సంపంగిని తీసుకుపోవటం ఓకే. మరి ఆ డ్రైవర్ గాడు?' అడిగాడు పంతులుగారు.

'నేను డ్రైవ్ చేయలేను. మొన్న అంటే ఎమర్జెన్సీ కాబట్టి ధైర్యం చేశాను. వదినమ్మకి చెప్పి ఆ డ్రైవర్‌గాడినే వెంట తీసుకుపోతాము' అన్నది ప్రత్యూష.

'ఇదికూడా బాగానే ఉన్నది కాని, పూజ చేయించటం కేవలం ఒకటి రెండు గంటల పని. రాత్రి తొమ్మిది, పదికల్లా తిరిగి వచ్చేయటం జరుగుతుంది. అప్పటికి ఈ అబ్బయ్య మాయమైపోయి ఉంటాడు. వాళ్ళకి అనుమానం వచ్చేస్తుంది. అదీకాక ఈయన వెళ్లేది వాళ్ళకి తెలిసినట్టు రేపు తెల్లవారుజామున! ఇవాళ సాయంత్రం తాను ఖాళీనే కదా, మీతో పాటు తీసుకుపొమ్మని వదినమ్మ అంటే?' తన అనుమానాన్ని బయటపెట్టారు పంతులుగారు.

'డాడీ.. రాత్రి వదినమ్మ ఇచ్చిన సీసా ఖాళీ అయిపోయిందా?' తండ్రిని అడిగింది ప్రత్యూష.

'ఖాళీ అవటమా నా ముఖమా. రెండు గుక్కలకే తలకు పట్టేసింది. మందు మాత్రం మహా పవర్‌పుల్లు' అన్నాడు శంకరయ్య.

'ఓకే. సాయంత్రం నువ్వు, ఈ యంగ్‌మాన్ ఇద్దరూ కలిసి మేము వద్దు వద్దని ఎంత మొత్తుకున్నా వినిపించుకోకుండా, ఆ బాటిల్స్‌ని తిరిగి ఓపెన్ చేస్తారు. మేము గుడికి బయలుదేరే సమయానికి ఇద్దరూ తెలివిలేకుండా పడుకుని ఉండిపోతారు. తెల్లారేదాకా లేవరు' అన్నది ప్రత్యూష.

చటుక్కున లేచి ఆమెను గట్టిగా కౌగిలించుకున్నది ప్రణవి.

**(ఇంకావుంది)**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
# అర్టికేరియా సమస్యకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రపంచ వ్యాప్తంగా ఎంతోమంది ఎన్నో రకాల చర్మసమస్యలతో బాధపడుతుంటారు. అలాంటి వాటిలో అర్టికేరియా ఒకటి. దీనినే 'హీవ్స్' అని కూడా అంటారు. ఒక్కసారిగా ఉన్నట్లుండి చర్మంపై దద్దుర్లు ఏర్పడటం, వీటి వలన విపరీతమైన దురద వంటి లక్షణాలు కనిపిస్తాయి. అవి కొన్ని నిమిషాల నుండి కొన్ని గంటల వరకు కనబడి, తదుపరి పూర్తిగా కనిపించకుండా పోవడం వంటి లక్షణాలన్నీ అర్టికేరియా వ్యాధికి సంబంధించినవే. మరికొందరిలో ఇవి దీర్ఘకాలికంగా కొనసాగి, తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తాయి.

ఈ అర్టికేరియా సమస్య కొన్ని ఇతర చర్మసమస్యల మాదిరిగానే కనిపించడం వలన – కొన్నిసార్లు ఇది నిర్లక్ష్యానికి గురి అయి ప్రమాదకరంగా మారే అవకాశం ఉంటుంది. ఇతర వైద్యవిధానాల ద్వారా అర్టికేరియా వ్యాధిని కేవలం నియంత్రించవచ్చు. కానీ హోమియోపతి ట్రీట్‌మెంట్ ద్వారా ఈ వ్యాధి నుండి పూర్తిగా బయటపడే అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ అర్టికేరియా వ్యాధి పట్ల అవగాహన పెంచుకుని, దీనిని మొదట్లోనే గుర్తించి, వెంటనే సరైన చికిత్స అందించినట్లయితే ఈ వ్యాధి బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు. అర్టికేరియా సమస్య సాధారణంగా కనిపించే ఒక చర్మసమస్య. సుమారు 20% మంది ప్రజలు తమ జీవితకాలంలో ఏదో ఒక సందర్భంలో ఈ వ్యాధి బారిన పడటం జరుగుతుంది. ఏ వయస్సు వారినైనా ఇది ప్రభావితం చేస్తుంది. ఈ అర్టికేరియా ప్రభావం స్త్రీ, పురుషులలో సమాన స్థాయిలో ఉంటుంది.



**అర్టికేరియా 2 రకాలు: (1) అక్యూట్ అర్టికేరియా:** అర్టికేరియా వ్యాధి లక్షణాలు 6 వారాల కంటే తక్కువ రోజులు కనిపించినట్లయితే దానిని అక్యూట్ అర్టికేరియా అని అంటారు. ఇది అర్టికేరియా వ్యాధిని ప్రేరేపించే అంశాలు ఎదురైనప్పుడు కలుగుతుంది.

**(2) క్రానిక్ అర్టికేరియా:** అర్టికేరియా సమస్య 6 వారాలకు మించి కొనసాగినట్లయితే దానిని క్రానిక్ అర్టికేరియా అంటారు. ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాల పరంగా ఇంతవరకూ స్పష్టత లభించలేదు. కానీ శరీరంలో అంతర్లీనంగా ఉండే వివిధ ఆరోగ్య సమస్యలు – ముఖ్యంగా థైరాయిడ్, లూపస్ మొదలైన వాటి వలన అర్టికేరియా ఉత్పన్నమయ్యే అవకాశాలు ఉంటాయి.

**కారణాలు:** మన శరీరానికి సరిపడని పదార్థాలు – శరీరంలోకి ప్రవేశించినప్పుడు వాటికి ప్రతిస్పందనగా చర్మంలో శోథమును కలిగించే ప్రక్రియ ద్వారా కొన్ని కణాలు – హిస్టమిన్ మరియు ఇతర కెమికల్స్ రక్తప్రసరణలోకి విడుదల అవడం వలన అర్టికేరియా ఏర్పడుతుంది. ఇంతే కాకుండా కొన్ని ఆటోఇమ్యూన్ వ్యాధుల వలన కూడా అర్టికేరియా సమస్య ఉత్పన్నమవుతుంది.

**'అర్టికేరియా'ను ప్రేరేపించే అంశాలు:** నొప్పి నివారణ మందులు • కీటకాలు, పరాన్నజీవులు • ఇన్‌ఫెక్షన్‌లకు కారణమయ్యే 'బ్యాక్టీరియా' మరియు 'వైరస్'లు • అధిక ఒత్తిడి, సూర్యకాంతి, వ్యాయామం, గోకడం వంటి చర్యలు • మద్యపానం మరియు కొన్ని ఆహార పదార్థాలు • అధిక లేదా అల్ప ఉష్ణోగ్రతలకు గురికావడం • జంతుకేశాలు, పుప్పొడి రేణువులు వంటి అంశాలన్నీ అర్టికేరియాను ప్రేరేపిస్తాయి.

**లక్షణాలు:** చర్మంపై ఎరుపు లేదా చర్మపు రంగులో దద్దుర్లు ఏర్పడతాయి. • ఇవి విపరీతమైన దురదతో కూడి ఉంటాయి. • ఈ దద్దుర్లు నొప్పి లేదా మంటను కలిగి ఉంటాయి (Angioedema) • ఇవి కళ్ళ చుట్టూ, బుగ్గలపై, పాదాలు, చేతులు, పెదాలపై ఏర్పడతాయి. ముఖ్యంగా ఇవి గొంతులో ఏర్పడితే – ఈ వాపు వాయుద్వారాలకు అడ్డుగా మారే పరిస్థితి ఒక్కోసారి ప్రాణాంతకంగా మారవచ్చు. • ఈ దద్దుర్ల పరిమాణం పెరగటం–తరగటం మరియు వీటిని ప్రేరేపించే అంశాలకు గురి అయినప్పుడు, ఈ తేడా స్పష్టంగా కనిపించటం తదుపరి అదృశ్యమవటం జరుగుతుంటుంది. • ఈ దద్దుర్లపై ఒత్తిడి పడితే ఇవి తెల్లగా మారడం వంటి లక్షణాలను కూడా మనం గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** అక్యూట్ అర్టికేరియా నిర్ధారణకు సాధారణంగా ఎలాంటి వ్యాధి నిర్ధారణ పరీక్షల అవసరం ఉండదు. దీర్ఘకాలిక మరియు తరచూ పునరావృతమయ్యే అర్టికేరియాకు అవసరమయ్యే నిర్ధారణ పరీక్షలు: CBP, ESR, థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (TSH) మరియు యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీస్ ANA మొదలైనవి. • అర్టికేరియల్ వాస్క్యులైటిస్‌ను నిర్ధారించుకునేందుకై పంచ్ బయాప్సీ పరీక్షను కూడా చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కాన్స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి యొక్క శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి – తద్వారా ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'అర్టికేరియా' సమస్యను పూర్తిగా నయం చేయటం జరుగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో వ్యాధి రీత్యా, రోగి శరీర నిర్మాణం, వ్యక్తిగత మరియు మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించే చికిత్సతో 'అర్టికేరియా'ను పూర్తిగా నయం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in




**టాలీవుడ్‌లో ఒక కొత్త సినిమా మొదలైందంటే ఓ వందమందికి డైరెక్టుగా ఓ వంద రోజుల పాటూ, ఇన్‌డైరెక్టుగా మరో వందమందికీ పని దొరికినట్టే! అందుకే, ఇండస్ట్రీలోని అనేక క్రాఫ్టులవారు సినిమా ప్రారంభం కోసం ఎదురు చూస్తుంటారు.**

వీరిలో నటీనటులు, జూనియర్ ఆర్టిస్టులు, ఫైట్ మాస్టర్లు, ఆఫీస్‌స్టాఫ్, డైరెక్షన్ డిపార్ట్‌మెంట్, రైటర్స్, కాస్ట్యూమర్స్, మేకప్‌మెన్లు, కెమేరా అసిస్టెంట్లు, అసిస్టెంట్ కెమేరామెన్లు, ప్రొడక్షన్‌స్టాఫ్, ఆర్ట్ డైరెక్షన్ కుర్రాళ్ళు, డ్రైవర్లు, కార్లు, లైట్లు, నగారా, డాన్సర్లు, డాన్సుమాస్టర్లు, మ్యూజిక్ డైరెక్టర్లు, ఎడిటర్లు, సౌండ్ ఇంజనీర్లు, డబ్బింగ్ ఆర్టిస్టులు, కంప్యూటర్ గ్రాఫిక్ టెక్నీషియన్లు, డిజైనర్లు, ట్రాలీలు, క్రేన్లు, జిమ్మీలు, జనరేటర్లు...అబ్బో లెక్కలేనంతమంది వచ్చి కలుస్తుంటారు. వీళ్ళందరూ మేనేజర్‌కి బాగా తెలిసిన వాళ్ళే అయి ఉంటారు.

అందుకే.. ప్రీ ప్రొడక్షన్ టైంలో, మేనేజర్ ప్రాముఖ్యం ఎక్కువగా ఉంటుంది.

వీళ్ళందరి బారినుండి అతనే ప్రొడ్యూసర్‌ని కాపాడతాడు.

కానీ, అదే అదను, అతనికి చేతివాటం ప్రయోగించడానికి. అయినా తప్పదు, సినిమా నిర్మాణానికి సంబంధించినంత వరకు మేనేజర్... సృష్టి స్థితి, లయకారుడు.

సమస్యను సృష్టిస్తాడు. సమస్యను ప్రొడ్యూసర్‌కి బీపీ పెరిగేంత వరకు పెంచి పోషిస్తాడు. ప్రొడ్యూసర్, డైరెక్టర్ల గుండెల్లో వణుకు పుట్టించిన తర్వాత, సమస్యను పరిష్కరిస్తాడు. మధ్యలో తన లాభం తను చూసుకుంటాడు.

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో గొప్ప సినిమా నిర్మించేందుకు కథాన్వేషణలో పడతాడు దర్శకుడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. సంబంధిత వీడియో డీసీపీ వద్ద రహస్యంగా ఉంది. తనకు ఆపద పొంచివుండటంతో, డీసీపీ ఆ దర్శకుడి ఫ్లాట్‌కి వెళ్ళి , కార్యాచరణపై సుదీర్ఘంగా ఆలోచనలు చేస్తుంది. సీఎంతో కలిసి పకడ్బందీగా ప్లాన్‌చేసి, సయామ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. డీసీపీని బదిలీపై వేరే ప్రాంతానికి పంపిస్తారు. ఆ తర్వాత.....

అందుకే మంచి, సిన్సియర్ మేనేజర్ దొరికితే, సినిమా నల్లేరు మీద నావలా సాగుతుంది. లేకపోతే, అడుగడుగునా గండాలే!

మా మేనేజర్ కూడా చాలా వినయవిధేయతలతో పాటు చేతివాటం కూడా ప్రదర్శిస్తుంటాడు. ఆ సంగతి నాకు తెలుసని ఆయనక్కూడా తెలుసు. 'ఇండస్ట్రీలో ఉన్న పద్ధతే సార్!" అంటాడు.

అయినా తప్పదు.

టాలీవుడ్‌లో ఒక విచిత్ర పరిస్థితి ఉంది.

అనేకమంది నటీనటులు వేషాల కోసం పడిగాపులు గాస్తుంటారు.

అలాగే అనేకమంది డైరెక్టర్లు, తమకు కావలసిన నటీనటుల కోసం గాలిస్తుంటారు.

వీళ్ళిద్దరికీ సంధానకర్తలు... కో ఆర్డినేటర్లు.

వీళ్ళ దగ్గర అనేకమంది దేశవిదేశీ నటీనటుల పోర్ట్‌ఫోలియోలు ఉంటాయి.

మన బడ్జెట్, మన చాయిస్, మన ఇష్టాలు చెబితే చాలు, వాళ్ళే హీరోయిన్లను ఆఫీసులకు తీసుకొస్తారు.

మేంకూడా మా మేనేజర్ ద్వారా కో ఆర్డినేటరుకు పురమాయించాం.

ఇక మొదలైంది, మా ఆఫీసుకు దండయాత్ర.

కో ఆర్డినేటర్లతో ఓ చిక్కుంది. మనకు కావాల్సిన వాళ్ళను కాక, వాళ్ళదగ్గరున్న వాళ్ళల్లో ఎవరినో ఒకరిని అంటగట్టడానికి ప్రయత్నం చేస్తుంటారు. అప్పలమ్మను కూడా అనుష్కలా ప్రెజెంట్ చేస్తుంటారు. వాళ్ళు చెప్పేమాటలు కోటలు దాటుతాయి. పోర్ట్‌ఫోలియోల్లో చూపించిన అమ్మాయిలు దివి నుండి భువికి దిగిన అప్సరసల్లా కనపడతారు. నిజంగా వాళ్ళను చూస్తే అలా ఉండరు. అంతా ఫోటోషాప్ మాయ. వారు మనకు చూపించిన అమ్మాయిల్లో, సగం మంది గురించి వారికి తెలియనే తెలియదు. ముఖపరిచయం కూడా ఉండదు. ఎక్కడివో ఫోటోలు కలెక్ట్‌చేసి, మొబైల్లో అప్‌లోడ్ చేసుకుని చూపిస్తుంటారు. వాళ్ళల్లో అనుష్క నుంచి గీతాసింగ్ వరకు ఉంటారు. వారిలో మనకో అమ్మాయి నచ్చిందని చెబితే ఆమె ఔట్‌డోర్లో ఉందంటాడు. బిజీ అంటాడు. హిందీ సినిమా చేస్తుందంటాడు. అసలు సంగతి ఏమిటంటే ఆ అమ్మాయి గురించి మనోడికేం తెలియదు, అంతే!

మొదటి సినిమా అప్పుడు నాకు జరిగిన అనుభవంతో ఈసారి చాలా జాగ్రత్తగా అడుగు ముందుకు వేయాలని నిర్ణయించుకున్నాను.

హీరో, హీరోయిన్, సెకండ్ హీరోయిన్ కోసం సైమల్టేనియస్‌గా ఆడిషన్స్ జరుగుతూనే ఉన్నాయి. అభిషేకం గారు ఆ పని చూస్తున్నారు.

ప్రకాశం గారి స్థానంలో అభిషేకం అనే మరో సీనియర్ మోస్ట్ కో డైరెక్టర్‌ని అపాయింట్ చేసుకున్నాం. ఆయన సినిమారంగాన్ని కాచి వడపోసిన వ్యక్తి. మంచివాడే కానీ, మాటలే బూతుల మయం. నా దగ్గర కొంచెం కంట్రోల్లోనే ఉన్నా, బయట మాత్రం ఆయన మాట్లాడే మాటలకు చెవులకు తుప్పు వదలాల్సిందే. మా వాళ్ళైతే, ఆయన చెప్పే అనుభవాలు, ఛలోక్తులు, హీరో హీరోయిన్లకు సంబంధించిన అక్రమ సెక్స్ సంబంధాలు, సినిమా రంగంలో ఇప్పుడు బోరవిరుచుకుని తిరుగుతున్న వారి జాతకాలు వింటూ పగలబడి నవ్వేవారు.

"సినీఫీల్డులో నైతికత ఏంటిసార్?" అని మాత్రం నాతో అనేవాడు.

ఆయనలో ఇంకో గుణం ఉంది. ప్రతీ విషయాన్ని అబ్రివేషన్స్‌లో చెప్పడం అలవాటు.

నా దగ్గరకు రాగానే 'గుమా సార్!' అన్నాడు మొదటిసారి. నేను బిత్తరపోయాను.

"అంటే?" అని అడిగాను.

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు.

ఒకసారి "నేను బ.భా.బా" అన్నాడు. అప్పటికే ఆయన మాట్లాడే స్టైల్ అర్థమయింది కాబట్టి నేను చిరునవ్వు నవ్వి ఊరుకున్నాను.

"అవును సార్!" అన్నాడు.

"సర్" అని నేనంటే...

"అంటే ఏంటో అడగరా సార్?" అన్నాడు.

"చెప్పండి!"

"నేను బహుభార్యా బాధితుణ్ణి సార్" అన్నాడు. నాకు నవ్వాగలేదు. ఆయనకు ఇద్దరు పెళ్ళాలు. ఈ రోజుల్లో 'ఒ. భా.బా' అయితేనే కష్టం. ఇక నాలాంటి 'బ.భా.బా'ల గురించి చెప్పే అవసరం లేదు. అయినా మీకేం సారూ, మీరు "నో. భా.లు" అన్నాడు.

నేను వెంటనే పసిగట్టాను.

'నో భార్యా'

"అవును సార్! మీరు చాలా షార్ప్ సార్!"

•••

ఒకరోజు నేనూ, ప్రొడ్యూసర్‌గారూ కలిసి ఫిలిం ఛాంబర్‌కు వెళ్ళి వచ్చేసరికి ఆఫీసంతా గోలగోలగా ఉంది. ఓ ఐదారు గురు స్త్రీలు, మగాళ్ళు అరుస్తున్నారు. అభిషేకం గారు ఒక మూలన కిందపడి ఉన్నారు. అతని చొక్కా చిరిగి, పెదాలు చిట్లి ఉన్నాయి.

నేను ఏమైందని అడిగాను.

పక్కరూములో ఒక అమ్మాయి ఏడుస్తూ ఉంది. ఆమె పక్కన ఒక పెద్దావిడ ఆ అమ్మాయిని ఓదారుస్తూ ఉంది. నవీన్, మిగిలిన ఆఫీస్ బిక్కచచ్చి, ఒక పక్కన నిలబడి ఉన్నారు.

నాక్కూడా కొంచెం భయమేసింది.

అరుస్తూ ఉన్న వాళ్ళల్లో, ఒకతను అంతకు ముందు నా సినిమాలో ఒక చిన్న పాత్ర పోషించాడు.

నన్ను చూడగానే 'నమస్కారం సార్! బాగున్నారా?' అని అడిగాడు.

నేను తలూపాను.

'మీరూ... ఇక్కడా...?' అంటూ ప్రశ్నార్థకంగా చూశాడు.

"మన ఆఫీసే" అన్నాను.

"నిజంగానే! మరి ఇలాంటి త్రాష్టుణ్ణి పెట్టుకున్నారేంటి సార్? అసలేం జరిగిందో తెలుసా?" అంటూ చెప్పడం మొదలుపెట్టాడు.

"హీరోయిన్ వేషం కోసం ఆడిషన్స్ అంటే మనవాళ్ళ అమ్మాయిని తీసుకొచ్చాం సార్! డైలాగ్స్ చెప్పమంటే చెప్పింది. నడిచి చూపించమంటే



ఒకరోజు ప్రొడ్యూసర్‌తో కలిసి డైరెక్టర్ ఫిలిం ఛాంబర్‌కి వెళ్ళాడు. అక్కడంతా గోలగోలగా ఉంది. మేనేజర్ ఒక మూలన కిందపడి ఉన్నాడు. అతడి చొక్కా చిరిగి, పెదాలు చిట్లి ఉన్నాయి. పక్కరూంలో ఒక అమ్మాయి ఏడుస్తూ ఉంది. ఏమైందని అడిగిన డైరెక్టర్‌కి, ఆ గుంపులోనుంచి వచ్చిన యువకుడు చెప్పింది విని మతిపోయినంత పనయింది. షాక్‌కి గురయ్యాడతడు. అక్కడ ఏం జరిగింది?

చూపించింది. చిన్నచిన్న స్టెప్పులు వేసింది. అంతా ఓకే అనుకుంటున్న సమయంలో వీడొచ్చి మమ్మల్ని బయటికి పంపించాడు సార్! అమ్మాయి ఒక్కతే ఉన్నప్పుడు ఒళ్ళంతా తడిమాడంట సార్! ఇంకా ఎక్కడెక్కడో చేతులు వేశాడంట సార్! తర్వాత బట్టలిప్పమన్నాడంట సార్! అమ్మాయి భయపడి కేకలు వేసింది సార్. మేము లోపలికి వెళ్ళేసరికి, అమ్మాయి వణికిపోతూ నిలబడి ఉంది. వీడేమో నంగనాచిలా నిలబడి ఉన్నాడు'.

"ఇదేం ఆడిషన్ టెస్టు? బట్టలు విప్పి చేస్తారా?" అని అడిగితే,

"ఈ కాలంలో అందరూ ప్యాడ్లు పెట్టుకుని మోసం చేస్తున్నారు. అందుకే చెక్ చేస్తున్నా" అని అంటున్నాడు సార్! అందుకే నాలుగు తగిలించాం.

"అయినా ఇది మీ ఆఫీసని నాకు తెలియదు సార్! మీరెటువంటివారో నాకు తెలియదా సార్?" అన్నాడు.

నేను వాళ్ళందరినీ నా రూంకు తీసుకెళ్ళి కూర్చోబెట్టి కూల్‌డ్రింక్స్ తెప్పించాను. అభిషేకం తరఫున నేను క్షమాపణ చెప్పాను. నా సినిమాలో తగిన పాత్ర ఉంటే ఆమెకే ఇచ్చి న్యాయం చేస్తానని చెప్పాను. వాళ్ళు చల్లబడ్డారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత అభిషేకం నా దగ్గరకొచ్చి 'ఇది కామన్‌ప్రాక్టీస్ సార్, మీరు బయట కనుక్కోండి. అన్ని ఆఫీసుల్లో ఇలాగే ఆడిషన్స్ చేస్తారు. మనను మోసం చేయడానికి ప్యాడ్స్ పెట్టుకుని వస్తారు. ఇంకా కొన్ని ఆఫీసుల్లో అయితే మొత్తం పరీక్షలు చేస్తూ, వీడియో కూడా తీస్తారు సార్!' అన్నాడు ఏ మాత్రం పశ్చాత్తాపం లేకుండా.

నాకు చిర్రెత్తుకొచ్చింది.

"షటప్! ఇట్లాంటి పని చేయమని నేను మీకు చెప్పానా? మీ కుళ్ళుజోకులు సహించాను కానీ కుళ్ళుపనులు మాత్రం ఒప్పుకోను. ఈ కంపెనీకీ, నాకూ ఓ క్యారెక్టర్ ఉంది. దాన్ని చెడగొట్టకండి. మీ వయసుకు తగ్గట్టుగా హుందాగా ఉండేటట్టయితే ఉండండి. లేకుంటే నమస్కారం!" అంటూ అరిచాను.

ఆయన సరేనన్నట్టుగా తలూపుతూ మౌనంగా బయటకు నడిచాడు.

నాకైతే ఆ సంఘటనతో సిగ్గుతో తల వాలిపోయింది. ఫిలిం సర్కిల్స్‌లో పరువుపోయినట్టనిపించింది.

కానీ, ఆ సంఘటనలు అసలు ఎవ్వరూ పట్టించుకోనే లేదు.

అయితే ఆ అమ్మాయికి నా సినిమాలో సరైన పాత్ర లేకపోవడంతో తర్వాత సినిమాకు అడ్వాన్సని చెప్పి ఒక పదివేలు పంపించాను.

•••

ఆరోజు ఎందుకో చాలా ఉత్సాహంగా ఉంది. ఒక్కోరోజు అంతే... అన్నీ పాజిటివ్ సిగ్నల్స్ వస్తుంటాయి. ఉరకలెత్తే ఉత్సాహంతో, ఏదో గొప్ప కార్యం సాధించబోతున్నామన్నంత ఉత్తేజం నరనరాన్ని ఊపేస్తుంది. దానిక్కూడా కారణముంది. నేను స్క్రిప్టు వర్క్ దాదాపు పూర్తి చేశాను. ఆఫీసులో అందరూ బౌండ్ చేసేద్దామని అన్నారు. కానీ, నాకది నచ్చదు. బౌండెడ్ స్క్రిప్ట్ అంటే స్క్రిప్టును బంధించినట్టే! ఇంకో ఆలోచనకు, ఇంప్రూవ్‌మెంటుకు ఆస్కారం లేకుండా లాక్ చేసినట్టేనని నా ఉద్దేశం.

సినిమా షూటింగ్ ప్రక్రియ నిత్యనూతన చైతన్య స్రవంతిలా కొత్త కొత్త ఆలోచనలతో ఫ్రెష్‌లుక్కుతో ఉండాలి. అందుకోసం ఎప్పటికప్పుడు మార్పులు చేస్తూనే ఉండాలి. నా వరకు నేనైతే షూటింగ్ సమయంలో కూడా ఎవ్వరు సలహా చెప్పినా, అది సినిమా ఔట్‌పుట్‌కు వాల్యూ ఎడిషన్ అవుతుందంటే తప్పక స్వీకరిస్తాను. ఈవెన్, లైట్‌బాయ్స్ సలహాలు కూడా పరిశీలిస్తాను. వాళ్ళ పోస్ట్ చిన్నదేమోకానీ వాళ్ళ అనుభవం చాలా గొప్పది. వందల సినిమాలకు పనిచేసి ఉంటారు. దిగ్గజాల వంటి డైరెక్టర్ల పనివిధానం వాళ్ళకు కరతలామలకం. లైట్‌బాయ్ కదా అని చిన్నచూపు చూడకూడదు. నాకైతే అట్లాంటి భేషజాలు లేవు.

అందుకే, స్క్రిప్టుకు ఒక బేసిక్ స్ట్రక్చర్ ఏర్పడింది. యాక్చువల్ షూటింగు వరకు ఎన్నైనా మార్పులు చేసుకోవచ్చు.

అదే ఉరకలెత్తే ఉత్సాహంతో ఆఫీసుకొచ్చాను.

అప్పటికే ముందు రూంలో ఒక అబ్బాయి కూర్చొని ఉన్నాడు.

ఆఫీసు బయట ఓ బాడీగార్డ్ లాంటి వ్యక్తి, డ్రైవర్ యూనిఫాంలో మరో వ్యక్తి నిలుచుని ఉన్నారు.

అతణ్ణి చూడగానే, నాకు హీరో దొరికాడనుకున్నా! ఆ అబ్బాయి అందంగా, ఎత్తుగా, ఫిట్‌గా ఉన్నాడు. కళ్ళల్లో ఏదో చెప్పలేని విషాదం తొణికిసలాడుతోంది.

నన్నుచూడగానే, మిగతా స్టాఫ్‌తో పాటు తనూ లేచి నిలబడ్డాడు.

ఆ నిలబడే మూమెంటులో ఓ హొయలు కనిపించింది. నాలోని డైరెక్టర్ కంటికి ఇలాంటి విషయాలే కనిపిస్తాయి. అవే ఎదుటి వ్యక్తి మీద ఒక అభిప్రాయాన్ని ఏర్పరుస్తాయి.

'నమస్కారం సార్!' అన్నాడు నవ్వుతూ.

అతని నవ్వుతో ఆఫీసంతా వెలిగిపోయింది.

నేను నా ఆఫీసు రూంలోకి నడుస్తుండగానే, నాతోపాటు నవీన్ లోపలికొచ్చి, 'హీరో పాత్రకు ఆడిషన్ కోసం వచ్చాడు' అన్నాడు.

బాగున్నాడు కదా!' అన్నాను సంబరంగా.

నవీన్ ఔనన్నట్లుగా తలూపాడు.

నవీన్ నాలాగా తొందరపడి ఏ నిర్ణయం తీసుకోడు. నాలాగా, తక్షణ నిర్ణయాలు తీసుకోకుండా ప్రతి విషయంలోనూ ప్రాస్ అండ్ కాన్స్ బేరీజు వేసి, ఒక నిర్ణయానికి రావాలంటాడు. అందుకే మేజర్ డెసిషన్స్ అన్నీ నవీన్‌ని సంప్రదించిన తర్వాతనే తీసుకుంటాను.

ఆడిషన్స్ మొదలయ్యాయి. ఆ అబ్బాయి, కిరణ్, అన్ని టెస్టులు అలవోకగా పాసయ్యాడు.

మేకప్ టెస్టు కోసం మేకప్ మ్యాన్‌కి కబురు పంపించాం. అతను వచ్చేలోగా... కిరణ్ నేనూ, నా రూంలో కూర్చున్నాము.

అతని మాటల్లో చాలా ఆసక్తికరమైన విషయాలు తెలిశాయి. కిరణ్ బాగా ధనవంతుల అబ్బాయి. యూఎస్ స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీలో ఎంబీఏ చేశాడు. సినిమా అంటే పిచ్చి! డాన్సులు, ఫైట్లు, డైలాగ్ డెలివరీ, డిక్షన్ అన్నీ ఎక్స్‌పర్టుల దగ్గర నేర్చుకున్నాడు. ఇవన్నీ చెప్తుంటే అతని మాటలు వినసొంపుగా ఉన్నాయి.

అతనితోపాటు వచ్చిన బాడీగార్డ్ ఫోన్ తీసుకొచ్చి, డాడీ మాట్లాడుతున్నారని చెప్పాడు.

దూరంగా వెళ్ళి ఒక్క నిమిషం మాట్లాడి, ఫోన్ బాడీగార్డ్‌కి ఇచ్చి, 'డోంట్ డిస్టర్బ్' అని ఆదేశించాడు. అతని మ్యానర్స్‌కి నాకు ముచ్చటేసింది.

"ఓకేనా, సెలెక్ట్ అయ్యానా?" అని అతడు అడగలేక పోతున్నాడు.

"ఓకే, సెలెక్ట్ అయ్యావు" అని నేను చెప్పలేక



పోతున్నాను.

"ఇంత హైప్రొఫైల్ మనిషి మా ఆఫ్‌బీట్ లాంటి సినిమా చేస్తాడా?" అని నాలో ఒక సందేహం! అయినా ఇంకా మేకప్ టెస్టు కావాలి.

నా సినిమాలో హీరో అసమర్థుడు. సంఘం కట్టుబాట్లను ఎదిరించి, ప్రేమించిన ప్రియురాలిని పెళ్ళి చేసుకోలేని పిరికిపంద. అట్లాగని ఆ అమ్మాయి మీద ప్రేమలేదని కాదు. ఆ అమ్మాయిని చూస్తే అతని ముఖం వెలిగిపోతుంది. ఆర్థిక కారణాల దృష్ట్యా పై చదువుల కోసం తల్లి వెండి కడియా లమ్మి తనను చదివిస్తుందన్న క్షోభ అతన్ని ప్రతీ క్షణం కుంగదీస్తూ ఉంటుంది. దానికితోడు పరీ క్షల్లో పాసవుతానా లేదా, ఉద్యోగం దొరుకుతుందా లేదా అనే సంశయాలతో గిల్టీగా ఫీలవుతాడు. అంతకుముందు ప్రేమించిన అమ్మాయిని మరిచి పోయాననుకుని ఇంకో అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆ రెండో అమ్మాయి ఇతన్ని మోసం చేసి పోతుంది. ఈ సంఘర్షణనంతా అతని హావభావాల్లో ప్రకటించాలి. అంతటి బరువైన పాత్రను పోషించేశక్తి ఇతనికి ఉందా? అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

'ఈ విషయాలన్నీ ఇప్పుడే ఇతనికి చెప్ప కూడదు. ఎందుకంటే, ఒకవేళ అతనికి ఈ పాత్ర నచ్చకపోయినా లేక నాకూ, మా యూనిట్ సభ్యు లకూ అతను నచ్చకపోయినా, స్టోరీ మాత్రం బయటకు పోకూడదు.

అదేం పెద్ద కమర్షియల్ హిట్ సినిమా కథ కాకపోవచ్చు కానీ నా కథ నాకు ముద్దు కదా! అలాగే కథ బయటకు వెళ్తే ఇప్పటి నుండే విమర్శలు, డిస్కషన్స్ మొదలు కావడం నాకు ఇష్టం లేదు.

ఈ ఫీల్డే అట్లాంటిది. కాపీ కొట్టడం, నిర్లజ్జగా ఐడియాలను దొంగిలించడం ఇక్కడ కామన్.

ఎంతో గొప్ప రచయితలలో, పేరుపడ్డ వాళ్ళలో కూడా కొంతమంది దొంగలే! ఎప్పుడో, ఏదో ఒక ఐడియాను, అసలు రచయితకు తెలియకుండా, అతని పర్మిషన్ తీసుకోకుండా, వాడుకుని దొంగ తనానికి పాల్పడ్డవారే! తమ మీద గౌరవంతో తన దగ్గరకొచ్చి వినిపించిన ఎవడో అనామకుడి కథ కాపీ కొట్టి, దాన్ని తమ స్టోరీ డిపార్టుమెంటులో కట్టుబానిసలుగా పడి ఉన్న అసిస్టెంట్లకు ఇచ్చి మాస్ మసాలాలు దట్టించి, గొప్పపేరు సంపా దించే వాళ్ళు ఇక్కడ చాలామందే ఉన్నారు.

కొంతమంది ప్రొడ్యూసర్లు, మహామహా డైరె క్టర్లు, పెద్దపెద్ద హీరోలు తమ దగ్గరకొచ్చి కథ వినిపించే రచయితల ప్రతీ మాటను రహస్యంగా రికార్డుచేసి, తర్వాత తమ వీలుకొద్దీ దాన్ని బయ టకు తీస్తుంటారు.

ఈ మధ్య తమిళంలో వచ్చిన 'పత్తి' కథ తాను ఒక తమిళహీరోకు చాలా సంవత్సరాల క్రితం వినిపించానని... అప్పుడు అది నచ్చలేదని చెప్పి, తర్వాత దాన్ని సినిమాగా తీశారని, తెలుగు రచయితల సంఘానికి ఫిర్యాదు చేశాడో అసి స్టెంట్ డైరెక్టర్. వారి జోక్యంతో భారీగా రెమ్యునరే షన్ సంపాదించాడని టాలీవుడ్‌లో టాక్. అలాగే తెలుగు, తమిళభాషల్లో విజయ దుందుభి మోగించిన 'బిచ్చగాడు' సినిమా కథ తనదేనని 'చంద్ర' అనే రచయిత కూడా కంప్లైంట్ చేశాడు.

అందుకే, ముందుగా, కిరణ్ ఉద్దేశం తెలుసు కునేంత వరకు ఏ విషయమూ కమిట్ కాకుండా మౌనంగా ఉండిపోయాను. ఇంతలో మేకప్‌మాన్ వచ్చాడు.

నేను నవీన్‌ని, మేకప్‌మాన్‌ని నారూంలోకి పిలిచి నా హీరోకు ఉండాల్సిన 'లుక్' గురించి చెప్పాను. సినిమా త్రూఅవుట్... హీరో గిల్టీగా, ఇన్ఫీరియా రిటీ కాంప్లెక్సుతో, భవిష్యత్తు మీద భయంతో ఉన్నట్టు పోర్ ట్రే చేయాల్సి ఉంటుంది. అందుకే, హీరోకు గడ్డం పెట్టాలని, మధ్యతరగతి కాస్ట్యూమ్స్, మేధావియైన విద్యార్థిగా ఎస్టాబ్లిష్ చేయాలంటే పెద్ద కళ్ళద్దాలు పెట్టి ఒక సీన్ షూట్ చేద్దామని ప్లాన్ చెప్పాను.

ముగ్గురూ సరేనన్నారు.

గంట తర్వాత నా రూంలోకి వచ్చిన వ్యక్తి అచ్చం నా కథలో నుంచి లేచి నడిచి వచ్చినట్టుగా ఉన్నాడు. నా మనసులో ఏ రూపాన్ని ఊహించు కున్నానో దానికి ప్రతి రూపంగా ఉన్నాడు. నేను

## సినీవాలి

### కూపన్ నెం.7 విజేత

**సింధూర తాడి**

**ఎమ్.వి.పి. కాలనీ, విశాఖపట్నం**

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

### సినీవాలి -9 (14-12-2016)

మా ప్రశ్న: ఎవరిని చూసి హీరో దొరికాడని డైరెక్టర్ అనుకున్నాడు?

మీ జవాబు-------------------------------------------------------------------

చిరునామా-------------------------------------------------------------------

----------------------------------------------------------------------------

-----------------------------------పిన్------------------ఫోన్‌నెం---------------------

**ఈ కూపన్‌ను 13 డిసెంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...




ఇచ్చిన సూచనలతో పాటూ, అతని అందమైన ముఖాన్ని కొంచెం గ్లూమీగా చేయడానికి ముఖానికి కొబ్బరినూనె పూశారు. ఇదే ఇంప్రూవ్‌మెంట్ అంటే. ఏదో పెద్దపెద్ద డెసిషన్స్ కాదు. కిరణ్‌కి మేకప్ మొదలుపెట్టగానే, నవీన్ కాస్ట్యూమర్‌ని పిలిపించి మాకు కావలసిన బట్టలు, మేకప్ అయ్యేలోపు తెప్పించాడు.

అందరం కలిసి మేము చేయాల్సిన సీన్ గురించి డిస్కస్ చేశాము.

హీరో, తన ప్రియురాలు వేశ్యగా మారి తన కళ్ళముందే వ్యభిచరించడం చూసి కన్నీళ్ళు కార్చే సీను.

నేను కిరణ్‌కు కొన్ని జాగ్రత్తలు చెప్పాను. మాట్లాడేటప్పుడు ఎదుటివారి కళ్ళల్లో కళ్ళుపెట్టి మాట్లాడకూడదు. గబగబా నడవకూడదు. గట్టిగా అరవకూడదు. ఇవీ జాగ్రత్తలు... కిరణ్ సరేనన్నాడు.

నవీన్ 'హీరో ఏదో పెదాలు కదుపుతుంటాడు గానీ, మాట బయటకు రాకూడదు. నో డైలాగ్స్, పెదాలు వణుకుతుంటాయి. కంటి నుంచి ఒక్క కన్నీటిచుక్క బుగ్గ మీద నుంచి రావాలి' అంటూ సీన్ వివరించాడు. కెమేరా పొజిషన్ చెప్పి ఫీల్డులోకి ఎటునుంచి ఎంట్రీ ఇవ్వాలి. కెమేరా ముందు ఎలా నిలబడాలి. హీరోయిన్ ఎటువైపు ఉంటుందో చెప్పి, ఆమె ఉన్నట్టుగానే ఊహించుకుని కెమేరాకు అటువైపే చూడాలని చెప్పి కెమేరా దగ్గరకు వచ్చాడు.

అక్కడి నుంచే, ముఖంలో ఏ భావాలు ఎంత సేపు పలకాలో చెప్పాడు. వ్యభిచారం చేస్తున్న హీరోయిన్‌ను చూసినప్పుడు విస్మయం, ఆమె తన దగ్గరకు వస్తున్నప్పుడు ఆవేదన, తన ముందుకొచ్చి నిలబడ్డప్పుడు కళ్ళల్లో నీళ్ళు నిండి, కారడం కావాలని సీక్వెన్స్ చెప్పాడు.

అదే నవీన్‌లో గొప్పదనం. ఆర్టిస్టు నుంచి ఎంత నటన, ఎలా రాబట్టాలో అతనికి బాగా తెలుసు.

కిరణ్ అన్నింటికి తలూపాడు.

కిరణ్ కంట్లో గ్లిజరిన్ వేశారు.

'కెమేరా', 'రోలింగ్', 'యాక్షన్' అన్న కమాండ్స్ తర్వాత మేమంతా ఉద్విగ్నంగా ఎదురు చూస్తున్నాము.

అంతే.

ఒక అద్భుత దృశ్యం మా కళ్ళముందు ఆవిష్కృతమైంది.

నేను ఊహించిన దానికంటే అద్భుతంగా వచ్చింది సీన్. మెమొరీ కార్డును రీడర్‌లో పెట్టి టీవీకి కనెక్ట్ చేసి అందరం కలిసి ఆ సీన్ ప్లే చేసుకుని చూశాం.

మొత్తం సీన్ నిడివి తొంభై సెకండ్లు.

తొంభై సెకన్లలో ఎన్ని షేడ్స్ చూపించాడంటే.... నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

నేనతన్ని మనస్ఫూర్తిగా కౌగలించుకున్నాను.

ఆల్ సెడ్ అండ్ డన్, పేపర్‌మీద ఎంతైనా రాసుకుంటాను. అయితే, ఆ సీన్‌ను ఎగ్జిక్యూట్ చేయడం ఒక ఎత్తైతే, ఆ సీన్‌ని పండించడం మాత్రం, ఫైనల్‌గా నటుడి చేతిలోనే ఉంటుంది.

ఆ విధంగా కిరణ్ అద్భుతమైన నటుడు.

నవీన్‌తో కిరణ్‌కి అన్ని విషయాలు చెప్పించాను.

కిరణ్ ఇట్లాంటి ఆఫ్‌బీట్ సినిమాలు చేయడం తనకు ఇష్టమేనని చెప్పాడు. డెబ్యూ మూవీ కాబట్టి రెమ్యునరేషన్ కూడా పెద్దగా పట్టింపేం లేదన్నాడు. నాకెన్ని రోజులు కావాలంటే అన్ని రోజులు కంటిన్యుయస్‌గా కాల్‌షీట్స్ ఇస్తానన్నాడు. గడ్డం పెంచుకోవాలంటే, తనకు గడ్డం తొందరగా పెరుగుతుందని, వారం రోజుల్లోనే పెంచేస్తానన్నాడు.

ఓ మైగాడ్! అయాం ఆన్ క్లౌడ్ నైన్!

నా బలవంతం మీదనే, నవీన్ కొంచెం వెనుకా ముందాడుతున్నా, వెంటనే అగ్రిమెంట్ టైపు చేయించి, సంతకాల కార్యక్రమం పూర్తి చేసుకున్నాం.

నా సినిమాకు అద్భుతమైన హీరో దొరికాడని నేను సంబరపడ్డాను.

కానీ... నేను సంబరపడినంతసేపు కూడా ఆ సంతోషం నిలబడదన్న విషయం అప్పుడు నాకు తెలియదు.

ఆ రోజు సాయంత్రానికల్లా టీవీ ఛానల్స్ అన్నీ కిరణ్ హీరోగా కొత్తసినిమా మొదలవ్వబోతుందనే బ్రేకింగ్ న్యూస్‌తో హోరెత్తిపోయాయి. చాలా ఛానల్స్ కిరణ్ ఫోటోతోపాటు, అతని ఇంటర్వ్యూలు, బైట్లు టెలికాస్ట్ చేశాయి. కిరణ్ పేరుతో పాటూ నా పేరూ, మా బ్యానర్‌పేరూ మారుమోగసాగాయి. అది ఒకందుకు ఆనందమే అయినా అంత తొందరగా, గంటల్లోనే ఇండస్ట్రీ అంతా మారుమోగిపోవడం నాక్కొంచెం ప్రీ మెచ్యూర్‌గా అనిపించింది. ఇంకా ప్రొడ్యూసర్ గారికి చెప్పనే లేదు. సినిమాకు సంబంధించినంతవరకు మేము ఇంకా ప్రీప్రొడక్షన్ దశలోనే ఉన్నాము. హీరోయిన్స్ సెలెక్ట్ కాలేదు. షెడ్యూల్ వేయలేదు. ఇట్లాంటి సమయంలో, సినిమా గురించి విషయాలు ప్రెస్‌కి తెలిస్తే ప్రశాంతంగా పని చేసుకోలేం.

అందుకే నవీన్‌కి చెప్పి కిరణ్‌కు ఫోన్ చేయించాను. ఫోన్ నాట్ రీచబుల్! నాకు కోపం వచ్చింది.

మర్నాడు ఉదయాన్నే వాళ్ళ నాన్నను తీసుకుని ఆఫీసుకి వచ్చాడు.

పొద్దున్నే, నవీన్ బాగానే వాయించినట్టున్నాడు.

రావడంతోనే వాళ్ళ నాన్న,

"సారీ సార్! కుర్రాడు తొందర పడ్డాడు. మీకు చెప్పకుండా ప్రెస్సుకు వెళ్ళడం తప్పే! కానీ, వాడికి సినిమా అంటే పిచ్చి సార్. కోట్ల ఆస్తి ఉన్నా, స్టాన్‌ఫర్డ్‌లో యంబీఏ చేసినా, వాడి మనసంతా సినిమా మీదనే! మీరు ఎటువంటి రికమెండేషన్ లేకున్నా, వాడి బ్యాక్‌గ్రౌండ్ తెలియకున్నా వాడికి హీరో ఛాన్స్ ఇచ్చేసరికి ఆనందం తట్టుకోలేక నా దగ్గరకొచ్చాడు. పట్టరాని ఆనందంతో ఉన్న కిరణ్ తన ఫ్రెండ్స్ అందరికీ చెప్పాడు. వాళ్ళలో ఒక టీవీ ఛానల్ ఓనరు ఉండడం, అతను వెంటనే ప్రెస్ మీట్ అరేంజ్ చేయడం, అలా ఒకదానికొకటి సంఘటనలు అనుకోకుండా జరిగిపోయాయి" అన్నాడు గిల్టీగా.

కిరణ్ కూడా లేచి "సారీ అన్నయ్యా!" అన్నాడు.

నా గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది. నాకు అన్నాతమ్ముళ్ళు, అక్కాచెల్లెళ్ళు ఎవ్వరూలేరు. కిరణ్ 'అన్నయ్యా' అనేసరికి సెంటిమెంట్ పొంగింది.

"ఇట్సాల్ రైట్" అన్నాను. కిరణ్‌ను నవీన్ దగ్గరకు వెళ్ళి సారీ చెప్పమన్నాను.

తర్వాత కాఫీ తాగుతూ, వాళ్ళ నాన్న..

"సార్! మా వాడు యూఎస్ నుంచి వచ్చిన తర్వాత రెండేళ్ళుగా తిరుగుతున్నాడు. ఎక్కడా అవకాశం రాకపోవడంతో ఎన్నోసార్లు ఇంటికొచ్చి ఏడ్చేవాడు. నేనే ఫైనాన్స్‌చేసి సినిమా తీస్తానంటే వద్దనేవాడు. తనను తాను ప్రూవ్ చేసుకోవాలనే వాడు. వాడికి హీరో ఛాన్స్ ఇస్తామని చెప్పి, వాడికి తెలియకుండా నా దగ్గర, ఇద్దరు ముగ్గురు ముప్పై లక్షలు తినేశారు. వాణ్ణి తిప్పీ తిప్పీ తర్వాత చూద్దామని పంపేవారు. దాంతో వాడిలో సూయిసైడల్ టెండెన్సీ పెరిగింది. చచ్చిపోతాననేవాడు. సరిగ్గా తినడు. మందుకు అలవాటు పడ్డాడు. రాత్రనక పగలనక తాగేవాడు. అందుకే వాడి వెంట బాడీగార్డ్‌ను ఉంచాము. మాక్కూడా వాడి మీద నమ్మకం పోయింది. అసలు వాడికి నటన రాదేమోనని అనుకునేవాళ్ళం. అట్లాంటిది మీరు వాణ్ణి హీరోగా, ఒక్కరోజులోనే సెలెక్ట్ చేయడం మాకు చాలా ఆశ్చర్యంగా అనిపించింది.

**(ఇంకా వుంది)**



## భవనాలతో చెస్

విశ్వనాథ్ ఆనంద్, వ్లాదిమిర్ క్రామ్నిక్, జుడిత్ పోల్గర్... పేర్లు వినగానే టక్కున గుర్తొచ్చే గేమ్ చెస్! ఈ గేమ్ ఆడాలంటే చెస్‌బోర్డు, ఇద్దరు పోటీదారులు ఉంటే సరిపోతుంది. ఎత్తుకుపై ఎత్తులతో, మెదడుకు పదును పెట్టే ఈ ఆటకు ప్రపంచవ్యాప్తంగా విశేష ఆదరణ ఉంది. విషయమేంటంటే, ఇప్పటివరకు ఈ ఆటను మనుషులే ఆడేవారు. ఇప్పుడు సరికొత్తగా మనుషులతోపాటు, ప్రముఖ నగరాల్లోని భవనాలు గేమ్‌లో పాల్గొంటాయి. అదెలా? అని ఆశ్చర్యపోకండి.

అమెరికాకు చెందిన అబె రూజ్ డిజైనింగ్ సంస్థ నగరాల్లోని భవనాల రూపంలో త్రీడీ టెక్నాలజీతో చెస్‌బోర్డు, పావుల్ని తయారు చేసింది. ఉదాహరణకు అమెరికాలోని చికాగో నగరానికి సంబంధించి చెస్‌బోర్డులో విల్లీస్ టవర్‌ను రాజుగా వ్యవహరించవచ్చు. ఆ నగరంలో రెండో అతిపొడవైన భవనం జాన్ హాన్‌కాక్ టవర్ రాణిగా... సైనికులుగా ప్రెంటిస్ ఉమెన్స్ ఆసుపత్రి భవన నమూనాలు ఉన్నాయి. ఇలా డల్లాస్, శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్‌ఏంజిల్స్, శాన్‌డీగో నగరాల చెస్‌పావులు రూపొందించారు. అలాగే చెస్‌బోర్డులో ఆయా నగరాల స్ట్రీట్ మ్యాప్ కూడా ఉంటుంది. ఆటలో నిబంధనలు మాత్రం యథాతథంగా ఉంటాయి. ప్రస్తుతం ఈ చెస్ బోర్డును వారి అధికారిక వెబ్‌సైట్‌లో అమ్మకానికి పెట్టారు. బాగుంది కదూ భవనాల చెస్!



# సురభి



## కోట్లు ఖర్చు పెట్టారు

ప్రపంచంలో ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధమైన ఆహార అలవాట్లు ఉంటాయి. అలా ఏ ప్రాంతంలో ఎలాంటి ఆహారపు అలవాట్లు ఉన్నాయో చూసి, ఫోటోలు దిగాలన్న ఆలోచన ఓ జంటకు వచ్చింది. ఆలోచన వచ్చిందే తడవు కోట్లు ఖర్చుపెట్టి మరీ ప్రపంచ యాత్ర చేపట్టడం విశేషం.

పీటర్ మెంజెల్, ఫెయిత్ డల్యూసియో అమెరికాలోని కాలిఫోర్నియాకు చెందినవారు. ఇద్దరూ వృత్తిరీత్యా ఫోటోగ్రాఫర్లు. దేశాలు తిరిగి, ఆయా ప్రాంతాల్లోని ప్రజలను కలిసి, వారి ఆహార అలవాట్లు తెలుసుకుని, ఫోటోల్లో బంధించాలనుకున్నారు. అమెరికాలో ప్రజలు ఎలాంటి ఆహారం తీసుకుంటున్నారు? జపాన్‌లోని రెస్టారెంట్లలో ఏం వడ్డిస్తారు? ఆస్ట్రేలియాలో ఎలాంటి ఆహారం దొరుకుతుంది? ఇలా ప్రపంచంలోని 80 భిన్నమైన ఆహార అలవాట్ల గురించి స్వయంగా వెళ్ళి తెలుసుకుని ఫోటోలు తీసుకున్నారు. అలా మూడేళ్ళ పాటు తిరిగి దాదాపు 6.6 కోట్లు ఖర్చు చేశారు. ఆ సుదీర్ఘ ప్రయాణంలో తీసిన ఫోటోలతో ఓ ఆల్బమ్ రూపొందించారు. దాని పేరే 'వాట్ ఐ ఈట్: అరౌండ్ ద వరల్డ్ ఇన్ 80 డైట్స్'.



## బ్రెడ్ హోటల్

చాలా దేశాల్లో రెండుమూడు బ్రెడ్ స్లైసెస్‌కి కాస్తంత వెన్న రాసుకొని బ్రేక్‌ఫాస్ట్‌గా లాగించేస్తుంటారు. బ్రెడ్‌తో రకరకాల ఐటెమ్స్ కూడా చేస్తారు. కానీ అదే బ్రెడ్‌తో నిర్మాణాలు చేయడం ఎక్కడైనా చూశారా? నిజమేనండీ... బ్రెడ్‌తో హోటల్‌నే నిర్మించారు.

అమెరికాలోని అరిజోనాలో రిట్జ్-కార్లటన్ సంస్థ క్రిస్మస్ సందర్భంగా ఈ హోటల్ నిర్మించింది.

ఇందులో ఆరుగురు కూర్చునేందుకు వీలుగా డైనింగ్ టేబుల్ ఏర్పాటుచేశారు. 400 పౌండ్ల చక్కెర, 350 పౌండ్ల గోధుమపిండి, 100 పౌండ్ల అల్లంపొడి, 250 గుడ్లు ఉపయోగించి ఈ హోటల్‌ని నిర్మించారు. ఫంక్షన్లకు, పార్టీలకు ఈ హోటల్‌ని అద్దెకు కూడా ఇస్తారు. లంచ్ లేదా డిన్నర్ ఏర్పాట్లు కూడా ఉన్నాయి. ఈ హోటల్ డిసెంబర్ 30 వరకే అందుబాటులో ఉంటుంది. క్రిస్మస్ స్పెషల్ బ్రెడ్‌హౌస్ బావుంది కదూ!

## ఉడుములతో సహవాసం

వాతావరణ మార్పుల వల్ల, కాలుష్యం వల్ల ఈ భూమ్మీద ఉన్న ఎన్నో జీవరాశులు కనుమరుగవుతున్నాయి. ఉడుములు కూడా ఆ కోవలోకే వస్తాయి. అయితే వాటిని సంరక్షించడానికి ముందు కొచ్చాడో వ్యక్తి!

మెక్సికోకు చెందిన రామోన్ అర్చుండియాకి జంతు ప్రేమికుడు. అంతరించిపోతున్న జంతువుల జాబితాలో ఉన్న ఉడుములను సంరక్షించడానికి పూనుకున్నాడు. మొదట్లో రెండు ఉడుములను తెచ్చి పెంచుకోసాగాడు. రానురానూ వాటిసంఖ్య 642కి చేరింది.

వీటి నిర్వహణ కష్టమవడంతో సమీపంలోని అడవిలో ఓ సంరక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేశాడు రామోన్. 40 ఏళ్ళుగా వాటితోనే సహవాసం చేస్తున్నాడు. వీటన్నింటికీ రోజుకు దాదాపు 400 పౌండ్ల ఆహారం అవసరమవుతుందట. దీనికోసం ప్రతిరోజూ ఉదయం దగ్గర్లోని మార్కెట్‌కి వెళ్ళి పళ్ళు, ఆకుకూరలు, కూరగాయలు సేకరిస్తాడు రామోన్.



## ఇలా కూడా చేస్తారా?



జాబ్‌కి అప్లై చేసేప్పుడు ముందుగా రెజ్యూమ్‌ల పైనే దృష్టంతా! రెజ్యూమ్ రాసిన విధానాన్ని బట్టే, అభ్యర్థి టాలెంట్‌పై కంపెనీ ఒక అంచనాకు వస్తుంది. అందుకే రకరకాల ప్రయత్నాలు చేస్తుంటారు జాబ్ సీకర్స్. సుముఖ్ మెహతా కూడా అలాంటి ఓ దారి ఎంచుకున్నాడు. అతడెంచుకున్న దారికి మేనేజ్‌మెంట్ ఫిదా అయిపోయింది.

జీక్యూ కంపెనీలో మార్కెటింగ్ హెడ్ కోసం దరఖాస్తు చేసుకున్నాడు సుముఖ్. అచ్చం జీక్యూ మ్యాగజైన్‌ని పోలిన 20 పేజీల రెజ్యూమ్ తయారు చేసి కంపెనీకి పంపాడు. ఇకనేం ఇతని టాలెంట్‌కి ఫిదా అయిపోయిన మేనేజ్‌మెంట్ ఇంటర్వ్యూ అనేదే లేకుండా వెంటనే ఉద్యోగం ఇచ్చేసింది. క్రియేటివిటీతో జాబ్ కొట్టేశాడు కదా!

**-నర్మద వాసిరెడ్డి**

**“బావగారూ! మన పిల్లకాయల పెళ్ళి మాత్రం ఎటువంటి ఇబ్బందులూ లేకుండా, మాటా మాటా రాకుండా హాయిగా, నవ్వుతూ, కులా సాగా జరిగిపోవాలండీ!” అని చేతులు పట్టు కుని మరీ నవ్వుతూ అన్న మనిషి అచ్యుతా నందం.**

‘అంటే ఏ లొల్లీ జరగకుండా సజావుగా అయిపోవాలంటారు! మాట వరసకు అనుకో డానికైనా మన మధ్య ఈ సంబంధం కుదుర్చు కునే ముందర నుంచీ ఏ పేచీలు లేవే? అంతా భగవంతుడు చూస్తాడులెండి!” ప్రత్యుత్తరమిస్తూ అన్న శాస్త్రీ కరుణమూర్తి.

అచ్యుతానందం కుమారరత్నం ప్రతాప్‌ని, కరుణమూర్తి ముద్దులపట్టి పూజితకు ఇవ్వడానికి ఖాయమైపోయింది.

మధ్యనేదో శుక్రమౌఢ్యం అడ్డంగా నిలిచిందని, శ్రావణమాసంలో చేద్దామని ముహూర్తం కూడా




ఖరారై పోయింది.

“సంప్రదాయాలు పాటిస్తూ, ఏదీ మిస్ కాకుండా, అంగరంగవైభోగంగా వివాహతంతు జరిగేలా అన్ని ఏర్పాట్లూ ఘనంగా చేయాలి. ముఖ్యంగా డబ్బు విషయంలో ఎటువంటి పొర పొచ్చాలు లేకుండా చూసుకుంటే సరిపోతుంది. మన పిల్లలు సుఖంగా ఉండాలనే కదండీ... ఇన్ని హంగులూ, ఆర్భాటాలూనూ...” అని ఆప్యాయంగా భుజం తట్టి మరీ చెప్పాడు కరుణమూర్తి.

అచ్యుతానందం సంతోషంగా తలూపాడు.

రోజులు మహావేగంగా గడచిపోయాయి. ముహూర్తం సమయం ఆసన్నమవడం... పూజిత మెడలో ప్రతాప్ తాళి కట్టేయడం... వధూవరుల నిద్దరినీ గృహప్రవేశం చేయించడం... ఒకటొకటే వరసగా పూర్తయిపోయాయి. అయితే అన్నీ బాగానే ఉన్నప్పటికీ తొలి రేయి సమాగమానికి మాత్రం ముహూర్తాల్లేక, ఒక వారం రోజులు వ్యవధి వచ్చింది. పంతులుగారు ఎన్నిరకాలుగా గుణించినా సరే అమ్మాయిని, అబ్బాయిని ఏకం చేయడానికి వీల్లేకపోయింది. చేసేదేంలేక, వారిద్ద రినీ దూరంగానే ఉంచాల్సి వచ్చింది.

ఈ విషయం తెలిసిన ప్రతాప్‌కి పంతులు మీద చిర్రెత్తిపోయింది. ఇప్పటికే తన జీవితభాగ స్వామి పూజిత అందాలను ఆరగించాలని తెగ ఉవ్విళ్ళూరుతున్నాడాయె! కాని తన కోరిక, బాధ, వేగిరపాటు పెద్దలకు అర్థం కావు. కార్చిచ్చు రేపు తున్న కోరికలను చల్లార్చుకోవాలనే ఆలోచనలో ఉన్న ప్రతాప్ మెదడులో తళుక్కున ఒక ఆలో చన మెరిసింది. పట్టపగలు... సమయం పది గంటలవుతోంది. ఇంట్లో ముసలి బామ్మ తప్ప మరో శాల్తీ అయిపు లేకపోయేసరికి ఎక్కడ్లేని ధైర్యం గుండెల్లోకొచ్చింది.

అంతే, మరి ఆగలేకపోయాడు ప్రతాప్! పూజిత ఉన్న గదిలోకి వెళ్ళేసరికల్లా ఆమె పడు కున్న భంగిమ అతన్ని కిర్రెక్కించింది.



# బామ్మా సూపర్!

-కె.కె.రఘునందన



వెల్లకిలా పడుకుని ఏదో పుస్తకం పట్టుకుని చదువుతోంది. కిటికీలోంచి వచ్చిన ఈదురుగాలికి ఆమె పయ్యెద తొలగిపోయి ఎదసంపదను బట్టబయలు చేస్తోంది. మీది హుక్ కాస్త సడలి లోభాగాన్ని దర్శింపచేస్తూ కవ్విస్తోంది. పల్చటి ఉదరం మధ్య చిన్న చినుకుకు గుంటపడిన ఇసుకతిన్నెలాంటి నాభి ఉత్తేజపరచి ఊరిస్తోంది.

పూజితకు కనిపించకుండా మంచం వెనుక నుండి వెళ్ళి కళ్ళు మూశాడు. ఆ ఆకస్మిక సంఘటనకు తుళ్ళిపడ్డ పూజిత "ఎవరు ఎవర"ంటూ గింజుకుంది. వెంటనే నవ్వేస్తూ, "ఎందుకలా కంగారు పడతావ్? నీ మొగుడు గారినేలే!" అని అమాంతం మాస్టర్ బెడ్‌పైకి ఎగిరి, పూజితను చేతులతో చుట్టేసి, ఒక్క అంగుళం కూడా ఖాళీ ఇవ్వకుండా రకరకాలుగా ముద్దులతో ముంచెత్తాడు.

"ఏయ్! బావా! నీకేమైనా పిచ్చా? మనకి నిన్నగాక మొన్న పెళ్ళైంది. ఇంకా ఆ ముహూర్తానికి..." అని ఏదో అనబోయేంతలో ఆమె పెదాలను, తన పెదాలతో మూసేసి అధరామృతాన్ని జుర్రేశాడు. విడిపించుకునేందుకు శతవిధాల గింజుకుంది. అతని చేతులు వలువలను తీసి పారేయడానికి శ్రమిస్తున్నాయి. ఎద పొంగులపై తల ఆన్చి ఆమె కళ్ళల్లోకి చూస్తూనే ఏదేదో చేసేస్తున్నాడు. పూజితకంతా అగమ్యంగా ఉంది. పెద్దలు తమని శాస్త్రప్రకారం, ముహూర్తం చూసి ఏకం చేద్దామని అనుకునేంతలో ఏమిటీ రగడ? అయినా ఊరుకోలేదు ప్రతాప్!

'ఛీ! పో బావా! నీ దుందుడుకుతనం ఏమీ బాగులేదు! వెళ్ళు! ఇక చేసింది చాలు.. శ్రుతి మించద్దు. అది మన సంప్రదాయాలను కాలరాసినట్లవుతుంది... ప్లీజ్! వెళ్ళు!" అని అతన్ని బ్రతిమిలాడుతూ వెనక్కి నెట్టసాగింది.

ప్రతాప్ మాత్రం తమకంతో "నువ్వెలాగూ నా అర్థాంగివేగా! పెద్దలుపెట్టే ముహూర్తం ఇంకా చాలా దూరం ఉంది. ఈలోగా ఆగలేకనే ఇలా సాహసించా! ఒకవేళ ఎవరన్నాచూస్తే కూడా పెళ్ళెలాగూ అయిపోయిందని తప్పుబట్టరు. అందుకని ఈ అమ్మాయిగారిని ఇక వదలమన్నా వదలనంతే!" అంటూ ఆమెని, తన సొంతం చేసేసుకున్నాడు. ఒక్కక్షణం క్రితం దాకా తిరస్కరిస్తూ వచ్చిన ఆమె, అతని బాహువుల్లోకి కరిగిపోయి, చేసే చేష్టలకి దాసోహమన్నది. తీయని మూలుగులతో స్వాగతం పలికింది. వారి నాలుగు పాదాలు, నాలుగుచేతులు, దేహాలు రెండూ వారి తీరని దాహానికి ఒకటిగా అయిపోయాయి. ఆడ మగ కలయికలో ఇంత మాధుర్యం ఉందానిపించింది ఇద్దరికీ!

"ఏమిట్రా! నీకేమైనా పిచ్చా! ఏంటా వెధవ పని?' అని ఒకటే కేకలేస్తుంటే ప్రతాప్ తన గదిలోంచి బైటకొచ్చేసి - "ఏమైంది బామ్మా? ఏమిటా కలవరింతలు?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"హర్నీ! కలగన్నానట్రా! భడవా! నువ్వు పిచ్చివేషాలేస్తున్నట్టు కలొస్తేనూ... ఒరే ఏదో ఈ ముసలిముండ ఇక్కడ కుక్కినపేనులాగ పడి ఉందని, నువ్వు అమ్మడి గదిలోకి దూరి కక్కుర్తి పడ్డావంటే మాత్రం ఒప్పేదిలేదురోయ్! అలా చేస్తే నీ తాట ఒలుస్తా! జాగ్రత్త! ఈ నాల్రోజులూ ఓర్చుకుని ఉండు! అయినా ఆ పంతులి నసాలి' అని విసుక్కుంది.

'అదేంటి? ముహూర్తాలు ఖరారు చేసుకునే ముందు దీని గురించి పట్టించుకోకపోవడమేంటే... విడ్డూరం కాకపోతేనూ... వాళ్ళిద్దరినీ ఊరించి వదిలినట్లు కాదూ!" అన్నది పెళ్ళికి ఐదురోజుల ముందే దయచేసిన భద్రకాళి బామ్మ! ఆమె కరుణ మూర్తికి దూరపు చుట్టం. వరసకి బామ్మవుతుంది. ముసలి వయసులో కూడా యమ చలాకీగా ఉండటం, పెళ్ళిఏర్పాట్ల విషయంలో తల దూర్చి, సలహాలివ్వడం ఆమెకు పరిపాటి. ఆమె పెద్దతనానికి విలువనిచ్చి గౌరవిస్తారంతా! పెళ్ళి ఘనంగా ముగిసిందని సంతోషిస్తున్న తరుణంలో మొదటిరాత్రి ముహూర్తం బాగా ఎడం అయిపోయిందని తెలిసి ఒంటికాలిపైన లేచింది పంతులు పైన! ఆమెను శాంతింపచేయడానికి నానా తంటాలు పడ్డారంతా! ఆమె అంతలా విరుచుకుపడ్డానికి వెనుక ఉన్న అసలు కథ ఎవరికీ తెలీదు.

భద్రకాళి బామ్మ పట్టుమని పన్నెండేళ్ళు రాకుండానే సమర్తాడింది. ఉన్న ఊళ్ళో సంబంధం కదాని ఒక వ్యవసాయదారుడికే కుదిర్చారు.

పెళ్ళికుదిరి, ఎంచక్కా జరిగిపోయిందని సంతోషిస్తున్న సమయంలో తొలిరాత్రి ముహూర్తం నెలదాకా లేదంటూ పురోహితుడు చెప్పేసరికి, ఆ సంగతి ఇంతదాకా తేల్చక పోవడమేంటంటూ త్రైమంటూ రంకెలేశారు మగపెళ్ళివారు. అన్ని ముహూర్తాలతో పాటు ముఖ్యమైన, మంగళకరమైన మొదటిరాత్రి పట్ల అంత నిర్లక్ష్యమేమిటని వరుడి తల్లి నానా యాగీచేసింది. భద్రకాళికి, అతగాడికి పదేళ్ళ వ్యత్యాసం... అసలే ఉరకలెత్తే కోడె వయసులో ఉన్నాడాయె!

శోభనం గురించి ఆడపెళ్ళివారు పట్టించుకోకుండా ఉండటంతో ఇటు పెద్దలంతా మూతులు ముడిచేశారు. మొత్తం మీద ముఖభంగాలైనాయి. అంత చిన్నవయసులో పెళ్ళి కావడం, పెద్దలంతా ఎందుకలా అవుతున్నారో అర్థం కాలేదు భద్ర

కాళికి. సరిగ్గా అప్పుడే ఒక విద్డూరం జరిగింది. అదే ఆమె పాలిట అశనిపాత మైంది. భద్రకాళిని మనువాడిన అబ్బాయి మార్తాండ, ఊళ్ళో కరణంగారి పిల్ల కావేరిని తీసుకుని పట్నం పారిపోయి, పెళ్ళి చేసుకున్నాడని ఊరూ వాడా పొక్కిపోయింది. ఆడ, మగ పెళ్ళివాళ్ళు గొడవలు పడ్డా, ఫలితం శూన్యమైంది. దీనికంతటికీ కారణం మొదటిరాత్రి ముహూర్తం వెంటనే కుదిరిస్తే ఇంత రాద్ధాంతం జరిగి ఉండేది కాదని, ఆడపిల్ల తరపువారిపై నేరం నెట్టేసి చల్లగా జారుకున్నారు అబ్బాయి తరపువారు. అంతే! ఆ సంఘటన భద్రకాళి మనసులో స్థిరంగా ముద్ర పడి పోయింది.

తర్వాత ఎందరు బలవంతంచేసినా మరి పెళ్ళి ఊసెత్తనని శిలాప్రతిమలాగా అలాగే ఉండి పోయింది. పాపం! ప్రతి వివాహ కార్యక్రమానికీ విధిగా హాజరవుతూ, ఆ సంబరమంతా తిలకించి, ఎవరికీ కనబడకుండా కడివెడు కన్నీళ్ళు పెట్టుకుంటుందంటే అతిశయోక్తి కాదేమో! తదాదిగా ఎక్కడైనా శోభనం ముహూర్తం వెంటనే జరగకపోతే మాత్రం వల్లకాదంటూ తగవుకి దిగుతుంది.

ఇక్కడి ప్రసక్తికొస్తే మాత్రం ప్రతాప్ ఆజానుబాహువు, అరవిందదళాయతాక్షుడు... అదిచూసే ఎర్రగులాబీలాంటి పూజిత, అతనిపై మోజు పడింది. ఎలాగూ బంధువులే కాబట్టి ఎవరూ కాదనలేకపోయారు. అతనికెలాగూ మంచి నౌకరీ ఉండటంతో ముడిపెట్టేందుకే నిశ్చయించారు. అలా




అందరూ అనుకోవడమేంటీ... ఇలా ముహూర్తాలు వెంటనే కుదిరిపోవడం, పెద్ద ఎత్తున పెళ్ళై పోవడం క్షణాల్లో జరిగిపోయింది.

ప్రతాప్ పెళ్ళికోసమే కాక మొదటిరాత్రి సంబరానికి కూడా ఉండాల్సి రావడంతో మొత్తం పదిహేనురోజులు సెలవులు పెట్టుకొని వచ్చేశాడు. ఇప్పుడేమో కార్యక్రమం తారు మారవడంతో మధ్యలో వెళ్ళి, మళ్ళా రావాలనుకున్నాడు. ఈ మాట భద్రకాళి బామ్మ చెవినపడ్డమేమిటి.... చర్రుమని లేచింది. మెడలో తాళికట్టాక శోభనం అవకుండా గుమ్మం దాటడానికి వీల్లేదుకాక వీల్లేదంటూ మొండిపట్టు పట్టింది.

కంపెనీవాళ్ళకు ఈ ఛాందసాలు బోధపడతాయో లేదోనని, ఏదైనా ప్రాజెక్ట్ వర్క్ ఉంటే తనకు మెయిల్ పంపమని, పూర్తిచేసి సబ్‌మిట్ చేస్తానని ఆఫీసు వాళ్ళని ఒప్పించి, అక్కడే ఉండిపోయాడు.

•••

'ఏయ్ బావా! నిన్నే! ఇలా తెల్లారిందో లేదో అప్పుడే ల్యాప్‌టాప్‌తో కుస్తీ మొదలెట్టావా?' అంటూ గదిలోకి వచ్చి ప్రతాప్ ఒడిలోని ల్యాప్‌టాప్ తీసి పక్కన టీపాయ్‌పై పెట్టి, ఆమె వెళ్ళి అతని ఒళ్ళో కూర్చుంది.

"ఏయ్! ఏమిటిది? బామ్మగాని చూస్తే నా తాట ఒలుస్తుంది. దిగిపో!" అని తికమక పడ్డాడు, అనుకోని ఆమె ఆగమనానికి.

"ఏయ్! బుద్ధావతారం! ఆ ముసలిదానికే ఝుడిసిపోతే ఇక మొదటిరాత్రి కార్యక్రమానికి మరింతగా ఝుడిసిపోతావేమో! ఇంట్లో అందరూ గుడికి వెళ్ళారు గాని... నీకేం భయంలేదులే... అసలే మనకు కొంత అనుకోని ఎడబాటు ఎదురైంది. ఈలోగా ఇలా దొంగచాటుగా మూడుముద్దులు, ఆరు కౌగిళ్ళు నీకు మనసారా పంచి పెడదామని.." అని అతని మొహం మీదకి వంగి ఎడాపెడా ముద్దులతో మోమంతా తడిపేసింది పూజిత.

అంతే! ప్రతాప్‌లో ఎక్కడ్లేని ఉత్సాహం ఒక్కసారిగా పెల్లుబికింది. ఆమె విల్లులా వంగితే, అలాగే ఆమెను పొదివి పట్టుకొని సోఫాలో పడేశాడు. తర్వాత మీదకురికాడు. ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. ఇక వారిలో స్పందనలకు కొదువలేదు. అనుభూతులకు లోటులేదు. స్వర్గలోకంలో ఒకటే విహారాలు... సున్నితమైన స్త్రీ శరీరంలో ఎంతటి మహత్తుందో అనుభవపూర్వకంగా తెలిసొస్తోంది అతగాడికి. కరుగ్గా ఉండే మగాడి చేతల్లో ఎంత మాధుర్యముందో ఆమెకి కూడా స్వర్శానుభవంతో అవగతమవుతోంది. నిద్ర సుఖమెరుగదన్నట్టు వారిద్దరికీ ఆ సోఫానే హంసతూలికా తల్పమైంది. శృంగార చేష్టలకు వేదికగా మారి.... కోరికలు సెగలు రేపాక, శరీరాలు అలసి సొలిసాక, ఒక కొలిక్కివచ్చాక తన్మయత్వం చిక్కబడింది. ఎవరో వచ్చిన అలికిడైనట్లయితే గబగబా లేచి బట్టలు సర్దుకుని వెళ్ళిపోయింది పూజిత.

"ఏరా! బడుద్ధాయ్! ఇంక భోజనానికి రావా?" అన్న భద్రకాళి బామ్మ పిలుపుతో ఊహాలోకం నుంచి బయటికి వచ్చాడు ప్రతాప్!

•••

ల్యాప్‌టాప్‌తో పని చేస్తున్నాడే కాని ప్రతాప్ అన్యమనస్కంగానే ఉన్నాడు. దృష్టంతా ఆమని విరబూసినట్లుండే చిరునగవులతో, అందెల గలగలలతో శిరీష పుష్పమల్లే శోభించే తనూలత, యువనగరుల భారాలకు ఒకింత పైటచాటు పరదాలు వేసినప్పటికీ తన కనుచూపుల కొంటెతనానికి కిర్రెక్కిపోతుంటే...ఆ దృశ్యం కమనీయమై గుండెల్లో పొదువుకుంటూ గడపడం ఓ విధంగా ఆహ్లాదం పంచిపెడుతున్నా, ఆ తొలిరాత్రి అందాలను ఆరగించడానికి సమయం కోసం వేచి ఉండటం కష్టాతికష్టమవుతోంది ప్రతాప్‌కి.

ఇక పూజితక్కూడా తన మెడలో అగ్నిసాక్షిగా తాళికట్టిన భర్త ప్రతాప్‌కి మనసావాచాకర్మగా, ఎప్పుడు తన తనువంతా అర్పించి మమేకమైపోదామా అని ఎదురు చూపుల్లో గడుపుతోంది. ప్రతాప్ ఆరడుగుల విగ్రహాన్ని తన కౌగిట్లో ఎప్పుడెప్పుడు బంధించి, ముద్దులతో ముంచెత్తాలా అని నిరీక్షిస్తోంది. సరాగాలతో ఉక్కిరిబిక్కిరి చేసిన పిదప తాము ఒకటిగా సరిగంగ స్నానాలాడితే అత్యంత మనోహరంగా ఉంటుందని ఊహల్లో తేలియాడి పరవశించిపోతోంది.

"హాయ్ ప్రతాప్!" అన్న పిలుపుకి వెనక్కి తిరిగాడు.



## సమ్‌థింగ్ సమ్‌థింగ్ అట!

*శ్రద్ధాకపూర్, ఫరాన్ అక్తర్‌ల మధ్య సమ్‌థింగ్ సమ్‌థింగ్ నడుస్తోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. 'బామీ'తో మొదలైన వీరి ప్రేమ, కాపురం చేసే దాకా వచ్చిందట! ఫరాన్ కొనుక్కున్న కొత్త ఇంట్లోనే శ్రద్ధా ఉంటోందట! ఎంత చిన్న పార్టీ అయినా ఇద్దరూ కలిసి వెళ్ళడం ఈ రూమర్లకు ఊతమిస్తోంది. మొన్నటికి మొన్న ముంబయిలో జరిగిన సిటిజెన్ ఫెస్టివల్‌కి కూడా ఇద్దరూ కలిసే వచ్చారు. ఇలా అన్నిచోట్లకి జంటపక్షుల్లా వెళుతున్న ఇద్దరి మధ్యా కచ్చితంగా ఏదో జరుగుతోందన్నది బాలీవుడ్ మాట!*

"హాయ్! లోవరాజు! ఏమిటిలా అకస్మాత్తుగా!" అడిగాడు ప్రతాప్, మిత్రుడికి కుర్చీలో కూర్చో మని సైగచేస్తూ...

"నీ పెళ్ళికి రాలేకపోయినందుకు క్షమించ మని అడగడానికొచ్చా నంటే నువ్వు నమ్మవే మోరా! ఆఫీసులో ఇద్దరు సెలవులో ఉండటంతో నాకు సెలవివ్వడానికి ఆఫీసరు అస్సలొప్పుకో లేదు. ఇప్పుడు అనుకోకుండా మా చెల్లికి పెళ్ళి సంబంధం కుదిరిందని తెలిసి రావాల్సి వచ్చింది. ఇంతకీ ఆ కార్యక్రమం రంజుగా, మజాగా సాగిందా!" అన్నాడు లోవరాజు ఖుషీగా నవ్వుతూ.

దానికి జవాబుగా పెదవి విరవడం చూసిన రాజు "అదేంటి, పెళ్ళికాగానే అదికూడా కానిచ్చేయ లేదా! మీ పెద్దలు చాదస్తుల్లా ఉన్నారే! మాకైతే పెళ్ళయిన మరుసటి రాత్రే ఏర్పాటు చేసేశారు. మీకిలా కావడం ఒకింత విచారమే! అయినా డోంట్‌వర్రీ! ఇంతకీ ఆ రోజుకి ఏం చిట్కాలు పాటిస్తున్నావేంటి?' అని భుజం మీద చేయివేసి అడిగాడు.

"చిట్కాలా? ఎందుకు?" అయోమయంగా ప్రశ్నిస్తున్న మిత్రుడిని చూసి ఫక్కున నవ్వే శాడు రాజు.

"ఓరి వెర్రిపీనుగా? అసలే జీవితంలో అత్యంత విలువైన మొట్టమొదటి సందడి! దాన్ని ఏదో నామ్‌కే వాస్తే అన్నట్లుగా అయిపో యిందనిపిస్తే, అది మనసుకి, శరీరానికి తృప్తిని స్తుందా? నేనైతే రాత్రంతా జాగారమే చేయించా! దీనికంతటికి మనం పూజించాల్సిన దేవుడొకడున్నాడు... అతగాడి దయమీదనే అంతా ఆధారపడి ఉంటుంది" అని చురుగ్గా చూశాడు.

"దేవుడా? అతడెవర్రా? అతని దయేమిటి? ఒకపక్క చిట్కాలంటున్నావ్? మరొకవైపు దేము డంటున్నావ్? ఏమిటో ఈ గందరగోళమంతా?" వింతగా చూశాడు ప్రతాప్, మిత్రుడివంక.

"మొదటిరాత్రి ఏ గందరగోళం జరగకూడ దనే... ఈ దేవుడూ, చిట్కాలూనూ... ఆడదానికి మగనిపై జీవితాంతం ప్రేమతో ముడిపడేదీ, ముద్రపడేదీ తొలిరాత్రి ఘటనే! మనం ఎంత బాగా ప్రతాపం చూపిస్తే అంతబాగా సఫల మవుతాం. మన శృంగార సామర్థ్యానికి ఆ స్త్రీ, ప్రేమను వర్షంలా కురిపిస్తుంది. ఏదో గడిపేశా మన్నట్లుగా కాక ప్రతి క్షణం అందమైన అను భవాలను పంచిపెట్టి అనుభూతులమయం చేసుకుంటే ఆ స్వర్గమే వేరు. వింటున్నావా? మనకు శృంగార సూత్రాలను ప్రసాదించి మన జీవితాలకు బంగారుబాటలను పరచిన దేవుడు మరెవరో కాదు....

శ్రీ వాత్సాయనుడు! నా తొలిరాత్రి అమో ఘంగా జరిగింది. నీకు నేను కొన్ని చిట్కాలు చెబుతా, విని ఆ విధంగా నడుచుకో... పూర్తి సంతృప్తిని పొందుతావు' అని ఓ మునివర్యుడి మల్లే భంగిమలో నిల్చుని చెప్పటం మొదలెట్టాడు రాజు.

"ఏమిటి? నువ్వు చెప్పేది నమ్మబుద్ధి కావడం లేదు! పెద్ద ఖర్చు కూడా పెట్టనక్కర్లేని అదొ క్కటీ, మనల్ని ఉత్తేజితం చేస్తుందంటే నమ్మలేక పోతున్నాను." అచ్చెరువొందగా అన్నాడామాట!

"పనయ్యాక నమ్మితీరతావు! అది నీ మగువ మనసులో హరివిల్లులా విరిసి హర్షాతి రేకాల్ని మిన్నుముట్టేలా చేస్తుంది. చూస్కో! ఇక నీ తడాఖా చూపిస్తావ్!" అనేసరికి ప్రతాప్‌లో ఒక విధమైన తీపి అనుభూతి మొదలైంది.

రాజు అప్పటికే అందమైన అనుభవాలను చవిచూసి ఉన్నాడాయె! తన పద్ధతులేవో మిత్రు డిగా చెప్పడం వల్ల, అవి తనకు లాభదాయకం అయ్యే అవకాశాలే అధికం!!

రాజు వెళ్ళిపోయినప్పటికీ క్రమేపీ ప్రతా ప్‌లో ఆ భావం రాజుకుంది. ఒకపరి పరీక్షకు కూడా సిద్ధమైనాడు. చిన్నదైనప్పటికీ పనితనం అమోఘమే! ఇక అనుభవపూర్వకంగా ప్రయోగిం చటమే మిగిలి ఉన్నది. మధురమైన ఆలోచ నల్లో మునిగిపోవటం ప్రతాప్ వంతయింది.

•••

మధురోహల్లో పరవశించే పసందైన క్షణాలు... ఒకరినొకరు చిలిపిచేష్టలతో కవ్వించుకునే అద్భుత సమయం!! రసవత్తర సన్నివేశాలకు రూప కల్పన చేసుకునే తన్మయత్వ తరుణం! అమ్మ లక్కలంతా తమ పనై పోదానికన్నట్లుగా లోపల ఉన్న ప్రతాప్ వద్దకు పొమ్మంటూ పాలగ్లాసుతో పంపేశారు పూజితను. సిగ్గుల మొగ్గయిపో తోన్న ఆమె ప్రతాప్ వంక క్రీగంట చూసింది. పాలగ్లాసునందించి అటువైపు తిరిగిపోయింది. అదే అదనుగా భావించిన ప్రతాప్ జేబును తడుముకుని, మెల్లగా తీసి నోట్లో వేసుకుని పర పర నమిలి, నులివెచ్చని పాలు తాగి ఆమెకి చ్చాడు. అలవోకగా ఇటుతిరిగిన ఆమె ప్రతాప్‌కి సమీపంగా చేరి కౌగిలికి ఆస్కారమిచ్చింది. చుబుకమెత్తి పై పెదవినందుకుని తన పెదవికి జోడించాడు. పాలవెన్నెలాంటి పక్కమీదకి చేరిన వారిద్దరూ ఒకటే తాపంతో దొర్లారు. ఇద్ద రిలో వేడి సెగ!! తన ప్రతాపం చూపించాడు ప్రతాప్.

ప్రణయ సల్లాపాలకు ఆజ్యం పోసినట్లుగా స్త్రీ పురుషుల నిట్టూర్పుల సవ్వళ్ళు!! యుద్ధంలో విజేతగా నిలిచిన వీరుడల్లే ఉప్పొంగిపోయాడు ప్రతాప్. లోవరాజు చెప్పిన చిట్కా ఫలితంగా తను తొలిరాత్రి విజయుడే అయ్యాడు. ఇక భయం అన్నమాటకు తావులేదు.

"నేను విజయం పొందాను... విజయం పొందాను.." అని ఒకటే పలవరిస్తుంటే భద్రకాళి పసిగట్టి "ఏరా! బడుద్దాయ్! బారెడు పొద్దెక్కినా లేవకుండా పక్కమీదనే కుస్తీపట్లు పడుతున్నావ్? నీ పట్లేమిటో ఇక్కడ కాదు. రేపు రాత్రి జరగ బోయే శోభనం నాడు చూపించవోయ్! ప్రతాపం!' అని బోసినోటితో నవ్వేసింది.

"చూపిస్తా బామ్మా! ఈ కల నిజం కావ డానికి ఎంతో దూరం లేదు" అని గబుక్కున లేచి బాత్రూంలో దూరాడు.

•••




కండలు తిరిగే సిక్స్ ప్యాక్‌లు, జిమ్‌బాడీలు, చూడగానే ఆకట్టుకునే శరీర ఆకృతి ఈమధ్య మరీ కామన్ అయిపోయింది. అది ఫ్యాషనే అనుకోండి లేదా ఇతరులను ఆకర్షించడానికి చేసే ప్రయత్నం అను కోండి. అయితే శృంగారం విషయానికి వస్తే మాత్రం ఇవన్నీ వృథాయేనట! ఎంత ఆకట్టుకునే బాడీ ఉన్నా బానపొట్ట ఉన్న వారే అందులో కింగులట! ఈ విషయం ఇటీవలే ఓ పరిశోధనలో తేలింది. టర్కీలోని కేసేరి రాష్ట్రానికి చెందిన ఎర్సియెస్ యూనివర్సిటీ

## పొట్ట ఉన్నంత మాత్రాన పనికి రారనుకోవద్దు!

సైంటిస్టులు కొందరు ఓ సంవత్సరం పాటు సర్వే నిర్వ హించారు. బాడీ మాస్ ఇండెక్స్ (బీఎంఐ) అనేది శృంగారంలో ఎలా ప్రభావితం చేస్తుందనేది వారి ప్రధానాంశం. ఈ విషయమై 200 మంది పురుషులను ఎన్నుకుని వారిపై పరిశోధన చేశారు. వారిలో కొందరు సిక్స్‌ప్యాక్ శరీర ఆకృతిని కలిగి ఉంటే, మరికొందరు



పొట్ట ఉన్నవారు. వీరిద్దరికి సంబంధించిన శృంగార విషయాలను సైంటిస్టులు పరిశీలించారు. వారు ఎంత సేపు శృంగారంలో పాల్గొంటున్నదీ, ఎంత సమయం యాక్టివ్‌గా ఉంటున్నదీ అడిగి తెలుసుకున్నారు. వారి బాడీ మాస్ ఇండెక్స్ (బీఎంఐ)ని కూడా లెక్కించారు.

ఈ క్రమంలో వారికి తెలిసిందేమిటంటే సిక్స్ ప్యాక్‌బాడీ ఉన్నవారు కేవలం రెండు నిమిషాల పాటు మాత్రమే సెక్స్‌లో యాక్టివ్‌గా పాల్గొంటున్నారట! అదే పొట్ట ఉన్నవారు, సిక్స్‌ప్యాక్ బాడీ వారికన్నా మూడు రెట్లు ఎక్కువగా అంటే 7.3 నిమిషాల పాటు సెక్స్ చేస్తారట! బాడీమాస్ ఇండెక్స్ ఎక్కువగా ఉన్నవారిలో పొట్ట కూడా ఎక్కువగా ఉంటుందన్న సంగతి తెలి సిందే! ఆ క్రమంలో పొట్ట ఎక్కువ ఉన్నవారు ఎక్కువ సమయం పాటు అంటే దాదాపు ఎనిమిది గంటల పాటు కూడా సెక్స్‌లో పాల్గొనే అవకాశాలు ఉంటాయట! ఇలా ఎందుకంటే ఎస్ట్రాడియోల్ అనే ఓ హార్మోన్ ప్రభావం వల్ల పురుషుల్లో పొట్ట ఎక్కువగా వస్తుందని, అది స్త్రీల శరీరాల్లో ప్రధానంగా ఉండే హార్మోన్ అని సైంటిస్టులు చెబుతున్నారు. అంటే సదరు స్త్రీ హార్మోన్ ప్రభావంతో పొట్ట ఎక్కువగా వచ్చి దాంతో బీఎంఐ పెరిగి అలా అది వారిలోని శృంగార సామర్థ్యాన్ని పెంచుతుందన్నమాట. అందుకే వారు అంతసేపు శృంగారంలో యాక్టివ్‌గా ఉండగలుగుతున్నారని పరి శోధకులు వెల్లడించారు.

నవ్య

అగరొత్తుల సువాసనలతో గుబాళిస్తోంది గదంతా! లేత నీలిరంగు వెలుతురు మంచి మజాగా కనిపిస్తోంది. పూజిత జడనిండా సన్న జాజులు తురుముకుని, పాలగ్లాసుతో సిద్ధంగా ఉన్నది. పూజా కార్యక్రమమంతా పూర్తయ్యాక, ముందుగా గదిలోకి ప్రతాప్ అడుగుపెట్టాడు. ఆన వాయితీ మేర అమ్మలక్కలంతా ఒకటే ఇకఇక లతో గది గుమ్మం దాకా వచ్చి పూజితను లోపలికి నెట్టేసి తలపులు వేసేశారు. పాలు పంచుకునే కార్యక్రమం జరిగేలోగానే ప్రతాప్ ఓ చాటుగా వెళ్ళి లోవరాజు చెప్పిన చిట్కా అమలుచేశాడు.

ఇక అతను చేయాలనుకున్న మొదటిపని పూజితను తనవైపు తిప్పుకోడం.. ఆ వెంటనే ఓ వేడి ముద్దివ్వడం! దానికి శ్రీకారం చుట్టబోయాడు. నడుం మడతల్లోకి చేయి పోనిచ్చి గుండెలకు అదుముకోబోగానే అనుకోని సంఘటన! “ఛీ!ఛీ!!’ అన్న ఒకే ఒక్కమాట ప్రతాప్ గుండెల్లో బాకులా దిగింది. ఇలా తిరకాసైందేమిటి? ఎంతోకాలంగా ఈ క్షణం కోసమే ఎదురుచూస్తుంటే పూజిత ఎందుకిలా అసహ్యించుకుంది? తనంటే బోలె డంత ప్రేమ కురిపించేది కదా? తొలిరాత్రి బాగా ఎడం అయిందని వాపోతూ మెసేజెస్ కుమ్మ రించింది. మరీవేళ ఏమైందని? బహుశా ఈ పనికి ఇష్టం లేదనా అర్థం? తానేమీ మొరటుగా మీద పడలేదే?! దగ్గరగా తీసుకున్నాడంతే! అంత లోనే అసహ్యంగా మొహంపెట్టి మరీ ఛీ! అన్నది. గుండెలపై చేయివేసి తోసేస్తూ...! అరె! తనెంతగా ఆశపడ్డాడు....? ఈ రాత్రి స్వర్గం చవిచూడాలను కున్నాడు. కాని ఆశ అడియాసైంది.

మరో ప్రయత్నంగా సమీపించాడు. అయినా దగ్గరకు చేరడానికి ఇచ్ఛగించలేదు. చేయిపెట్టి మొహాన్ని తోసేసింది. తర్వాత రెండ్రోజులు సైతం అదే వైఖరి! మనసంతా అతలాకుతలమైపోయింది ప్రతాప్‌కి.

“ఏరా! మాటామంతీలేదు? మన చిట్కా పారిందా? చిచ్చర పిడుగల్లే విజృంభించావా? ప్రతాపం చూపించి విరగదీశావనే అను కుంటున్నా!” అని ఫోన్లో ఒకటే ప్రశ్నల వర్షం కురిపించాడు లోవరాజు.




వాడి మాటలకి చిర్రెత్తిపోయింది ప్రతాప్‌కి. “ఏం చిట్కానో ఏమోగాని మొత్తం తిరగబడి పోయిందిరా! అసలు ఆ కార్యక్రమమే మొదలు కాలేదు! అమ్మాయిని ఎలా ఒప్పించాలో పాలు పోవడం లేదు” అని విసుగ్గా అనేశాడు.

“హార్నీ! నువ్వేదో నాకు తీపి కబుర్లు చెబుతా వనుకుంటే... ఇలాంటి తిరకాసు సంగతి మాట్లాడ తావని ఊహించలేదు” అని మరోసారి చిలిపిగా మాట్లాడ్డంతో చిరాకెత్తి ఫోన్ పెట్టేశాడు ప్రతాప్.

ముచ్చటగా గడవాల్సిన మూడ్రోజులూ ఆనం దానికి ఆస్కారం లేని విధంగా గడిచాయి.

•••

‘భద్రం బామ్మ! భద్రం బామ్మా! పిల్లలిద్దరూ మహా రెచ్చిపోయినట్లున్నారే!’ అంటూ తెగ సంతోష పడిపోతూ ఎదురొచ్చి మరీ వంకలు తిరిగిపోతూ చెప్పుకుపోతోంది కరుణమూర్తి సతీమణి, ఆనంది.

‘నీ మొహం! వాళ్ళిద్దరికీ ఏమీ అవలేదని వాళ్ళ ముఖకవళికలు చూసి నే పోల్చలేదనుకు న్నావా? నన్ను మభ్యపెట్టడానికి చెప్పకు. నాకా అనుభవాలు లేకపోయినా ఇలాటి శోభనాలకెన్ని టికి హాజరైనానో నీకు తెలీదు.

లోపాయకారి సంగతి ఛేదించకుండా ఉంటానా? అని మొహంలోకి సూటిగా చూస్తూ అన్నది.

వెంటనే మొహం దించుకుని “బామ్మా! వాళ్ళి ద్దరినీ నువ్వే ఏదోవిధంగా సముదాయించి...” చిన్నగా కన్నీళ్ళు పెట్టుకుంటూ చెప్పింది ఆనంది.

“ఓసి పిచ్చిమొద్దూ... శుభకార్యమన్నాక లోటు పాట్లుండవటే... వాటిని సరిదిద్దకుండా ఇక్కణ్ణుంచి కదుల్తాననుకున్నావా? బెంగపడకు!’ అని ఓదా ర్చింది భద్రకాళి బామ్మ.

‘నీ దయ’ అని కన్నీళ్ళొత్తుకుని అక్కణ్ణుంచి కదిలింది ఆనంది.

•••

“ఓరి మనవడా! ఇట్రా! ఏమిటి, ఈ మూడ్రో జులూ దుమ్ము దులిపేశావా? పిల్లను బెంబేలె త్తించావా? ముఖం మాడ్చుకునే కనిపిస్తోంది, ఎప్పుడూచూసినా! కొంపదీసి ఏమైనా చిట్కాలు గట్రా ప్రయోగించి దాడికి దిగలేదు కదా!

ముందే భయపెట్టేస్తే ఝడిసిపోయే ప్రమాదం ఉంది తెల్సా? మనసువిప్పి చెప్పరా మనవడా? నాకంటే నీకు దగ్గరైన వాళ్ళెవరున్నార్రా? చిట్కా ఏమైనా..?’ అని విచికిత్సగా చూసింది భద్రకాళి బామ్మ.

అంతలా మనసువిప్పి అడుగుతుంటే మరిక దాచాలనిపించలేదు ప్రతాప్‌కి. జరిగిందంతా పూస గుచ్చినట్లుగా వివరించి మరీ చెప్పేశాడు. అది విన్న వెంటనే ఒకటే పకపకమంటూ విరగబడి నవ్వేసింది భద్రకాళి బామ్మ!

“అదేంటి బామ్మా! నీక్కూడా జరిగింది వెట కారంగా అనిపిస్తోందా? ఈ మనవడేదో కష్టాల్లో పడ్డాడన్న జాల్లేదా?” అని విచారంగా చూశాడు ప్రతాప్.

“చెబుతా... చెబుతా.. మరి...మరి.. ఏ సన్నాసి ఇచ్చాడో గాని ఆ చిట్కా నీ విషయంలో ఫలించక పోడానిక్కారణం అమ్మాయి గారికస్సలు అది పడకపోడమే... ఇప్పుడే కాదురా చిన్నప్పట్నించీ అదంటే డోకు దానికి! ఆ సంగతి కనిపెట్టి మిగి లిన రెండ్రోజులన్నా ఆగావా? మళ్ళీ అదే తంతు... అందుకే మొత్తం ముడుచుకుపోయింది..’ అంది వస్తున్న నవ్వునాపుకుంటూ... “మరి ఏమిటి సాధనం?” అయోమయంగా అడిగాడు ప్రతాప్.

“ఈసారి ఆ సన్నాసెవడో ఇచ్చిన చిట్కాని పక్కనపెట్టేసి, నాలుగు సున్నుండలు మెక్కి గదిలో దూరిపో... తర్వాత కథ రసవత్తరంగా నడుస్తుంది. నేనన్నమాట నిజమో కాదో నువ్వే చూస్తావు మనవడా?” అని బోసినోటితో నవ్వుతూ ముందుకు నడిచింది.

•••

“అదిగో... ఈరోజు కూడా మళ్ళా దూరంగా జరిగిపోతావా? మరి మూడ్రోజులు తమరికేమైందో?” తనకి దూరంగా జరగబోతుందేమోనన్న సందే హంతో ముందే పూజితను సందెట బంధించ బోయాడు.

“మరి నాకు నచ్చనిదాన్ని తమరు పరపర నమిలేసి దగ్గరకొచ్చేస్తే ఎలా? చిన్నప్పటినుంచీ అదంటే నాకు పరమ రోత! మా ఇంట్లో ఆచా రాల వల్ల దాన్ని ఎవరూ ముట్టుకోరు కూడా... నాపై ‘ప్రతాపం’ చూపిద్దామని తమరి ఆత్రుత! ఈ రోజుతో ఆ బెంగ తీరిందిలెండి..” అంది అల్లుకు పోతూ...

పూజిత ఎదభాగం పూలదండల్లే హృదయాన్ని తాకుతూ ఏవో తెలీని లోకాలకు లాక్కెళుతుంటే “హమ్మ! ఉల్లీ! ఇంత లొల్లి చేస్తావా? చూడు నీ సహాయం లేకుండా ఎలా మజా చేస్తానో...?” అని తన బాహువుల్లో పూర్తిగా ఇరికించుకున్నాడు ప్రతాప్.

మర్నాడు “ఏరా! మనవడా? సున్నుండలు ఎలా పనిచేశాయిరా? ప్రతాపం చూపించావా?” అని పెరట్లో బాత్రూంలో దూరుతున్న ప్రతాప్‌ని ఆపి అడుగుతుంటే... “సూపర్ బామ్మా!” అని నవ్వు కుంటూ లోపలికెళ్ళిపోయాడు

**సెల్: 97054 11897**

# ఆరోగ్యమే మహాభాగ్యం



## వ్యాయామంతో కీళ్ళ నొప్పులు పరార్!

కీళ్ళ నొప్పులు వృద్ధులను తీవ్రమైన బాధకు గురిచేస్తాయి. కనీసం అటూ ఇటూ కదల్లేని స్థితిని కలిగిస్తాయి. ఇలాంటి స్థితి నుంచి బయటపడాలంటే కొద్దిపాటి వ్యాయామం చేస్తేచాలు అంటున్నారు పరిశోధకులు. ముఖ్యంగా మహిళల్లోనే కీళ్ళనొప్పులు ఎక్కువగా ఉంటాయని వారు చెబుతున్నారు. సుమారు 250 మంది మహిళల మీద పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ 60 నుంచి 70 సంవత్సరాల వయస్సు కలవారే! వీరి చేత సుమారు రెండు వారాల పాటు తేలికపాటి వ్యాయామాలు చేయించారు. అనంతరం వీరిని పరిశీలించగా వీరిలో 45 శాతం మంది చిన్న మెట్లు ఎక్కడం, కొద్దిగా గబగబా నడవడం, కూచున్న చోటు నుంచి త్వరగా పైకి లేవడం వంటి మార్పులను గమనించారు. వీరిలో ఈ మార్పునకు కారణం వ్యాయామమే అని వారు స్పష్టం చేస్తున్నారు. అయితే వైద్యుల సలహా లేకుండా వృద్ధులు వ్యాయామం చేయకూడదని వారు హెచ్చరిస్తున్నారు.



## మంచి చేసే చెడు అలవాట్లు

చిన్నపిల్లలు నోట్లో తరచూ వేలు వేసుకోవడం, గోళ్ళు కొరకడం వంటివి చేస్తుంటారు. ఇవి తప్పు అని, ఆరోగ్యానికి హాని అని పెద్దలు వారిని వారిస్తారు. ఈ అలవాట్లే పెద్దయిన తరువాత వారికి ఆరోగ్యాన్నిస్తాయన్న విషయం కెనడాలో నిర్వహించిన ఓ పరిశోధనలో తేలింది. పిల్లలు నోట్లో వేలు వేసుకోవడం, గోళ్ళు కొరకడం వలన క్రిములు శరీరంలోకి వెళ్ళి ఇన్‌ఫెక్షన్లకు దారి తీస్తుంది. ఇది నిజమే అయినా చిన్నతనంలోనే ఇన్‌ఫెక్షన్లను తట్టుకునే శక్తి వారికి ఈ చెడు అలవాట్ల వలన వస్తుందని వీరు అంటున్నారు. ఈ కారణంగా వారు పెద్దయిన తరువాత ఇన్‌ఫెక్షన్ బారిన పడే అవకాశం తగ్గిపోతుందని కూడా చెబుతున్నారు. అయితే అలవాట్లు మంచివని చెప్పడం తమ ఉద్దేశం కాదనీ, ఇవి రోగనిరోధకశక్తిని పెంచడానికి దోహదం చేస్తాయన్న విషయం మాత్రమే చెబుతున్నామని వారు స్పష్టం చేస్తున్నారు.



## ప్రమాదాన్ని హెచ్చరించే రక్తపరీక్ష

ఇప్పటి వరకూ కేన్సర్ వచ్చిన తరువాత దానిని గుర్తించడం జరుగుతోంది. దీని కారణంగా జరగవలసిన నష్టం కాస్తా జరిగిపోతుంది. ఈ నష్టాన్ని గుర్తించడానికి రక్తపరీక్షను ఒకదాన్ని రూపొందించారు. దీని ద్వారా భవిష్యత్తులో కేన్సర్ వచ్చే అవకాశాలు ఉన్నాయా? లేదా? అన్న విషయం నిర్ధారణ అవుతుంది. రక్తంలో ఉండే మాంసకృత్తులు రెట్టింపు కావడాన్ని (మ్యుటేషన్)ఈ పరీక్ష ద్వారా గుర్తించవచ్చు.



మ్యుటేషన్ ఉందని తెలితే భవిష్యత్తులో ఆ వ్యక్తికి కేన్సర్ వచ్చే అవకాశాలు ఎక్కువ అని పరిశోధకులు అంటున్నారు. బ్రిటీష్ సైన్స్ ఫెయిర్‌లో ఈ రక్తపరీక్ష వివరాలను వెల్లడించారు. ఫ్యామిలీ హిస్టరీ ఉన్న వ్యక్తులకు ఈ రక్త పరీక్ష ఓ వరం లాంటిదని పరిశోధకులు చెబుతున్నారు.

## హోదాతో ఆరోగ్యం

ధనవంతులు పేదవారికన్నా పది పదిహేను సంవత్సరాలు ఎక్కువ జీవిస్తారన్న విషయం గతంలో నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. దీనికి రకరకాల కారణాలను వారు విశ్లేషించారు. పోషకాహారం, వ్యాయామం, మంచి మందులు వారి జీవితకాలాన్ని పెంచుతాయన్న విషయం స్పష్టమైంది. ఇప్పుడు హోదా కూడా ఆరోగ్యాన్ని ఇస్తుందన్న విషయం వీరి పరిశోధనల్లో తేలింది. సుమారు 45 కోతుల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీటిని బృందాలుగా విభజించారు. కొన్ని రోజులకు బృందంలోని ఓ కోతి ఆధిపత్యం చెలాయిస్తే మిగతా కోతులు దాని అదుపు ఆజ్ఞలలో మసలుకునేవి. కొన్ని నెలల తరువాత కోతుల ఆరోగ్యాన్ని పరిశీలించారు. లీడరుకోతి మునుపటి కన్నా ఆరోగ్యంగా ఉండగా, మిగతా కోతుల్లో రకరకాల ఆరోగ్య సమస్యలను గమనించారు. వీటిలో కణాలు అస్తవ్యస్తమవడం గమనించారు. హోదా కలిగిన కోతికీ, మిగతా కోతుల ఆరోగ్యానికీ చాలా స్పష్టమైన మార్పు కనిపించిందని పరిశోధకులు చెబుతున్నారు. ఈ మార్పు మనుషుల్లో కూడా కలుగుతుందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



-చిన్ని







# 'రాశి' పెట్టిన దాంపత్యాలు

పెళ్ళిళ్ళు స్వర్గంలో జరుగుతాయంటారు.

ఎవరెవరు దాంపత్య జీవితం సాగించాలో ఆ దేవుడు ముందే నుదుటన రాసి ఉంచుతాడన్నది మన విశ్వాసం.

అంటే రాశులు కలిస్తేనే పెళ్ళి జరుగుతుందన్నమాట.

'వాళ్ళిద్దరికీ 'రాసి'(శి) పెట్టి ఉంది. అందుకే పెళ్ళి జరిగింది. చక్కగా కాపురం చేసుకుంటున్నారు' అని పెద్దలు యువ జంటల్ని చూసి అనుకోవడం కద్దు.

కోట్లు ఖర్చు పెట్టి పెళ్ళి చేసినా, అబ్బాయి, అమ్మాయి రాశులు కలవకపోతే ఆ బంధం కలకాలం నిలవదనేది చాలామంది విశ్వాసం. ఇది ఇప్పటికిప్పుడు పుట్టుకొచ్చిన విశ్వాసం కాదు. దశాబ్దాల తరబడి నరనరాల్లో జీర్ణించుకున్న నమ్మకం. 21వ శతాబ్దంలోకి అడుగుపెట్టినా సరే ఈ నమ్మకం చెక్కు చెదరలేదు.

అమ్మాయికీ, అబ్బాయికీ పెళ్ళి చేయాలంటే ఒకరికొకరు నచ్చడం, మనసులు కలవడం ప్రధానం కాదు, వారి రాశులు కలవడం ముఖ్యం అనుకుంటున్నారు. అప్పుడే వాళ్ళు కలకాలం కలిసి ఉంటారన్నది కూడా చాలామంది నమ్మకం. ఏఏ రాశుల వారు పెళ్ళి చేసుకుంటే ఎంత ఆనందంగా, సుఖంగా ఉంటారో అన్న విషయాలు మీ కోసం....

### మేషం - కుంభం

ఈ రాశులు వారు డల్‌గా ఉండడం కానీ, మూడీగా ఉండడం కానీ జరగదు. వీరిలో ఎల్లప్పుడూ నూతనోత్సాహం వెల్లివిరుస్తూ ఉంటుంది. ఈ రెండు రాశులవారు వివాహం చేసుకుంటే ఒకరినొకరు బాగా అర్థం చేసుకుంటారు. ఇద్దరు ఒకే రకంగా ఆలోచించడంతో పాటు ఇద్దరి అభిరుచులు ఒకేలాగా ఉంటాయి. ఇల్లు, కుటుంబం, స్థిరత్వం వంటి విషయాలలో ఏకాభిప్రాయం కలిగి ఉంటారు. స్నేహితులతో కలిసి ఆనందంగా గడపడానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. ఒకరినొకరు బాధ పెట్టుకోవడం కానీ, కించపరుచుకోవడం వంటివి చేయరు. ఒకరి అభిప్రాయాలు ఒకరు గౌరవించుకుంటూ ముందుకు సాగిపోతారు కనుక వీరిద్దరినీ సరి జోడి అంటారు.

### వృషభం - కర్కాటకం

ఈ రాశులకు చెందిన జంట ఒకరికోసం ఒకరు అన్నట్టుగా జీవిస్తారు. మానసికంగా, శారీరకంగా వీరిమధ్య బంధం పటిష్టంగా ఉంటుంది. ఒకరినొకరు అర్థం చేసుకుంటూ తమ బంధాన్ని మరింత పదిలపరుచుకుంటారు. ఇద్దరూ ఎలాంటి గొడవలూ లేకుండా ముందుకు సాగుతారు. ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌరవించుకుంటారు. ఒకరినొకరు పొగుడుకోకపోయినా, పొరపొచ్చాలు అన్నవి లేకుండా జీవితాంతం ఒకరి పట్ల మరొకరు ప్రేమగా, అభిమానంగా ఉంటారు. ఈ రెండు రాశులవారు వివాహం చేసుకుంటే వారి జీవితం సుఖంగా, ఆనందంగా సాగుతుందని అంటారు.

### మిథునం - కుంభం

ఈ రాశులవారు ఒకరిపట్ల ఒకరు విపరీతమైన ప్రేమ, అభిమానం కలిగి ఉంటారు. కొద్ది కాలం కిందట కలిసినా, ఎన్నో సంవత్సరాల తరబడి పరిచయం ఉన్నవారిలా కలిసిపోతారు. వీరిద్దరి ఆలోచనలు ఒకే విధంగా ఉండడమే కాకుండా కొత్తదనాన్ని ఎక్కువ ఇష్టపడతారు. ఇద్దరూ కలిసి ఉండేందుకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. కుంభ రాశి వారు క్రియేటివ్‌గా ఉంటే మిథునరాశి వారు దాన్ని ఆస్వాదిస్తారు. ఒకరికొకరు అన్నట్టుగా కలిసిపోతారు. ఈ జంట కలకాలం సుఖంగా, సంతోషంగా ఉంటుందని చెబుతారు.

### కర్కాటకం - మీనం

ఈ రెండు రాశులు నీటికి సంకేతాలు. ఇద్దరూ చాలా సున్నిత మనస్కులు. ఒకరినొకరు బాధ పెట్టుకోవడం కానీ, పరుషంగా మాట్లాడుకోవడం కానీ చాలా వరకూ చేయరు. ఒకరి అభిప్రాయలు మరొకరి అభిప్రాయాలతో చాలా వరకూ కలుస్తాయి. మీనరాశి వారు ఇతరులతో చాలా సులభంగా కలిసిపోతారు. చేసే పని పట్ల చివరి వరకూ నిబద్ధత కలిగి ఉంటారు. బంధం విషయంలో కూడా అలాంటి నిబద్ధతే కలిగి ఉండడం వలన వీరి బంధం కలకాలం నిలిచి ఉంటుంది. ఈ రెండు రాశుల వారిని బెస్ట్

కపుల్స్ అంటారు.

**సింహం - ధనుస్సు**

సింహరాశి వారిలో ఉండే ఆత్మవిశ్వాసాన్ని ధనుస్సు రాశి వారు బాగా ఇష్టపడతారు. సింహ రాశి వారు సమస్యలను తెలివిగా, లౌక్యంగా పరిష్కరించుకోగలుగుతారు. ఇద్దరూ ఒకరంటే ఒకరు అభిమానంగా ప్రేమగా ఉంటారు. జీవితాన్ని ఆస్వాదిస్తారు. లక్ష్యాలను చేరుకోవడంలో ఒకరికొకరు సహాయంగా ఉంటారు. ఒకరికొకరు అన్నట్టుగా జీవితాన్ని గడుపుతారు. వీరిద్దరూ సరిజోడి అనడంలో ఎలాంటి సందేహాలు అక్కర్లేదు అంటారు.

**కన్య - వృషభం**

ఈ రాశుల వారిది హిట్ పెయిర్‌గా చెప్పవచ్చు. రెండు రాశుల వారు ప్రశాంతంగా, ఒకరి పట్ల మరొకరు నీతిగా నిజాయితీగా ఉంటారు. అన్ని విషయాలనూ ప్రాక్టికల్‌గా ఆలోచిస్తారు. తమ బంధం కలకాలం కొనసాగించేందుకు ఇష్టపడతారు. ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకుంటారు. నేలవిడిచి సాము చేయకుండా జీవితాన్ని సుఖమయం చేసుకునేందుకే ఎక్కువ ఇష్టపడతారు. కన్యారాశి వారిలో ఆలోచనా శక్తి ఎక్కువగా ఉంటుంది. ఈ రెండు రాశుల వారు తొందరపడి నిర్ణయాలు తీసుకోరు.

**తుల - కుంభం**

ఈ రాశుల వారిద్దరి మధ్య శారీరకంగా, మానసికంగా బంధం చాలా గట్టిగా ఉంటుంది. కొత్తకొత్త విషయాలను తెలుసుకోవడంలో ఇద్దరూ ఉత్సాహంగా ఉంటారు. ఇద్దరి మధ్య మంచి అవగాహన కలిగి ఉంటారు. అపార్థాలకు, అపోహలకు తావు చాలా తక్కువ. ఒకరంటే ఒకరికి ప్రేమ, గౌరవం ఎక్కువగా ఉంటుంది. అందుకే ఈ రాశుల వారిది అద్భుతమైన జంట అని చెబుతారు.

**వృశ్చికం - కర్కాటకం**

ఈ రాశి వారు ఒకరిపట్ల ఒకరు అభిమానంగా, ఇష్టంగా ఉంటారు. ఈ రాశుల వారు విడివిడిగా ఎలా ఉన్నా జోడీగా మారితే బాగుంటారు. ఒకరి పట్ల మరొకరు కేరింగ్‌గా ఉంటారు. కాకపోతే వృశ్చిక రాశి వారిలో అసూయ కొద్దిగా ఉంటుంది. కానీ భాగస్వామి పట్ల పూర్తి విశ్వాసంతో ఉంటారు.

**మకరం - వృషభం**

మకర రాశి వారు, వృషభ రాశివారిలో ఉండే జాలి, దయాగుణాన్ని ఎక్కువగా ఇష్టపడతారు. వృషభరాశి వారిలో పనిపై ఉండే ఆసక్తిని, సెన్సాఫ్ హ్యూమర్‌ని మకర రాశి వారు ఇష్టపడతారు. ఒకరి మీద ఒకరికి ప్రేమ, ఇష్టం ఎక్కువగా ఉంటుంది. ఒకరి సామీప్యాన్ని ఒకరు చివరి వరకూ బాగా ఎంజాయ్ చేస్తారు. వీరిద్దరి జోడి అన్నివిధాలా బాగుంటుంది. ఇద్దరూ మంచి జోడి అని అందరి చేతా ప్రశంసలు అందుకుంటారు.

## ఈ లక్షణాలు తప్పనిసరి

**కాలంతో పాటు అమ్మాయిలు, అబ్బాయిల మనస్తత్వాలు, ఆలోచనలు, అభిరుచులు మారిపోతున్నాయి. అమ్మాయిలు తమకు సరైన భాగస్వామిని ఎంచుకోవడంలో కొద్దిగా తడబడుతూనే ఉంటారు. అందుకే అమ్మాయిలూ! కాబోయే భాగస్వామి మీకు సరైన జోడి అని తెలుసుకోవాలంటే, ఈ కింది లక్షణాలు వారిలో ఉన్నాయో లేదో తెలుసుకోండి.**

- జీవిత భాగస్వామిలో అమ్మాయిలు చూడవలసిన మొట్టమొదటి లక్షణం ధైర్యం. ఎట్టి పరిస్థితుల్లోనూ పట్టిన చేయి విడువకుండా సమస్యలను ధైర్యంగా పరిష్కరించుకోగలగాలి.
- మంచి అలవాట్లు అన్నిటి కన్నా చాలా ముఖ్యం. ఉదయాన్నే నిద్రలేవడం వంటివి ఉన్నాయో లేదో సరిచూసుకోండి.
- మీ ప్రైవసీని గౌరవించే వ్యక్తినే భాగస్వామిగా ఎంచుకోండి. ఈ లక్షణం అతనిలో ఉందో లేదో పరిశీలించండి.
- ప్రాధాన్యాలు చాలా ముఖ్యం. స్వీట్ మెమరీస్‌ని మరిచిపోకూడదు. కొందరు అనవసర విషయాలు గుర్తు పెట్టుకుంటారుకానీ, స్వీట్ మెమరీస్‌కి అంతగా ప్రాధాన్యం ఇవ్వరు. అతని ప్రాధాన్యాలు ఏమిటో గమనించండి.
- తమ ఆరోగ్యం గురించి జాగ్రత్తలు తీసుకునే వారు జీవితభాగస్వామి విషయంలో కూడా అంతే జాగ్రత్తగా ఆలోచిస్తారు. ఈ కారణంగా ధూమపానం, మద్యంలాంటి అలవాట్లకు దూరంగా ఉంటారు.
- మీరు ఇష్టపడే లేదా వివాహం చేసుకోబోయే వ్యక్తిలో ఎదుటి వారిని గౌరవించే లక్షణం ఉందో లేదో గమనించండి. ఎదుటి వారిని గౌరవించలేని వ్యక్తి జీవితభాగస్వామిని కూడా గౌరవించలేడని అంటారు.
- శ్రద్ధ అనేది అత్యవసరం. చేసే పనిలో శ్రద్ధ వహిస్తే ఉన్నత శిఖరాలు అందుకోవచ్చు. ఇది ఉద్యోగంలో కావచ్చు, వ్యాపారంలో కావచ్చు. ఏదైనా సరే మీరు ఇష్టపడే అబ్బాయిలో ఈ లక్షణం ఉందేమో గమనించండి.

**ధనుస్సు - మేషం**

ఈ రెండు రాశుల వారు సోషలైజింగ్‌ని ఎక్కువగా ఇష్టపడతారు. ఒకరినొకరు ఇష్టపడుతూ, సహకరించుకుంటూ ముందుకు సాగుతారు. ఎలాంటి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కొంటూ ముందుకు సాగుతారు. ఈ రెండు రాశుల వారిది పర్‌ఫెక్ట్ మ్యాచ్ అంటారు.

**కుంభం - మిథునం**

కుంభరాశి వారు క్రియేటివ్‌గా ఉంటారు. మిథునరాశి వారు దీన్ని బాగా ఇష్టపడతారు. ఈ రెండు రాశుల వారి జంట ఎలాంటి ఒడిదుడుకులైనా ధైర్యంగా ఎదుర్కొని విజయం సాధిస్తారు.





**మీనం - వృశ్చికం**

ఈ రెండు రాశులవారు ఒకరినొకరు అర్థం చేసుకునే గుణం కలిగి ఉంటారు. మీనరాశి వారు ఎలా ఆలోచిస్తారో వృశ్చికరాశి వారు కూడా అలాగే ఆలోచిస్తారు. అలాగని వీరు ఏమీ పెద్ద తెలివితేటలు కలవారని చెప్పడానికి వీల్లేదు. రెండు రాశుల వారిలోనూ సర్దుకుపోయే తత్వం ఉంటుంది. ఈ రెండు రాశుల వారు వివాహం చేసుకుంటే జీవితం ఆనందమయం కావడానికి ఎక్కువ అవకాశాలు ఉన్నాయంటారు.

**మేషం - కర్కాటకం**

మేషరాశి వారు చాలా ధైర్యవంతులుగా ఉంటారు. ఏ విషయంలోనైనా డేరింగ్‌గా ముందుకు వెళ్ళే స్వభావం వీరిది. కర్కాటక రాశి వారు తమ ప్రవర్తనతో ఇతరుల నుంచి తరచూ ప్రశంసలు పొందుతూ ఉంటారు. ఈ రెండు రాశుల వారు వివాహం చేసుకుంటే వైవాహిక జీవితం సాఫీగా సాగిపోతుంది.

**మేషం - మీనం**

మీనరాశి వారు చాలావరకూ సాత్విక స్వభావం కలిగి ఉంటారు. ఎదురు తిరగడం అన్నది సాధారణంగా జరగదు. మేషరాశి వారి సంతోషం కోసం మీన రాశి వారు ఏదైనా చేయడానికి సిద్ధపడతారు. ఒకరి సంతోషం కోసం ఒకరు ఆరాటపడతారు. వీరిది మంచి జంట అని చెప్పవచ్చు.

-దేవి

# మహానంది

(10)



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**మహారాజు కుబేరవర్మ, మహామంత్రి, రాజగురువు, ఆస్థాన జ్యోతిష్కుడూ అయిన సులోచనుడు, కామరూప ఆలయం గర్భాలయం ముందున్న ధ్వజస్తంభం దగ్గర నిలుచున్నారు. ముగ్గురి ముఖాల మీద ఆందోళనా, ఆత్రుతా కలిసి కనిపిస్తున్నాయి. ప్రధానార్చకుడు గర్భాలయంలో దేవి ముందు చేతులు నలుపుకుంటూ నిలుచున్నాడు. క్షణాలు గడుస్తున్నాయి.**

ప్రదక్షిణపథం లోంచీ ఆరుగురు వ్యక్తులు మహారాజు ముందుకు వచ్చి, వినయంగా నిలుచున్నారు. ఆస్థాన శిల్పి విశ్వకర్మవైపు ముగ్గురూ ప్రశ్నార్థకంగా చూశారు.

"ప్రభువులు చిత్తగించాలి. గర్భాలయంలోనూ, ప్రదక్షిణ పథంలోనూ క్షుణ్ణంగా నేనూ, నా సహాయకులూ పరిశీలించాం. నేలమీదా, పైకప్పులో, గోడలలో అమర్చిన రాళ్ళ మధ్య చీమ దూరేంత సందు కూడా లేదు. అపూర్వమైన, మహా పటిష్టమైన రాతి కట్టడం ఇది! అలాగే కళ్ళకు కనిపించని రహస్య ద్వారాలు గానీ, సొరంగాలు గానీ, అలాంటివి ఉంటే, రహస్య మార్గాలను తెరవడానికి సహజంగా అమర్చే మీటలుగానీ, కొక్కేలుగానీ, ఇతర యాంత్రిక భాగాలు గానీ లేవు..."

కుబేరవర్మ తల పంకించాడు.

"ఎందుకైనా మంచిదని, యువరాణీవారు ధ్యానంలో కూర్చున్న స్థానాలు కాకపోయినప్పటికీ, ఆలయ ప్రాంగణాన్ని పూర్తిగా గాలించి వేశాం. నేల మాళిగలూ, రహస్య మార్గాలూ, సొరంగాలూ ఇలాంటివి ఏవీ తమ మహా వంశ సార్వభౌములు కట్టించిన ఈ మందిరంలో లేవు ప్రభూ..." విశ్వకర్మ విన్నవించి ముగించాడు.

కుబేరవర్మ, మహామంత్రి సాగరామాత్యుడి వైపు అయోమయంగా చూశాడు. మహామంత్రి రాజగురువు వైపు చూశాడు.

"రాజమందిరానికి వెళ్దాం..." రాజగురువు క్లుప్తంగా అన్నాడు.

అర్చకుడు కాత్యాయనుడు ధ్వజస్తంభం దగ్గరగా వచ్చి, మహారాజు వైపు వినయంగా చూశాడు. "ఇవాళ గర్భాలయంలో చాలామంది తిరగాల్సి వచ్చింది. ఆగమోక్త ప్రకారంగా మహాసంప్రోక్షణ నిర్వహించాలి. ప్రభువులు అనుమతిస్తే..."

"నిర్వహించండి. అమ్మాయిగారి పేరిట అమ్మవారికి ప్రత్యేక పూజ చేయించండి.." కుబేరవర్మ అన్నాడు.

"చిత్తం...యువరాణీవారి క్షేమం కోసం కామరూప హోమం కూడా చేస్తాను..."

కుబేరవర్మ తల పంకించి, ఆలయ ద్వారం వైపు అడుగులు వేశాడు. మహామంత్రీ, రాజగురువూ అనుసరించారు.

•••

మంత్రాలోచన మందిరం.

మహారాజూ, మహామంత్రీ, రాజగురువూ సమావేశమయ్యారు.

"ప్రభూ, ఒక్క విషయం మాత్రం నిశ్చయంగా చెప్పగలను"



## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించి, కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రం చేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగు రాజ్యంలో సత్రం నిర్వాహకురాలికి సహాయం చేసి, ఆమె ఆశ్రయం పొందుతాడు నంది. తన తండ్రిని చెరసాలపాలు చేసిన వారిని, కలుగులోంచి బైటకు రప్పించాలని సంకల్పించుకుంటాడు నంది. కామరూప రాజ్య యువరాణి లాలసాదేవికి స్వయంవర ఏర్పాట్లు చేస్తాడు మహారాజు కుబేరవర్మ. స్వయంవరం రోజున, కామరూపాదేవి దర్శనానికి ఆలయానికి వెళ్ళిన యువరాణి మాయమవుతుంది. **ఆ తర్వాత......**

యువరాణి లాలస జాతకం లిఖించబడిన బంగారు రేకును పరిశీలించిన సులోచనాచార్యుడు అన్నాడు.

మహారాజు ఆత్రుతగా చూశాడు.

"చిరంజీవి సౌభాగ్యవతి లాలసకు ప్రాణాపాయం లేదు. ఆయుర్దాయ కారకుడైన శని ఉచ్ఛస్థానంలో ఉన్నాడు. శుభదృష్టి ప్రసరిస్తున్నాడు."

"ఆచార్యా! అపార్థం చేసుకోకండి. అమ్మాయి స్వయంవరానికి అనువైన ముహూర్తం తమరే నిర్ణయించారు. చక్కటి ముహూర్తం అన్నారు. ఇప్పుడు ఇలా అయ్యింది. జ్యోతిషం మీద విశ్వాసం..."

"సన్నగిల్లుతుంది, మహారాజా!" సులోచనాచార్యుడు అందుకుంటూ అన్నాడు. "ఏ గ్రహం ఏ క్షణంలో ఎలా వీక్షిస్తుందో మానవుడు ఊహించలేడు. స్వయంవరానికీ, తదనంతరం వివాహానికీ మనం నిర్ణయించిన ముహూర్తాల్లో ఏ దోషమూ లేదు. మరొక్క అంశం కూడా చెప్పగలను. రాకుమారి తప్పకుండా తిరిగి వస్తుంది."

"ఎప్పుడు?" కుబేరవర్మ ప్రశ్నించాడు.

సులోచనాచార్యుడు బరువుగా నిట్టూర్చాడు. "మన ఇలవేలుపు ఆ కామరూపకే తెలియాలి..?"

ద్వారపాలకుడు తలుపు తోసుకుని లోనికి వచ్చి, వినయంగా నిలుచున్నాడు.

"వేగులు వచ్చారా, ద్వారపాలకా?" మహామంత్రి ప్రశ్నించాడు.

"చిత్తం...దర్శనం కోసం నిరీక్షిస్తున్నారు.."

"ప్రవేశపెట్టు!" మహారాజు ఆజ్ఞాపించాడు.

ద్వారపాలకుడు నిష్క్రమించాడు. ఇద్దరు వేగులు లోపలికి వచ్చి మహారాజుకు నమస్కరించారు.

"విన్నవించండి!" మహారాజు హెచ్చరించాడు.

"చిత్తం... రాజకుమారులలో ఎక్కువ మంది నిరాశతో వెళ్ళిపోయారు ప్రభూ! కొద్దిమంది మాత్రం ఆగ్రహం వ్యక్తం చేశారు." ఒక చారుడు అన్నాడు.

"ప్రభువుల ప్రకటనను విశ్వసించారుగా, అందరూ?" మహామంత్రి ప్రశ్నించాడు.

"ఎక్కువమంది విశ్వసించారనే మనవి చేయాలి ప్రభూ," రెండవ చారుడు అన్నాడు.

"అంటే...కొద్దిమంది..?" మహారాజు అన్నాడు.

"ఆ కొద్దిమందిలో తలెత్తిన అనుమానం ఒక్కటే ప్రభూ..యువరాణీవారికి స్వయంవరమూ, వివాహమూ ఇష్టంలేని కారణంగా..."

"అదృశ్య నాటకం ఆడుతున్నామనుకున్నారా?" మహారాజు బరువుగా అన్నాడు.

"చిత్తం..."

"మరొక్క మనవి..." రెండవ చారుడు అన్నాడు. "యువరాణీవారిని అన్వేషించి, తీసుకు వచ్చి, యువరాణీవారితో బాటు రాజ్యాన్నీ స్వీకరించాలన్న ఉత్సాహాన్ని ఎవ్వరూ వ్యక్తం చేయలేదు ప్రభూ.."

"ఊ...ఆ ఆశ కూడా నిరాశే అయ్యింది!" మహారాజు బరువుగా అన్నాడు. "యాభై మంది యువకులలో ఆ ఉత్సాహం, ఉద్రేకం, పట్టుదల ఉన్న వీరుడు ఒక్కడైనా ఉంటాడన్న ఆశతో ఆ ప్రకటన చేశాం..."

"విచారించకండి ప్రభూ!" మహామంత్రి ఓదార్పుగా అన్నాడు. "అమ్మాయిగారిని అన్వేషించే సాహసవంతుణ్ణి మనమే అన్వేషించాలి."

"అన్వేషించుదాం! కామరూప రాజ్యం గొడ్డుపోలేదు!" రాజగురువు సులోచనాచార్యుడు సగర్వంగా అన్నాడు.

"ఆచార్యా, అమ్మాయికి ప్రాణాపాయం లేదన్నారు..." మహారాజు అన్నాడు.

"సందేహం లేదు...యువరాణిది పరిపూర్ణమైన ఆయుర్దాయం!"

"అమ్మాయికి ఆపదలు దాపురించే పరిస్థితులు..."

"మహారాజా, జాతకాన్ని క్షుణ్ణంగా, లోతుగా పరిశీలించి, రేపు ఉదయం తెలియజేస్తాను.." రాజగురువు పైకి లేస్తూ అన్నాడు.

•••

సప్తమి చంద్రుడు బలహీనంగా ప్రకాశించి, విశ్రాంతి కోసం అన్నట్టు మాయమయ్యాడు. ముదురుతూ వస్తున్న చీకటి చుట్టూ ముసురుకుంది. రాత్రి తెల్లవారే ప్రయత్నంలో కాలాన్ని కబళిస్తూ వెడలుతోంది...

అర్ధరాత్రి కావస్తోంది. ఆకాశంలో చుక్కలు మిణుగురు పురుగుల్లా మెరుస్తున్నాయి. భూమి మీదకు కాంతిని చేరవేసే ప్రయత్నంలో నక్షత్రాలు విఫలమవుతున్నాయి.

చీకటిగా ఉన్న స్థావరంలా ఉన్న గుహలోంచీ నల్లటి గుర్రం వెలుపలికి వచ్చింది. ఆకుపచ్చ రంగు గోడలాగా ముళ్ళ పొదలు గుహ ముందు దట్టంగా ఉన్నాయి. నల్ల గుర్రం మీద నల్లటి దుస్తులు ధరించిన వ్యక్తి. గుర్రం ఒక నీడ. రౌతు గుర్రం మీద మరొక నీడ... గుర్రం అతని పాదాల తాకిడిని అర్థం చేసుకుని ముందుకు కదిలింది. పొదల్లో దూరి, కాలి బాట వెంట నడక సాగింది.

గుర్రం మీద, తన ముందు బోర్లా పడుకోబెట్ట బడిన శరీరం మీద రౌతు చేతులు వాలాయి. కుడి ఎడమలకు జారి, పడిపోకుండా ఆ శరీరాన్ని సర్దాయి. నల్లటి వస్త్రం కప్పబడిన శరీరం అతని చేతులకి మెత్తగా; వెచ్చగా తగుల్తోంది. మెత్తటి, వెచ్చటి శరీరాన్ని, అందం రాశిపోసినట్టున్న శరీరాన్ని, మధ్యాహ్నం నుంచీ, చీకటి పడేదాకా చూస్తూనే ఉన్నాడు తను! ఆ శరీరం మెత్తదనంతో, ఎత్తుపల్లాలతో తనకు పనిలేదు! స్త్రీ శరీరంతో తనకి కొండంత అనుభవం ఉంది. అందం కేవలం కంటికి మాత్రమే పరిమితం! అనుభవానికి అందివచ్చిన ఆడదాని శరీర సౌందర్యమే తనకు నచ్చే, తాను మెచ్చే అందం. విస్తరి నిండా వడ్డించిన పదార్థాలను చూస్తూ, మనిషి కంటితో కడుపు నింపుకోలేక అందుకోవాలి; ఆరగించాలి; అనుభవించాలి! చాలా, చాలా విస్తర్లలో వడ్డించిన పదార్థాలను తను ఆరగించాడు; అనుభవించాడు!

**ఇంటి నేలమాళిగలో ఒకమూలన ఇనుపరేకు ఒకటి కనిపించిందతనికి. దానికున్న కొక్కేన్ని పట్టుకుని, పైకి లాగాడు. బిలమార్గం దర్శనమిచ్చింది. మెల్లగా అందులోకి జారాడు. లోపలంతా కటిక చీకటి. లోపలికి అడుగుపెట్టీ పెట్టగానే, అతన్ని ఏదో వాసన చుట్టుముట్టేసింది. సాలెగూళ్ళను చీల్చుకుంటూ బిలమార్గంలో ప్రయాణం సాగించాడు. ఎక్కడికి వెళుతున్నాడతను? ఆ దారి అతన్ని ఎక్కడకు చేర్చింది?**

ఇప్పుడు తన ముందు గుర్రం మీద అచేతనంగా పడివున్న మెత్తటి శరీరం తనకి అవసరం లేదు! ఆ మెత్తటి ఒంటిని అంటిపెట్టుకున్న, గరుకైన ఆభరణాలతోనే తనకు పని! తనది ప్రస్తుతం అందాల కోసం ఆకలి కాదు; ఆభరణాల కోసం ఆకలి! ముందున్న శరీరాన్ని మరొకసారి మొరటుగా గుర్రం మీద సర్ది, గుర్రాన్ని వేగంగా పోనిచ్చాడతను. మెలికలు తిరుగుతున్న దారిలో గుర్రం వేగంగా పరుగెడుతోంది...

అతను చిన్నగా నవ్వుకున్నాడు. క్షణికానందాన్ని ఇచ్చే స్త్రీ శరీరంతో తనకు అవసరం లేదు. తనకు కావల్సినవి అత్యవసరంగా కావాల్సినవి 'వగలు' కాదు, 'నగలు!' నగలు తనవి, వగలు 'అతనివి'! సోదరిలా భావించి తీసుకురమ్మని తనను హెచ్చరించాడు కూడా! తన ముందు గుర్రం మీద పడివున్న శరీరానికి అలంకరించిన నగలన్నీ తనవే! తోడుగా, తను చేసిన మహాసాహసానికి పారితోషికంగా అతను బంగారు నాణేలు ఇస్తాడు? ఆభరణాలూ ఇస్తాడు! 'సంచకరువు'గా, తను చేసే సహాయానికి ముందస్తు పారితోషికంగా అతనిచ్చిన బంగారు గొలుసు బరువుగా తన మెడలో వేళ్ళాడుతోంది!

తను ఒక అమూల్యమైన బొమ్మను విక్రయించబోతున్నాడు. అది సామాన్యమైన బొమ్మ కాదు; అందాల బొమ్మ! పంచప్రాణాలతో అలరారుతున్న బొమ్మ! అంతఃపురంలో ఉన్న అందాల బొమ్మ! అంతఃపురంలో ఉండాల్సిన బొమ్మ! అంతఃపురంలో ఉండబోయే బొమ్మ!

ఆ బొమ్మను తెచ్చి ఇస్తే లక్ష బంగారు నాణేలు ఇస్తానన్నాడు ఆ యువకుడు! తన తాతలూ, తండ్రులూ ఈ తరంలో వంశానికి ఏకైక వారసుడైన తనకు కటిక పేదరికాన్ని ఆస్తిగా అందించారు. కాకపోతే బుర్రను కత్తిలా ఉపయోగించి; అనుకున్నంతా, ఆశించినంతా ఆర్జించుకునేందుకు దారి చూపారు. ఆ దారి ఏమిటో, ఎక్కడుందో, ఎలా ఉందో ఎలా వెళ్ళాలో తరం తరువాతి తరానికి తెలుస్తూ వచ్చింది. వందల ఏళ్ళ క్రితం తన ముత్తాతగారి ముత్తాతగారి ముత్తాత తన పెద్ద కొడుక్కీ, ఆయన తన పెద్ద కొడుక్కీ, ఆయన తన జ్యేష్ఠ పుత్రుడికీ, ఆ విధంగా-తన ముత్తాతగారు తన తాతగారికీ, ఆయన తన తండ్రి గారికీ, తండ్రిగారు తనకూ ఆ దారి చూపించారు...

ఆ దారి... సాహసం చేయగలిగితే సంపదను అందించే మార్గం! అది సొరంగమార్గం; అతి రహస్యమైన సొరంగమార్గం! తరతరాలుగా తన వంశం నివసించిన ఇంటి నేలమాళిగలోంచీ కామరూప గర్భాలయంలోకి, తిన్నగా అమ్మవారి విగ్రహం క్రింద ఉన్న చిన్న అరలోకి చేర్చే సొరంగ మార్గం! ఆలయాన్ని నిర్మించిన తన వంశ మూలపురుషులు ఆ సొరంగ మార్గాన్ని ఎందుకు ఏర్పాటు చేశారో, ఎలా చేయగలిగారో తనకు తెలీదు! ఇవాళ తను ఉపయోగించినట్టు తన పూర్వీకులు ఆ బిలమార్గాన్ని ఉపయోగించుకున్నారో లేదో తనకు తెలీదు. తన పూర్వీకులు మేధావులు! నిష్కారణంగా ఏ పనీ చేయరు. అమ్మవారి ఆభరణాలను కాజేసి ఉంటారు; అనుకరణ అభరణాలు అమ్మవారికి అలంకరించి! అమ్మవారి ఆభరణాలు చేసిన వాళ్ళకి, అనుకరణ ఆభరణాలు చేయడం కష్టమేం కాదు!

రెండు వారాల క్రితం 'అతను' ఆ సాహసం చేయమని అడిగేదాకా, ఆ సొరంగ మార్గం తనకి గుర్తే లేదు! కామరూప రాజ్యం నుండీ రెండేళ్ళ క్రితం పొరుగు రాజ్యానికి వెళ్ళి- ఇక్కడ బ్రతకలేక అక్కడికి వెళ్ళి- రాజధాని 'రత్నకటకం'లో స్థిరపడే ప్రయత్నంలో ఉన్న తనను 'అతను' రహస్యంగా, అర్థరాత్రివేళ పిలిపించుకున్నాడు. గుర్రం ముందుకు పరిగెడుతోంది. గుర్రం మీద కూర్చున్న అతని ఆలోచనలు వెనక్కి పరిగెడుతున్నాయి.

ఏకాంత మందిరంలోకి తీసుకెళ్ళబడిన తనకు

# బ్రేకప్ అవలేదట!

ఆలియాభట్, సిద్దార్థ్ మల్‌హోత్రా ప్రేమ పక్షులన్న సంగతి ప్రత్యేకించి చెప్పుకోనక్కర్లేదు. కొన్నినెలల క్రితం వరకూ ఇద్దరూ తెగ తిరిగేవారు. కానీ ఉన్నట్టుండి ఆలియా పక్కన సిద్దార్థ్ కనిపించడం మానేశాడు. ఇద్దరూ ఎవరికి వారు అన్నట్లుగా తిరగడం మొదలెట్టారు. దాంతో ఇద్దరూ బ్రేకప్ అయ్యారేమో అని అందరూ అనుకున్నారు. కానీ అలాంటిదేమీ లేదని ఆలియా తేల్చేసింది. ఇద్దరూ బిజీగా ఉండడం వలనే కలిసి కనిపించడం లేదని స్పష్టం చేసింది. అంటే ఇద్దరూ బ్రేకప్ కానట్లేగా అంటున్నారు సినీ జనాలు.

దగ్గరగా, ఠీవీగా వచ్చాడతను. తన కళ్ళల్లోకి సూటిగా చూశాడు. అతని మెల్లకన్ను ఒక పక్కకి చూస్తోంది! "సుకర్మా, నీ కుల గోత్రాలూ, నీ వృత్తీ, నీ తత్వమూ, నీ జాతకమూ పూర్తిగా మాకు తెలుసు! కామరూప నగరం నుండీ మా రత్నకట కానికి వలస వచ్చావు. నువ్వు చేయదగిన పని ఒకటి ఉంది. పనికి పారితోషికంగా లక్ష బంగారు నాణేలు లభిస్తాయి నీకు. మా రాజధానిలో శాశ్వత నివాసానికి భవనం; భవిష్యత్తులో తగిన పదవి లభిస్తాయి.."

"తమకు నేను చేయగలిగిన సేవ ఏమిటో సెలవీయండి..."

"ఆ కార్యం కామరూప రాజ్య రాజధానిలో సాధించబడాలి. అందుకే అక్కడ పుట్టిపెరిగిన నిన్ను ఎన్నిక చేశాం. ఇది అతి రహస్యం. వెల్లడ యితే అతి ప్రమాదకరం! విను.." అన్నాడతను కొరకొరా చూస్తూ.

తను తల పంకించాడు.

"నువ్వు కామరూప రాజకుమారి లాలసను అపహరించి, మాకు అప్పగించాలి. రెండు వారా లలో ఆమె స్వయంవరం ఉంది. అది జరిగేలోగా ఆమె మాకు అందాలి!" అన్నాడు. అతడు... కళింగ యువరాజు, కళింగరత్న!

●●●

"రాకుమారినా? అపహరించాలా?" నివ్వెర పాటుతో అడిగాడతను.

"ఔను. అంతఃపురంలో ఉన్న సమయంలో సాధ్యం కాకపోవచ్చు. చెలికత్తెలతో ఏ ఉద్యాన వనానికో, జలక్రీడలకో, ఆలయానికో వచ్చినప్పుడు ప్రయత్నించి, విజయం సాధించవచ్చు...ఆలోచించు. రేపు ఉదయం నీ నిర్ణయం తెలియజేయి. ఆ సాహసం చేయడానికి అంగీకరించినా, అంగీక రించకపోయినా, మా ప్రతిపాదనను నువ్వు అతి రహస్యంగా ఉంచాలి. పెదవి విప్పితే పీక తెగి పోతుంది!" అన్నాడతను.

ఆ రాత్రంతా జాగరణ చేస్తూ ఆలోచించాడు తను. ఏ ఉద్యానవనానికో, జలక్రీడలకో, ఆలయా నికో... అన్నాడతను. ఆలయం.. కామరూప ఆలయం! గర్భాలయం! విగ్రహం క్రింద అర! అరలోకి చేర్చే సొరంగమార్గం! నగరానికి చివర, ఆలయానికి కొద్ది దూరంలో, నదీతీరాన ఉన్న తన పూర్వీకుల ఇంటి నేలమాళిగలోంచీ గర్భాలయంలోకి చేర్చే రహస్య మార్గం గుర్తొచ్చింది తనకు.

అంతఃపుర కాంతలు సహజంగా ఆలయానికి వస్తారు. అందునా స్వయంవరం! ఆ రోజు రాజ కుమారి తప్పకుండా దేవి దర్శనానికి వస్తుంది. ఆలయానికి వచ్చిన ప్రతీసారీ గర్భాలయం ముందు ఏకాంతంలో రాకుమారి ధ్యానం చేస్తుంది. అంతఃపురంలో పరిచారికగా ఉన్న తన ప్రేయసి లతిక తనతో చాలాసార్లే చెప్పింది.

లక్ష బంగారు నాణేలు, స్థిర నివాసం! భవి ష్యత్తులో మంచి పదవి! ఇవన్నీ తనకు తప్పక లభిస్తాయి. ఇస్తానన్న వ్యక్తి సామాన్య పౌరుడు కాదు. యువరాజు! ఆ రాత్రి తెలతెలవారు తుండగా తను నిర్ణయానికి వచ్చాడు! తను సాహసం చేస్తాడు. తన కటిక పేదరికానికి స్వస్తి చెబుతాడు. ఒక రాజకుమారిని, ఒక రాజకుమారు డికి అప్పగించడం నేరమేమీ కాదు! కామరూప యువరాణి, కళింగ యువరాజు ధర్మపత్ని అవు తుంది. అంతే! ఇకపోతే కళింగ యువరాజు కళింగ వర్మ అంత అందంగా లేడు; కొంత వికా రంగా ఉన్నాడు. మెల్లకన్ను, గొగ్గిపళ్ళు. అంతే! ఐశ్వర్యం ముందు అందం ఎంత? నిజానికి సంపదను మించిన సౌందర్యం ఏముంది? పెళ్ళి చేసుకుని తను స్థిరపడవచ్చు! ఎవరో అనాకారి అయిన ఐశ్వర్యవంతురాల్ని!

మరునాటి ఉదయం తన నిర్ణయం చెప్పగానే కళింగరత్న, మెడలోని బరువైన బంగారు గొలు సును తీసి తన మెడలో వేశాడు! స్వయంవరం నాడే రాకుమారిని అపహరించే పథకం వివరించ గానే తనను ఆకాశానికి ఎత్తేశాడు. విజయవంతంగా తిరిగి వచ్చేసరికి రాజవీధిలో విశాలమైన భవనం తన కోసం ఎదురుచూస్తూ ఉంటుందన్నాడు.

లక్ష బంగారు నాణేలు, విశాలభవనం, రాకు మారి ఆభరణాలు.. ఔను అపహరణ సమయంలో యువరాణి ధరించిన ఆభరణాలన్నింటినీ తననే తీసుకోమన్నాడు! ఇంకా కొన్ని గంటలలో, సూర్యో దయానికి ముందే తను కామరూప పొలిమేర దాటి కళింగ రాజ్యంలోకి ప్రవేశిస్తాడు. అక్కడ యువరాజు కళింగరత్న యువరాణిని స్వీకరించ డానికి రథంతో సిద్ధంగా ఉంటాడు...

●●●

రహస్యమార్గం గుండా రాకుమారిని అపహ రించి తెచ్చిన తను; ప్రధానమార్గం గుండా కాకుండా, వంకర టింకరగా చుట్టూ తిరిగి వెళ్తున్న రహస్యమార్గం గుండా ప్రయాణం చేస్తున్నాడు. రహస్యమార్గం... సుకర్మకు పాడుపడిన తమ ఇంటి నేలమాళిగలోంచీ ఆలయంలోని నేలమాళిగలాంటి చిన్న అరలోనికి వెళ్ళే రహస్య బిలమార్గం గుర్తొ చ్చింది.

నేలమాళిగలో ఒక మూల నిరుపయోగంగా తుప్పుపట్టి పడివున్న కొయ్యలనూ, ఇనుప సామా న్లనూ తొలగించాక, రెండు అడుగుల పొడవూ, అంతే వెడల్పూ ఉన్న ఇనుపరేకు కనిపించిందత నికి. దానికి కొక్కెం ఉంది. బాల్యంలో ఎప్పుడో ఒకసారి తన తండ్రి తనకు చూపించాడు! కొక్కెం పట్టుకుని దళసరి ఇనుపరేకును పైకి లాగాడు

## ఇల్లి బాగానే పట్టేసింది



మొన్నటి దాకా చేతిలో ఒక్క సినిమా కూడా లేని ఇలియానాకి ఇప్పుడు రెండు పెద్ద ప్రాజెక్టులలో అవకాశం వచ్చింది. ఇంతలోనే రెండు సినిమాలు ఎలా పట్టేసింది? అన్న అనుమానం అక్కర్లేదు. ఇటీ వలి కాలంలో తన బికినీ ఫోటోలు నెట్‌లో తెగ పెడు తోంది. దాని ఫలితమో ఏమో కానీ అజయ్‌దేవగన్, అర్జున్ కపూర్‌లతో నటించే అవకాశాన్ని దక్కించుకుంది. టాలీవుడ్‌లో తిరిగి పాదం మోపాలని ఎంతగా ప్రయ త్నించినా ఇక్కడి దర్శకనిర్మా తలు ఇల్లి వంక కన్నెత్తి చూడలేదు. ఇక కెరీర్ అట కెక్కేసింది, ఇక పెళ్ళి పీట లెక్కడమే తరువాయి అను కున్న తరుణంలో రెండు అవకాశాలు రావ డంతో ఇలియానా తెగ సంతోషపడిపోతోంది.

తను. కింద కటిక చీకటి! సుమారు నాలుగు అడుగుల కింద నేల మసకగా అవుపిస్తోంది...

రత్నకటక నగరంలో యువరాజు అనుచరుడు సీసం భరిణలో ఇచ్చిన మత్తుమందును జాగ్రత్తగా రొంటిన దోపుకుని నేలమాళిగలోకి జారాడు తను. చీకటి, ఏదో వాసన చుట్టుముట్టేశాయి. కాసేపటికి కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి. సాలెగూళ్ళను చీల్చుకుంటూ బిలమార్గంలో ప్రయాణం సాగించాడు తను; కొద్దిగా వంగి నడవ గలిగినంత పరిమాణంలో బిలమార్గం నిర్మించిన తన పూర్వీకులను లోలోపలే అభినందిస్తూ, అలాంటి సాహసవంతుల, మేధావుల వారసుడిగా జన్మించినందుకూ, వాళ్ళ అడుగుజాడల్లో నడుస్తున్నందుకూ గర్విస్తూ గర్భాలయం కింద ఉన్న చిన్న నేలమాళిగలోకి దూరాడు సుకర్మ. ఊపిరితిత్తుల నిండా గాలి పీల్చుకుంటూ, కాసేపు నేల మీద కూర్చుండిపోయాడు. అతని జిత్తులమారి కళ్ళు నేలమాళిగ కప్పుని పరిశీలిస్తున్నాయి. ఇంట్లో ఉన్న నేలమాళిగలోంచీ గర్భాలయంలో ఉన్న నేలమాళిగలోకి ప్రవేశించి, కాసేపు విశ్రాంతి తీసుకుని, తిరిగి వెళ్ళిపోవడానికే సొరంగమార్గాన్ని నిర్మించడానికి తన పూర్వీకులు మూర్ఖులు కారు; పిచ్చివాళ్ళూ కారు! ఏదో ఉంది! ఏదో పరమార్థం ఉంది!

పైకి చూస్తున్న సుకర్మ కళ్ళు- చీకటికి అలవాటు పడిన కళ్ళు- మెరిశాయి. నేల మాళిగపై కప్పులా ఉన్న నల్లరాతి మీద నెలవంక ఆకారంలో బాణం గుర్తు ఉంది. మొనతో ఏదో సూచించడానికే బాణం గుర్తును ఉపయోగిస్తారు! మొన చూపిస్తున్న వైపు ఆ రాతిని త్రిప్పాలా? సుకర్మ మెల్లిగా పైకి లేచాడు. రెండు అరచేతుల్నీ ఆన్చి, గుండ్రంగా ఉన్న రాతి పలకని బలంగా త్రిప్పాడు. పలక కదలిక అతడిని ఆశ్చర్యంలో ముంచి వేసింది. బలప్రయోగం అవసరం లేకుండానే పలక సున్నితంగా, తేలికగా, ఏమాత్రం చప్పుడు చేయకుండా గుండ్రంగా తిరుగుతోంది! తిరుగుతూ, ఎన్నో శతాబ్దాల క్రితం ఆ నిర్మాణం చేసిన తన వంశ మూల పురుషుల నైపుణ్యాన్ని నిశ్శబ్దంగా చాటుతోంది!

ఒకవైపు ఏర్పడిన సన్నటి సందుగుండా పైనుండీ వెల్తురు నేలమాళిగలోకి దూరుతోంది! సుకర్మకు అర్థమైపోయింది. గుండ్రటి ఆకారంలో ఏర్పడే రంధ్రం గుండా చేతుల ఆధారంతో తాను పైకి చేరుకోవాలి!

తను తెలివిగా సేకరించిన సమాచారం ప్రకారం రాకుమారి మరి కాసేపట్లో ఆలయానికి రావాలి. సుకర్మ ఆలోచనలను చెల్లాచెదురు చేస్తూ పైనుండీ ఏదో అలికిడి వినవస్తోంది. అడుగుల చప్పుళ్ళు. పళ్ళేలు క్రింద పెడుతున్న చప్పుళ్ళు. సుకర్మ శిలాఫలకాన్ని కొంచెం వెనక్కి తిప్పాడు. సందును ఎవరైనా చూస్తే ప్రమాదం!

కాసేపట్లో అస్పష్టంగా మంత్రాలు వినిపిస్తున్నాయి. క్షణాలు గడుస్తున్నాయి. అర్చన సాగుతోంది. చివరికి గంట మోగింది! అర్చన పూర్తయినట్టుంది. అస్పష్టంగా మాటలు...మేమందరం ధ్వజ స్తంభం వద్ద ఉంటాం. ధ్యానం చేసుకోమ్మా! అంది పురుష కంఠం. అర్చకుడు! క్షణంలో చాలా గంటలు ఒకేసారి మోగాయి అస్పష్టంగా. తలుపు, గర్భాలయం ముందున్న మండపం తలుపులు మూసుకున్నట్టున్నాయి. తనకు తెలుసు. ఆ తలుపులకి తగిలించబడిన కంచుగంటల్ని తాను లెక్కలేనన్ని సార్లు చూశాడు, గతంలో!




సుకర్మ జాగ్రత్త కోసం కొన్ని క్షణాలు ఆగాడు. రాకుమారి ధ్యానంలో కళ్ళు మూసుకుని ఉంటుంది. అతను నిర్భయంగా శిలాఫలకాన్ని తిప్పాడు. వర్తులాకారంలో రంధ్రం ప్రత్యక్షమైంది. సుకర్మ రెండుచేతుల్నీ రంధ్రం అంచుల మీదుగా పోనిచ్చి, గట్టిగా పట్టుకున్నాడు. చేతుల బలం అతని శరీరాన్ని పైకి లాగింది.

కామరూప అమ్మవారి విగ్రహం వెనుక భాగంలో తను ఉన్నట్టు గుర్తించాడు సుకర్మ. విగ్రహం వెనుక చాటు నుండీ తొంగి చూశాడు; ఊపిరి బిగపట్టి. రాకుమారి గర్భాలయ ద్వారం ముందు పద్మాసనంలో కూర్చుని ఉంది. ఆమె కళ్ళు మూసి ఉన్నాయి. ఒక్కసారి సుకర్మ కళ్ళు చెదిరినట్టయ్యాయి. రకరకాల రత్నాభరణాలతో మెరిసిపోతున్న రాకుమారి కూర్చున్న భంగిమలో ఉన్న దేవతా ప్రతిమలా ఉంది! ధ్యానంలో మునిగిపోయిన ఆమె క్రమబద్ధంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జరుపుతున్నట్టు ఆమె ధరించిన హారాలు స్పందిస్తూ తెలియజేస్తున్నాయి!

సుకర్మ చప్పుడు చేయకుండా కదిలాడు. విగ్రహాన్ని దాటి, ద్వారం వైపు వెళ్ళాడు. తన రాక రాకుమారి ధ్యానానికి భంగం కలిగించనందుకు సంతోషిస్తూ, పిల్లిలా ఆమె దగ్గరగా జరిగాడు. రొంటిన దోపుకున్న ఔషధం భరిణను తీశాడు. ఉత్తరీయాన్ని తన ముఖానికి చుట్టుకుని, భరిణ మూత తెరుస్తూ, దానిని రాకుమారి ముఖం దగ్గరగా జరిపాడు. ఔషధ ప్రభావం నాసికారంధ్రాల గుండా ఆమె ఊపిరితిత్తులలోనికి ప్రవేశిస్తోందని అతనికి అర్థమవుతోంది. అంతసేపూ, ధ్యానయోగంలో, ప్రాణాయామ ప్రభావంతో క్రమంగా సాగిన ఆమె శ్వాసక్రియ క్రమం తప్పింది. ఎందుకో ఆమె ముక్కుపుటాలు అదిరాయి. నిటారుగా ఉన్న ఆమె తల బలహీనంగా ముందుకు వాలిపోయింది.

సుకర్మ ఆదరాబాదరాగా భరిణ మూత బిగించాడు. ఆమె ధరించిన నగలను ఆప్యాయంగా చూస్తూ, రాకుమారిని మెల్లిగా వెనక్కు వాల్చి, రెండు చేతుల్తో ఎత్తుకున్నాడు.

చేతులు పట్టుకుని రాకుమారి శరీరాన్ని నెమ్మదిగా నేల మాళిగలోకి జారవిడిచాడు. ఆమెకు దెబ్బతగలకుండా, బోర్లా పడుకుని, ఆమెను నేల మీదికి చేరవేశాడు. క్షణంలో తాను నేలమాళిగలోకి జారుకున్నాడు. అతని చేతులు కదిలాయి. శిలాఫలకం బాణం గుర్తు వ్యతిరేక దిశలో తిరిగింది. రంధ్రం మూసుకుపోయింది! ఫలకాన్ని బలంగా తిప్పి, నేలమీద కుప్పగా ఉన్న రాకుమారి శరీరాన్ని చిరునవ్వుతో చూశాడు సుకర్మ. మరునాటి ఉదయం దాకా ఆమె ఆ ఔషధ నిద్రావస్థలోనే ఉంటుంది! రాకుమారి శరీరం వెదజల్లుతున్న మధురమైన సువాసన నేలమాళిగలో వ్యాపిస్తోంది. సుకర్మ కిందకి వంగి, రాకుమారి శరీరాన్ని రెండు చేతుల్తో అందుకున్నాడు. రాకుమారి ఏడు మల్లెపువ్వుల ఎత్తున్నట్టుంది!

తను సాధించాడు! తను జయించాడు. చీకటి పడేదాకా తన శిథిల గృహంలో, నేలమాళిగలో క్షేమంగా ఉంటుంది రాకుమారి. ఒకవేళ, పొరపాటుగా ఆమె కళ్ళు తెరిస్తే ఔషధం ఉండనే ఉంది! రాకుమారి తేలిక శరీరాన్ని అవలీలగా మోసుకుంటూ సొరంగ మార్గంలో తన ప్రయాణం ప్రారంభించాడతను.

•••

కాలం పరిగెడుతోంది. నల్లగుర్రం పరిగెడుతోంది, సుకర్మనూ, రాకుమారినీ మోసుకుంటూ. సూర్యోదయం సమయానికి తను కళింగ రాజ్యంలో ప్రవేశిస్తాడు. అయితే రెండు రాజ్యాల మధ్య ఉండే సరిహద్దు ద్వారం వద్ద కాదు; జనసంచారం లేని స్థలంలో! కళింగ యువరాజు అక్కడ తన కోసం వేచి చూస్తూ ఉంటాడు. నగలు తను తీసుకున్నాడు, ఎప్పుడో. వగలను యువరాజుకు అప్పగిస్తాడు. దానితో తన బాధ్యత తీరిపోతుంది. కళింగ యువరాజు లక్ష నాణేలను రాజధాని చేరాక ఇస్తానన్నాడు. భవంతి కూడా! గుర్రం పరుగు తీస్తూనే ఉంది. ఎదురుగా అరుణోదయం అవుతోంది.

*(ఇంకావుంది)*

# చీమలే మన తొలి రైతులు

భూగోళంపై మనిషి ఉనికి లేని సమయంలోనే వ్యవసాయం ఆరంభమైందట! ఆశ్చర్యంగా లేదూ! నిజమే అంటున్నారు శాస్త్రవేత్తలు. అదెలాగంటే, మనిషి పుట్టకమునుపే చీమలు భూమిపై వ్యవసాయం ఆరంభించాయట.

మనిషి పుట్టుకకు 30 లక్షల సంవత్సరాల క్రితమే ఫిజీకి చెందిన చీమల జాతులు ఆహారం ఎదగడానికి వీలుగా విత్తనాలు నాటాయంటున్నారు శాస్త్రవేత్తలు. రకరకాల మొక్కల విత్తనాలు, వాటి గింజలను చీమలే సేకరించి భద్రపరిచాయనీ, అంతే కాకుండా, వాటి ఎదుగుదలకు అవసరమైన ఎరువులను కూడా చీమలే సమకూర్చాయనీ కాలిఫోర్నియా అకాడమీ ఆఫ్ సైన్స్‌కు చెందిన ఎంటమాలజిస్ట్ (రెసిడెన్స్) Dr Brian Fisher చెబుతున్నారు. మొక్కలకు, చీమలకు చిత్రమైన, మనుగడ సంబంధమైన గాఢానుబంధం ఉందనీ, ఇది పరస్పర



ప్రయోజనకరమైన ప్రకృతి అనుబంధమనీ ఆయన అంటున్నారు. వ్యవసాయం గురించి మానవులకు తెలిసింది కేవలం 12 వేల సంవత్సరాల క్రితం నుండే. కానీ 50 ఏళ్ళ క్రితం మొదటిసారి శాస్త్రవేత్తలు చీమలకూ, వ్యవసాయానికీ ఉన్న అనుబంధం గురించి తెలుసుకోవడం ప్రారంభించారు. ఐతే ఫిజీకి చెందిన చీమలే భూమిపై తొలి వ్యవసాయదారులని సరికొత్త పరిశోధనల్లో వెల్లడైందని డాక్టర్ ఫిషర్ చెప్పారు. నేలను తవ్వి గుంటలు చేసి విత్తనాలు పాతి అవి ఎదిగేవరకు చీమలు ఎంతో ఓపికగా ఎదురుచూసేవి! ఎంతో జాగ్రత్తగా ఆ మొక్కల ఎదుగుదలను చీమలు పరిశీలించేవి! ఆ మొక్కలు ఎదిగిన తర్వాత అవే వాటికి ఆవాసాలుగా మారేవి. వాటి ఫలాలను చీమలే ఆస్వాదించేవి.

ఆకులను కత్తిరించే గుణం గల చీమలు గడచిన 80 లక్షల సంవత్సరాలుగా ఫంగస్‌ను అభివృద్ధి చేస్తూ, తెగుళ్ళనుండి విముక్తి చేసేందుకు దోహదం చేస్తున్నాయట. కొన్ని రకాల చీమలు మొక్కలకు బలవర్ధకమైన ఎరువులను సమకూర్చే ఫంగస్‌ను తయారుచేసేవి. ఈ విధంగా ఫిజీ జాతి చీమలు 700 రకాల జాతుల మొక్కలు అభివృద్ధి చెందేందుకు దోహదం చేశాయట. ఈ చీమలు ఒక్కసారి ఒక విత్తనాన్ని తమ అధీనంలోకి తీసుకుని సంరక్షించడం ప్రారంభిస్తే, వాటి సంపూర్ణమైన ఎదుగుదల పూర్తయ్యే వరకు ఎంతో శ్రద్ధగా పరిశ్రమిస్తాయట.

# పుస్తక సమీక్ష



**జనవంశమ్**

కావ్యకృతి

**ధర:** 450 రూపాయలు

**పేజీలు:** 272

ప్రతులకు నవతెలంగాణ, విశాలాంధ్ర, మన తెలంగాణ, నవోదయ బుక్ హౌస్ బ్రాంచీలు

సాహిత్య చైతన్యమే కవికి నిజమైన గీటురాయి అని ఘోషించారు శేషేంద్రశర్మ. కవిత్వం ఒక జీవన విధానం అని తీర్మానించిన సహస్రాబ్ది దార్శనిక కవి. ఆయన మాటలు, ఆయన కవిత్వం, రచనలు కవుల్ని అంతర్ముఖుల్ని చేస్తాయి. అంతర్మథనానికి ప్రేరేపిస్తాయి. ఆ కోవకు చెందినదే ఈ జనవంశమ్ కావ్యకృతి. జనాన్ని మేల్కొలిపే కవులకు టానిక్ ఇది. గజిబిజి ప్రపంచంలో వాస్తవాన్ని గుర్తించేందుకు దోహదపడే కావ్యకృతి.

**మెరుపు**

సాహిత్యం

వారాల ఆనంద్

**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 122

**ప్రతులకు:** వారాల ఇందిరా రాణి, హనుమాన్ నగర్, కరీంనగర్. మరియు అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

**సెల్:** 94405 01281.



కవి, రచయిత, డాక్యుమెంటరీ చిత్రాల దర్శకుడు వారాల ఆనంద్. ఉత్తర తెలంగాణలోని నాలుగు జిల్లాలో ఉన్న రచయితలు, రచయిత్రుల సాహిత్య అనుభవాలు, సాహిత్యంపై వెలిబుచ్చిన అభిప్రాయాల మాలిక ఈ పుస్తకం. ఇందులోని 48 ఇంటర్వ్యూలు, రివ్యూలన్నీ పాత, కొత్త రచయితలకు, పాఠకులకు, ఔత్సాహికులకు కావల్సినంత సమాచారాన్ని అందించడమే కాదు, సరికొత్త ఆలోచనలతో మెరుగైన పద్ధతిలో ముందుకెళ్ళడానికి దోహదం చేస్తాయివన్నీ.



**షట్చక్రాలు-జ్యోతిర్వైద్యం**

అడవికొలను మాలతి

ధర: 100 రూపాయలు

**పేజీలు:** 158

**ప్రతులకు:** సాహితీ ప్రచురణలు, కాళేశ్వరరావురోడ్, సూర్యారావుపేట, విజయవాడ-02.

జ్యోతిషం ద్వారా మనకు రాబోయే శారీరక, మానసిక లోపాలు గ్రహించి అందుకు అనుగుణంగా ముందు జాగ్రత్తలు పాటించే ప్రయత్నమే జ్యోతిర్వైద్యం. దీనికి మనస్సే ముఖ్యమైన లక్ష్యం. ఒత్తిడి తగ్గించి కర్మదోషాలను తొలగించి మనసును ప్రశాంత పరచడమే ఈ ప్రక్రియ. దీనిని సులభంగా ఈ పుస్తకంలో మనకు వివరించారు రచయిత్రి మాలతి.

**కలికి కథలు**

వెంపటి హేమ

**ధర:** 300 రూపాయలు, **పేజీలు:** 648

**ప్రతులకు:** నవోదయ, తెలుగు బుక్‌హౌస్‌లు

కథా నవలా రచయిత్రి, కవయిత్రి వెంపటి హేమ. సులభశైలిలో చదివించే అనేక వైవిధ్యమైన కథాంశాలున్న 50 కథలున్న సంపుటి ఇది. మన చుట్టూ రోజూ కనిపించే విభిన్న మనస్తత్వాలకు ప్రతిరూపాలీ కథలు.



## స్వీకారాలు

**అందినంత చందమామ**

సోమసుందర్ సాహితీ సంస్పర్శ

అవధానుల మణిబాబు

ధర: 80 రూపాయలు, పేజీలు: 54

**ప్రతులకు:** ఎ.సీతారామలక్ష్మి, 3-62, బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర వద్ద, సర్పవరం, కాకినాడ రూరల్

**ధనక్**

ఇంద్రధనుస్సు

అవార్డు పొందిన నగేష్‌కుమార్ సినిమా ఆధారంగా నవలీకరణ.

అనుష్కా రవిశంకర్, **అనువాదం:** కె.సురేష్

ధర: 70 రూపాయలు, **పేజీలు:** 112

**ప్రతులకు:** మంచి పుస్తకం, తార్నాక, సికింద్రాబాద్-17

**ఆటలు, కథలు, డ్రామాలు**

పాటలు క్రాఫ్ట్ పిల్లలకు ఎందుకు?

వై.మాలతీకృష్ణ

ధర: 20 రూపాయలు,

**పేజీలు:** 40

**ప్రతులకు:** మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం-1, తార్నాక, సికింద్రాబాద్-17.

**బడి**

శాంతివనం మంచికంటి

ధర: 35 రూపాయలు, **పేజీలు:** 72

**ప్రతులకు:** మంచి పుస్తకం తార్నాక, సికింద్రాబాద్-17.

-లలితా త్రిపుర సుందరి




# మిస్టరీ మరణం

**'మా అబ్బాయి చనిపోయాడు. కానీ నాకు అది హత్యేమోనని అనుమానం! మీరు పరిశోధించాలి. అందరూ అది సహజ మరణం అంటున్నారు. నాకు నమ్మకం కలగటం లేదు. మీరు ఒక్కసారి విచారించి నిజానిజాలు తేల్చాలి' దాదాపు అభ్యర్థిస్తున్నట్టు అన్నాడతడు.**

అతడిని పరిశీలనగా చూశాడు డిటెక్టివ్ శరత్.

'జరిగింది వివరంగా చెప్పండి. మీకెందుకొచ్చిందా అనుమానం?' అన్నాడు.

'నా పేరు విశ్వేశ్వరరావు. మీకు తెలిసే ఉంటుంది. సక్సెస్‌ఫుల్ బిజినెస్‌మేన్‌ని! నాకు పిల్లలు లేరు. నేను రామనాథ్‌ని దత్తత తీసుకుని నా వారసుడిగా తయారుచేశాను. త్వరలోనే వాడికి వ్యాపారం అప్పచెప్పి, నేను రిటైర్ అవ్వాలని నిశ్చయించుకుని ఆ ప్రకటన చేశాను. ఇంతలో వాడు అనారోగ్యం పాలయ్యాడు. ఆరోగ్యంగా ఉన్నవాడు, మూడు రోజుల్లోనే మరణించాడు. డాక్టర్లు కిడ్నీ ఫెయిల్యూర్ వల్ల మరణించాడంటున్నారు. కానీ ఇరవై ఎనిమిదేళ్ళ వాడు, ఎలాంటి అనారోగ్యం లేనివాడు, హఠాత్తుగా కిడ్నీ ఫెయిల్యూరై ఎలా మరణిస్తాడు?' ఆవేశంగా అన్నాడు విశ్వేశ్వరరావు.

తల ఊపాడు శరత్. 'అతడి మరణం వల్ల ఎవరికి లాభం?'

'అందరికీ! నాకు పిల్లలు లేనప్పుడు ఎవరికి వారు తమ పిల్లలను దత్తత తీసుకోమని బలవంతం చేశారు. బంధువుల పిల్లలు వద్దని నేను అనాథని దత్తత తీసుకున్నాను. అప్పటినుంచీ పైకేమీ అనకున్నా, అందరూ లోలోపల రగులుతూనే ఉన్నారు. నాకు ఇద్దరు తమ్ముళ్ళు, నలుగురు చెల్లెళ్ళు. వాళ్ళందరికీ వాడు పోతే లాభం' విశ్వేశ్వరరావు కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

'నా అసిస్టెంట్ రాముకు అన్ని వివరాలూ రాసివ్వండి. నేను పరిశోధిస్తాను' అన్నాడు శరత్.

•••

'బాస్, విశ్వేశ్వరరావు ఇద్దరు తమ్ముళ్ళూ సామాజికంగా మంచి స్థాయిలోనే ఉన్నారు. వాళ్ళ పిల్లలు అమెరికాలో ఉన్నారు. బాగానే సంపాదిస్తున్నారు. నలుగురు చెల్లెళ్ళు, వాళ్ళ భర్తలు కూడా ఉన్నత స్థానాల్లోనే ఉన్నారు. వాళ్ళపిల్లలూ విదేశాల్లోనే ఉన్నారు. ఎవరికీ డబ్బులకి కొదవలేదు. వాళ్ళ బ్యాంకు అకౌంట్ల వివరాలు, ఫోన్ల వివరాలు అన్నీ సేకరిస్తున్నాను. కానీ ప్రాథమికంగా చూస్తే, అతణ్ణి ఆస్తికోసం హత్య చేయాల్సిన అవసరం ఎవరికీ ఉన్నట్టు లేదు' చెప్పాడు రాము.

'గుడ్... నువ్వు వాళ్ళని వ్యక్తిగతంగా ప్రశ్నించు. రామనాథ్ గురించి వాళ్ళ అభిప్రాయాన్ని, అతడి ప్రవర్తన, వ్యక్తిత్వానికి సంబంధించిన వివరాలు, అతడి ఆడ, మగస్నేహాల జాబితా తయారు చేయి. నేను అతడికి చికిత్స చేసిన డాక్టర్‌ని కలుస్తాను' అన్నాడు శరత్.

•••

'డయేరియా, డీహైడ్రేషన్.. కిడ్నీ ఫెయిల్యూర్ లక్షణాలు. అబ్బాయి ఇరవై ఎనిమిదేళ్ళ వాడు. అతడికి కిడ్నీ ఫెయిలవుతుందని డాక్టర్లు ఊహించలేదు. తొలిరోజు సరైన చికిత్స లభించలేదు. బాగా ఎక్కువగా తాగటం వల్ల సంభవించిన లక్షణాలుగా భావించారు. వాంతులు, తల తిరగటం, నరాలపై నియంత్రణ లేకపోవటం మొదటి రోజు లక్షణాలు. సరైన చికిత్స లభించకపోవటంతో రెండో రోజుకు గుండె కొట్టుకునే వేగం పెరిగింది. బ్లడ్‌ప్రెషర్ పెరిగింది. నా దగ్గరకు వచ్చేసరికి ఇదీ పరిస్థితి. రాగానే బ్లడ్‌టెస్ట్ చేయించాను. అప్పటికే కిడ్నీ పనిచేయటం మానేయటం వల్ల మలినాలు రక్తంలో కలిసి పోయాయి. నా ప్రయత్నం నేను చేశాను కానీ లాభం లేకపోయింది. తొలి స్థాయిలో సరైన రోగ నిర్ధారణ జరగలేదు' డాక్టర్ దివ్యానంద్ చెప్పాడు, విషాదంగా.

**ఆస్తి మొత్తానికి అతడొక్కడే వారసుడు! ఎటువంటి అనారోగ్యం లేదు. రోజూ గంటపాటు వ్యాయామం కూడా చేస్తాడు. క్రమబద్ధమైన జీవితం. మందుతాగడం తప్పించి ఇతరత్రా చెడు అలవాట్లు ఏమీలేవు. అయితే కిడ్నీలు ఫెయిలై అతడు చనిపోయాడు. డాక్టర్లు కూడా కిడ్నీ ఫెయిల్యూరే కారణమని తేల్చారు. కానీ అతడి తండ్రి మాత్రం కొడుకు జబ్బుతో మరణించలేదన్నాడు. డిటెక్టివ్‌ని ఆశ్రయించాడు. అయితే అతడిది హత్యా? లేక జబ్బుతో మరణించాడా?**

తల ఊపి, 'నాకు కేస్ షీట్ కాపీ ఇస్తారా?' అడిగాడు శరత్.

•••

పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణి తల అడ్డంగా ఊపాడు. 'హత్య అని చెప్పలేం. మానవ శరీరంలోని వైచిత్రి ఇదే. అంతా సవ్యంగా ఉన్నట్టుంటుంది. కానీ లోలోపల ఎలాంటి మార్పులు సంభవిస్తున్నాయో పసిగట్టటం కష్టం. ఏ రోగం హఠాత్తుగా రాదు. ముందుగా అది పంపే సంకేతాలను గుర్తించకపోవటం వల్లనే సమస్యలన్నీ' అన్నాడు.

'ఎవరైనా అతడికి మద్యంలో విషం కలిపే వీలు లేదా?' అడిగాడు శరత్.

'లేదని చెప్పలేం. యువకుడే కాబట్టి ఎలాంటి పరీక్షలు చేసుకోలేదు. లోపల వ్యవస్థ పాడవటం గమనించలేదు. పైగా, రక్తపరీక్షల్లో అధికశాతం ఆల్కహాల్ తప్ప మరే విషపదార్థాలూ కనిపించలేదు' చెప్పాడు డాక్టర్.

కాసేపు ఆలోచించాడు శరత్. 'యూరిన్‌లో కాల్షియమ్ ఆక్సలేట్ క్రిస్టల్స్ ఉన్నాయో, లేదో చూశారా? రక్తంలో ఎసిడోసిస్‌ను పరిశీలించారా?' అడిగాడు.

దెబ్బతిన్నట్టు చూశాడు డాక్టర్, శరత్‌వైపు. 'మైగాడ్' అంటూ కూలబడ్డాడు. 'మన ఆస్పత్రులలో ఆ పరీక్షకు వసతులు లేవు. అసలు దృష్టి ఆవైపు పోలేదు. కానీ..' ఏదో అనబోయి ఆగిపోయాడు డాక్టర్.

'మీరు చెప్తున్న లక్షణాలూ, 'యాంటీఫ్రీజ్ పాయిజనింగ్' లక్షణాలూ ఒకటే కదా?' అడిగాడు శరత్.

నోరు మూయకుండానే తల ఊపాడు డాక్టర్.

•••

'నాకు అతడి బ్లడ్ శాంపిల్స్ కావాలి' గంభీరంగా అడిగాడు శరత్.

•••

'బాస్... నువ్వు అడిగినట్టు రామనాథ్ వారం రోజుల కార్యకలాపాల జాబితా తెచ్చాను' శరత్‌కు అందించాడు రాము.

దాన్ని పరిశీలించటం ప్రారంభించాడు శరత్.

ధనవంతుడైనా క్రమపద్ధతిలో రోజువారీ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాడు రామనాథ్. ఉదయమే గంట వ్యాయామం చేస్తాడు. తరువాత ఆఫీసుకు వెళ్తాడు. ఆఫీసు తరువాత స్నేహితులతో రాత్రి వరకు గడుపుతాడు. తాగుతాడు. రాత్రి ఇంటికి వచ్చి పడుకుంటాడు. అతడికి ప్రత్యేకంగా గర్ల్ ఫ్రెండ్స్ లేరు గానీ, ఇద్దరు ముగ్గురు అమ్మాయిలతో సన్నిహిత స్నేహం ఉంది. ఒక అమ్మాయి తండ్రి ప్రపోజ్ చేశాడు. కానీ ఆ ఆలోచన లేదని రామనాథ్ తండ్రికి చెప్పాడు.

అతడికి అనారోగ్యం మొదలవ్వటానికి ముందు రాత్రి ఓ స్నేహితుడి బర్త్‌డే పార్టీకి వెళ్ళాడు. పార్టీ తరువాత స్నేహితులంతా కలిసి తాగారు. తెల్లారాక అనారోగ్యం మొదలైంది. రాము ఇచ్చిన రిపోర్ట్ చదివి ఆలోచిస్తూ కూర్చున్నాడు శరత్. 'రామూ.. రామనాథ్ స్నేహితులలో ఫోటోగ్రఫీ హాబీ ఉన్నవారెవరో చూడు. అలాగే మోటార్ రిపేరింగ్ షాపుకానీ, పెయింట్ల వ్యాపారం కానీ ఎవరికైనా ఉందేమో కనుక్కో. అంతేకాదు, ఈ



మధ్యకాలంలో అంటే, రామనాథ్ అనారోగ్యం పాలయిన తరువాత, ఎవరి కారైనా హఠాత్తుగా ఆగిపోయిందేమో కనుక్కో' చెప్పాడు.

రాము వెళ్ళిన తరువాత, ఫోరెన్సిక్ ల్యాబ్ నుంచి శరత్‌కి ఫోను వచ్చింది. ఫోనులో చెప్పింది విన్న తరువాత శరత్ ముఖంపై రంగులు మారాయి.

●●●

'అవును. నా కారు కాస్తదూరం వెళ్ళిన తరువాత ఆగిపోయింది. మెకానిక్‌ని పిలిచాను. ఇంజన్‌లో కూలంట్ అయిపోవటం వల్ల ఇంజన్ వేడెక్కి ఆగిపోయిందని చెప్పాడు. నేను వారం క్రితమే సర్వీసింగ్ చేయించాను. అప్పుడే ఎలా అయిపోయిందని మెకానిక్ కూడా ఆశ్చర్యపోయాడు. లీకేజీ లేదు' చెప్పింది రమ్య.

'మీరు రామనాథ్‌ని పెళ్ళి చేసుకోవాలనుకున్నారు కదా?' మృదువుగా అడిగాడు శరత్.

ఆమె కాసేపు మౌనంగా ఉంది. తరువాత చెప్పింది.

'అవును... నేను రామనాథ్‌ని ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కానీ పుట్టుకతో వచ్చిన బుద్ధులెక్కడ పోతాయి? అనాథను తెచ్చి అందలం ఎక్కించారు. అతడికి వాళ్లింట్లో పనిమనిషి కూతురు నచ్చింది. ఆమెనే చేసుకుంటాడట.'

'రామనాథ్‌ని చంపేంత కోపం ఎవరికి ఉంటుంది?' అడిగాడు శరత్.

'ఏమో? నాకు తెలీదు' అంది.

మెట్లు దిగుతూ రాముకి ఫోన్‌చేశాడు శరత్. 'రామనాథ్ ఇంట్లో, పనిమనిషి కూతురు గురించి వివరాలు సేకరించు' చెప్పాడు.

'రమ్య కారు రిపేర్ చేసింది మీరేనా?' అడిగాడు శరత్.

'యెస్.. రమ్య ఈజ్ మై ఫ్రెండ్' బబుల్‌గమ్ నములుతూ చెప్పాడా యువకుడు.

'ఆమె కారు సర్వీసింగ్ చేసింది నువ్వేకదా?'

'యెస్'

'మరి అప్పుడు కూలంట్ నింపలేదా?'

'అదే స్ట్రేంజ్‌గా ఉంది. లీకేజీ కాలేదు, కానీ కూలంట్ మాయమైంది'.

'ఏమో...నువ్వే కూలంట్ పూర్తిగా నింపలేదేమో! కాస్త నింపి మిగతా ఎవరి కూల్‌డ్రింక్‌లోనో, డ్రింక్‌లోనో కలిపావేమో?' అన్నాడు శరత్.

'వాట్ నాన్సెన్స్ ఈజ్‌దిస్? కూలంట్ డ్రింకుల్లో కలిపితే చస్తారు తెలుసా?'

'అందుకే కలిపారేమో..' అన్నాడు శరత్.

'దినేష్..' పిలిచాడు అతడు. దినేష్ అనే యువకుడు వచ్చాడు.

'దినేష్... రమ్య వెహికల్‌లో కూలంట్ పూర్తిగా నింపాం కదా?'

'నింపామండీ.. నేనే నింపాను'.

'మా గారేజ్‌లో అలాంటివేవీ జరగవు. అన్నీ చెక్‌చేస్తాం' అన్నాడు అతడు.

దినేష్ వైపు పరిశీలనగా చూశాడు శరత్.

'నువ్వు... ఇతడి క్లాస్‌మేట్‌వి కదా?' అడిగాడు శరత్.

'అవును. మేము క్లాస్‌మేట్స్. కానీ వాడికి డబ్బు అవసరం. అందుకని నా గారేజ్‌లో పని చేస్తున్నాడు' చెప్పాడు యువకుడు.

'దినేష్.. ఆ రోజు బర్త్‌డే పార్టీకి వచ్చినవారిలో నువ్వూ ఉన్నావు. తరువాత డ్రింక్ పార్టీలోనూ ఉన్నావు. రమ్య కారు ఆగిపోతే.. నీ బదులు మీ యజమాని రిపేర్‌కి వెళ్ళాడెందుకు?'

'వీడు తప్పతాగి పడిపోయాడు. హ్యాంగోవర్. అందుకని నేను వెళ్ళాను. ఎనీ ప్రాబ్లం?'

'యెస్. దేరీజ్ ఎ ప్రాబ్లమ్. ఎందుకంటే, కారులోకి వెళ్ళాల్సిన కూలంట్ డ్రింకులోకి వెళ్ళింది. డ్రింకులోంచి మనిషి శరీరంలోని రక్తంలో కలిసింది. కలిసిన 72 గంటల్లో మనిషి మరణం సంభవించింది'.

ఆ యువకుడు దినేష్ వైపు చూశాడు. దినేష్ ముఖం నిర్భావంగా ఉంది.

'మీరేమంటున్నారో నాకు అర్థం కావటం లేదు' అన్నాడు. నవ్వాడు శరత్.

'రామనాథ్ రమ్యను కాదని పనిమనిషి కూతురు పావనిని ప్రేమించాడు. పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. కానీ పావనిని దినేష్ ఇష్టపడ్డాడు'.

దినేష్ కళ్ళల్లో భయం కనిపించింది.

'రామనాథ్ అంతటి ధనవంతుడిని పావని కాదనదని దినేష్‌కి తెలుసు. అందుకని అతడి అడ్డు తొలగించుకోవాలని..' తనపైకి దూకుతున్న దినేష్‌ని కనుకొలకుల్లోంచి గమనించాడు శరత్. పక్కకు జరిగాడు. తలపై పడాల్సిన ఐరన్‌రాడ్‌ను పట్టుకున్న దినేష్ చేయిని పట్టుకుని మెలి తిప్పాడు.

పరుగున వచ్చాడు రాము. దినేష్‌ని పట్టుకున్నాడు.

తాపీగా ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోను కలిపాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**
**సెల్: 98496 17392**

# వింత పూవులు అందమైన రూపాలు

**ప్రకృతి ఎంతో అందమైనది, అద్భుతమైనది కూడా! చుట్టూ చూడాలే కాని ఎన్నో వింతలు కనిపిస్తాయి. అలాంటి వింతల్లో కొన్ని మానవ మేధస్సుకి చిక్కినా, మరికొన్ని అంతు చిక్కక మర్మంగానే ఉండిపోతున్నాయి. ప్రకృతిలో మనకు ఆశ్చర్యం కలిగించే వింతలు బోలెడున్నాయి. అలాంటి వింతల్లో ఒకటైన పూవుల గురించి మీరూ తెలుసుకోండి.**


హ్యూకర్ లిప్స్


బ్లీడింగ్ హార్ట్

పూవు లంటే ఎవరికి ఇష్టముండదు చెప్పండి. ముఖ్యంగా మగువలకు పూలంటే ప్రాణం. మనకు జాజి, మల్లె, గులాబి ఇలా రకరకాల పూల గురించి తెలుసు. కానీ పావురం ఆకారంలోనో లేదా పెదవుల ఆకారం లోనో, కోతుల ఆకారంలోనో ఉండే వింత వింత పూవులను ఎప్పుడైనా చూశారా! వాటి గురించి విన్నారా? మరి ఆ ఆశ్చర్యపరిచే రకరకాల పూలను గురించి తెలుసుకోండి!

## హృదయం ద్రవిస్తుంది

ఏదైనా బాధలో ఉంటే హృదయం ద్రవిస్తుంది అంటుంటాం కదా! కానీ ఈ పూవును చూస్తే మాత్రం మీరు కచ్చితంగా అలా అనుకొని తీరు తారు. ఈ పూవు పేరు 'బ్లీడింగ్ హార్ట్'! పేరుకు తగినట్లుగానే ఈ పువ్వులు హృదయం నుంచి రక్తస్రావం అవుతున్నట్లుగా ఉంటాయి. చక్కని పింక్ కలర్‌లో ఆకర్షణీయంగా కనిపిస్తాయి. ఇవి ఎక్కువగా కొరియా, జపాన్, చైనా, సైబీరియా దేశాల్లో కనిపిస్తాయి.


డవ్ ఆర్చిడ్

## విచ్చుకున్న పావురం

పావురం శాంతికి సందేశం. రెక్కలు విచ్చుకున్న తెల్లని పావురాన్ని చూస్తుంటే మనసు కూడా ప్రశాంతంగా ఉంటుంది కదా! ఇక ప్రేమికులకైతే చెప్పనవ సరం లేదు. ప్రేమపక్షిగా దాన్ని అభి వర్ణిస్తారు. మరి ఆ ప్రేమపక్షి పూవులా మెరుస్తూ ఉంటే... ఎంత అద్భుతమో కదా! రెక్కలు విప్పుకున్న పావురం ఓ ఆధారంపై కూర్చున్నట్లుగా, ఈ పూవు ఉంటుంది. చక్కని తెలుపు రంగులో ఈ పూలు పూస్తాయి. దక్షిణ అమెరికా, ట్రినిడాడ్, పనామా, కోస్టా రికా వంటి ప్రాంతాల్లో ఇవి పూస్తాయి.


స్వాండిల్డ్ బేబీస్

మరికొన్ని రకాల పూవులు బాతు ఆకారంలో పూస్తాయి. ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. ఎక్కు వగా ఆస్ట్రేలియా దేశంలో కనిపిస్తాయి.

## అమ్మాయి పెదవులు

మగువ అందం ఆమె ఎర్రెర్రని పెదాల్లోనే ఉంటుందంటారు. అందుకే దొండపండుతో పోల్చి చెబుతారు. అయితే ఇప్పుడు అమ్మాయిల పెదా లను పండుతోనే కాదు పూవుతోనూ పోల్చాలేమో! అవును ఈ పూవును చూస్తే అలా అనిపించక మానదు. ఆ పెదవుల అందాన్ని తమలో ఇముడ్చు కున్నాయి ఈ పూవులు. వీటి పేరు హ్యూకర్ లిప్స్. పేరుకు తగినట్లే ఇవి లిప్‌స్టిక్ వేసుకున్న అమ్మాయి పెదవుల్లా పూస్తాయి. అమ్మాయిలతో పాటు అబ్బా యిలను కూడా ఆకర్షిస్తున్న ఈ పూవులు మధ్య దక్షిణాఫ్రికా ప్రాంతంలో పూస్తాయి.

## పొత్తిళ్ళలో పాపాయి

అమ్మ పొత్తిళ్ళలో పడుకున్న పాపాయిని చూస్తుంటే ఎంత ముద్దొస్తుందో కదా! అచ్చం అలానే ఉంటాయి ఈ పూలు. అందుకే వాటిని 'స్వాండిల్డ్ బేబీస్' అని పిలుస్తారు. ఒక మృదువైన టవల్‌లో చుట్ట బడి ఉన్న చిన్న పాపాయిని పోలి ఈ పూల మొక్కలు ఉంటాయి. ఇవి క్రీమ్ కలర్‌లో ఉంటాయి. ఎక్కువగా కొలంబియా అడవుల్లో కనిపిస్తాయి.

## రాక్షసపూలు

ఎప్పుడైనా రాక్షస పూల గురించి విన్నారా? రాక్షస పూలు అనుకునేసరికి ఇవేవో హాని చేస్తా యనుకునేరు... వాటి ఆకారాన్ని బట్టి వాటికా పేరు వచ్చింది. ఇవి చూసేందుకు అచ్చం మనిషి పుర్రె ల్లాగానే ఉంటాయట. అందుకే వాటిని 'స్నాప్ డ్రాగన్ అండ్ ఇట్ స్కల్' (డ్రాగన్ ఫ్లవర్) అని పిలుస్తారు. మొగ్గగా ఉన్నప్పుడు సాధారణ రూపంలోనే ఉండే ఈ పూలు పూర్తిగా విచ్చుకు న్నాక ఆ రూపాన్ని పొందుతాయి. ఇవి ఎక్కు వగా మెడిటరేనియన్ ప్రాంతాల్లో పూస్తాయి. ఇదిలా ఉంటే మరో రకం పూలు అచ్చం ఏలియన్ ఆకారంలో ఉంటాయి. అందుకే వీటిని 'హ్యాపీ ఏలియన్' అని పిలుస్తారు.

### అచ్చం కోతిలా

చిన్న చిన్న కోతి పిల్లలను చూస్తే ముద్దుగా ఉంటాయి కదా! ఈపూలు కూడా అలా చూడ్డానికి ముద్దుగా అనిపిస్తాయి. ఇవి మంకీ ఆర్కిడ్‌లు! ఆ పేరు ఎందుకొచ్చింది అనుకుంటున్నారా? ఈ పూలు అచ్చం బబూన్ కోతులను పోలి ఉంటాయి. ఇవి మెరూన్, క్రీమ్, తెలుపు రంగుల్లో పూస్తాయి. ఈక్వెడార్, పెరూ వంటి ప్రాంతాల్లో ఈ పూలు కనిపిస్తాయి.

### నేక్డ్ మ్యాన్ ఆర్కిడ్

నగ్నంగా ఉన్న మానవ శరీర ఆకారాన్ని పోలి ఈ పూలు ఉంటాయి. కాబట్టి వీటిని నేక్డ్ మ్యాన్ ఆర్కిడ్ అని పిలుస్తారు. తెలుపు, పర్పుల్ రంగుల మిశ్రమంలో ఈ పూలు పూస్తాయి. మెడిటరేనియన్ ప్రాంతంలో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి.

### చిలుకల్లాంటి పూలు

కొమ్మలపై వాలే చిట్టి చిలుకలను చూస్తే బలే ముద్దొస్తుంది కదా! ఆ చిట్టి చిలుకలే కాదండీ... ఈ కొమ్మలకు పూసే చిట్టి చిలుకలను చూస్తే కూడా అంతే ముద్దొస్తాయి. వీటిని 'ప్యారట్ ఫ్లవర్స్' అంటారు. బర్మా, థాయిలాండ్, ఇండియాలలో పెరిగే ఈ మొక్కకు చెందిన పూలు అచ్చం చిలుకల్లాగే ఉంటాయి. రకరకాల రంగుల్లో ఇవి దర్శనమిస్తాయి.

> **ఆర్కిడ్ పూలంటే?**
>
> *ఆర్కిడ్ పూలు అంటే వింతైన పూలు అని అర్థం. ఆర్కిడ్ పూలు చాలా పురాతనమైనవి. దాదాపు 10కోట్ల ఏళ్ల నుంచి ఇవి భూమ్మీద ఉన్నాయి. భూమి మీద గడ్డి తర్వాత విస్తారంగా పరుచుకున్నవి ఇవే! ఆరునెలల వరకు వాడిపోకుండా ఉండే ఆర్కిడ్ పూలు సైతం ఉన్నాయట! ఆర్కిడ్‌లో అతిచిన్న ఆర్కిడ్ రెండు మిల్లీమీటర్ల పరిమాణంలో ఉంటుంది. ప్రపంచవ్యాప్తంగా దాదాపు 25వేలకు పైగా ఆర్కిడ్ జాతులతో చిత్ర విచిత్రమైన రూపాలతో ఉన్న పూలు ఉన్నాయి.*

### ఆడవారి చెప్పుల్లా

ఇందాక ఆడవారి పెదవుల్లా ఉండే పూలు గురించి చదివారు కదా! ఇప్పుడు చెప్పుకోబోయే పూలు ఆడవారు ధరించే చెప్పులను పోలి ఉంటాయి. గోధుమ రంగులో ఈ పూలు పూస్తాయి. ఎక్కువగా యూకే దేశంలో కనిపిస్తాయి.

### అమ్మాయి డ్యాన్స్ చేస్తున్నట్లు

అమ్మాయి డ్యాన్స్ చేస్తుంటే చూడ్డానికి ఎంతో బాగుంటుంది కదా! అలా అచ్చం అమ్మాయి బాలెట్ డ్యాన్స్ చేస్తున్నట్లు ఈ పూలు ఉంటాయి. అందుకే వీటిని 'బల్లెరినా ఆర్కిడ్' అంటారు. ఇవి ఎక్కువగా ఆస్ట్రేలియా దేశంలో పూస్తాయి. క్రీమ్, మెరూన్ రంగుల్లో ఈపూలు చూడటానికి కంటికింపుగా కనిపిస్తూ, చూపరులకు ఆహ్లాదాన్ని పంచుతాయి.

### అందమైన పూవులో దయ్యం

పూవులో దయ్యముండడం ఏంటి అని ఆశ్చర్యపోతున్నారా? ఆ పువ్వుకి రెండు వైపులా పదునైన కొమ్ములతోపాటు...ఎర్రగా ఉండే కళ్ళతో... చూడగానే బెదరగొట్టేలా ఉంటుంది. రకరకాల అందమైన పూలని, కనువిందు చేసే కుసుమాల్ని చూసుంటారు కానీ జడిపించే రూపంలో ఉన్న ఈ పూవు, పిశాచి ముఖం పోలికలతో ఉండే ఈ రకమైన పుష్పం ఈమధ్యే కొత్తగా వికసించింది. దీని రూపానికి తగినట్లే దీన్ని 'డెవిల్ హెడ్ ఫ్లవర్' అని పిలుస్తారు. దీని శాస్త్రీయ నామం టెలిపోగన్ డయాబొలికస్. ఎందుకా పేరు అనుకుంటున్నారా? పూర్వం జానపద కథల్లో చెప్పినట్లే దీనికి కూడా రెండు పెద్ద కొమ్ములు, ఎర్రని కళ్ళు ఉంటాయని, పూవు మధ్యభాగంలో కూడా అచ్చం అదే ఆకారంలో ఉండే వింతైన భాగం ఉంటుందని, అందుకే దీనికా పేరని అంటున్నారు. ఈ వింత పూలని పోలండ్ విశ్వవిద్యాలయానికి చెందిన కొంతమంది పరిశోధకులు దక్షిణ అమెరికాలోని కొలంబియాలో గుర్తించారు. ఈ పువ్వు చుట్టూ లేత ఎరుపు రంగులో పలుచని మూడు రేకలుంటాయి. మధ్యలో ముదురు ఎరుపురంగులో దయ్యం ముఖాన్ని పోలి ఉంటుంది. ఈ ఆర్కిడ్ మొక్క 5.5 నుంచి 9 సెంటీమీటర్ల పొడవు ఉంటుంది. మౌంటెన్ అడవిలో ఇవి ఎక్కువగా ఉంటాయి. ఇప్పటికి ఈ పూలు ఆ అడవిలో 30 వరకు ఉన్నాయట. మొదట దీన్ని చూసి, ఇదివరకే ఉన్న పూవు అనుకున్నారట! కానీ బాగా పరిశీలించి చూస్తే కొత్తరకం ఆర్కిడ్ అని తెలిసింది. ఇప్పటివరకు కొలంబియాలో 3600 జాతుల ఆర్కిడ్ పూజాతులున్నాయని కనుక్కొన్నారు.

**-విజేత**

డ్రాగన్ ఫ్లవర్

బబూన్ కోతులు

లేడీస్ స్లిప్పర్స్

హ్యాపీ ఏలియన్

ప్యారట్ ఫ్లవర్స్

బల్లెరినా ఆర్కిడ్

# తీర్పు

**శరత్‌చంద్ర**

**కుమార్ మరణించాడన్న వార్త నన్ను షాక్‌కి గురిచేసింది. నాకు తెలిసి కుమార్‌కి ఏ అనారోగ్యం లేదు. అతడి హఠాత్‌మరణంతో హుటాహుటిన బయలుదేరి వెళ్ళాను.**

**కుమార్ ప్రముఖ వైద్యుడు. తనకేమైనా ఆరోగ్య సమస్య ఉంటే పరిష్కరించుకోగలడు. నే వెళ్ళేసరికి అందరూ శోకసముద్రంలో ఉన్నారు. అతని మిత్రులందరూ పట్నంలోని ప్రముఖ వైద్యులు. అందరూ వచ్చారు.**



"మాకు తెలిసి కుమార్‌కి ఏ ఆరోగ్య సమస్యా లేదు, పైగా బ్యాడ్ హాబిట్స్ కూడా ఏమీ లేవు." అన్నారు వాళ్లు. ముందస్తు సూచనలు ఏమీ లేకుండా హార్టెటాక్ ఎలా వస్తుంది అన్నది వైద్యులందరి సందేహం. అందరూ శవంపై పూలమాలలు వేస్తూండగా సడన్‌గా ఒక అరుపు విన్పించింది. "నో.. ఇది సాధారణ మరణం కాదు.." అందరూ నివ్వెరపోయి అటువైపు చూశారు. అది అమరేంద్ర స్వరం. "ఏం మాట్లాడుతున్నావ్ నువ్వు.." అన్నట్టు చూశారు అందరూ.

"కుమార్ సార్ ముఖాన్ని పరిశీలనగా చూడండి. బాగా ఉబ్బి ఉంది. పైగా కందిపోయి ఉంది." అమరేంద్ర, కుమార్ హాస్పిటల్‌లో పని చేస్తున్న మరో యువ వైద్యుడు.

"కుమార్ ఈ మధ్య బాగా తాగుతున్నాడు. అందుకే ముఖం ఉబ్బి ఉంటుంది" ఎవరో అంటున్నారు. ఇద్దరు ముగ్గురు సీనియర్ డాక్టర్లు శవం దగ్గరకొచ్చారు. సహజసిద్ధమైన ఉత్సుకతతో చేతులు చూశారు. చేతులపైన ఎవరో గుచ్చినట్టు, పెనుగులాడినట్టు గట్టి గుర్తులున్నాయ్.

"నిజమే, చేతిపైన ఏవో గుర్తులున్నాయ్" ఎవరో ఇద్దరు నిర్ధారించారు. విశాల్ దగ్గరకొచ్చాడు.

"నేనూ నాన్నా రాత్రి ఒంటిగంటవరకూ మాట్లాడుకున్నాం. వద్దనేకొద్దీ రాత్రంతా తాగుతూనే ఉన్నాడు. బహుశా ఓవర్ డ్రింక్ నాన్న ప్రాణాలను బలికొంది." చెప్పాడు విశాల్.

కుమార్ భార్య సంధ్య కూడా వచ్చింది. విశాల్ రాత్రి ఒంటి గంటకు ఫోన్ చేశాడు.

"నాన్న పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నాడు రామ్మా.." అన్నాడు. వెళ్ళాలని నాకు తీవ్రంగా ఉన్నా... ఆయన నాకు దూరంగా జరిగి పదేళ్ళు అవుతుంది. ఇన్నాళ్ళు విడాకులను వ్యతిరేకిస్తూ ఆయన్నే భర్తగా చెప్పుకుంటూ బ్రతికా. ఆయన కోసం డైవోర్స్‌కి ఒప్పుకున్నా.

పదిరోజుల్లో కోర్టు ద్వారా శాశ్వతంగా విడిపోతాం. బంధం తెగేప్పుడు వెళ్ళడం సరైంది కాదనే ఆగిపోయాను. నేను సకాలంలో వెళ్ళి ఉంటే, నా కుమార్‌ని బ్రతికించుకునే దాన్నేమో!"

గుండెలు అవిసిపోయేలా ఏడుస్తుంది సంధ్య.

ఇద్దరు ఆడవాళ్ళు ఆమెని పక్కకు తీసుకువచ్చారు. బాంబేలో జాబ్ చేస్తున్న కుమార్ కూతురు, షామిలి "రాత్రి పది గంటలప్పుడు కూడా నాన్న నాతో మాట్లాడాడు. అన్నయ్య ఇక్కడే ఉన్నాడు, మాట్లాడమ్మా అని ఫోన్ కూడా ఇచ్చాడు. నాన్న మాటల్లో సంతోషమే ధ్వనించింది.." అంది షామిలి.

"బహుశా ఆ సంతోషం తట్టుకోలేకపోయారేమో చెల్లీ, నాన్నా! మనల్ని విడిచి వెళ్ళాడు.." అన్నాడు విశాల్. "అయ్యే ఉంటుంది.." అంటున్నారెవరో. "నాన్నా.. నాన్నా.." రోదిస్తోంది షామిలి.

"అది అంతా వాళ్ళ నాన్న పోలికే! దాని ముక్కు అచ్చు ఆయనలాగే ఉంటుంది. నన్ను కాదని నాన్న దగ్గరే ఉంటోంది.." ఏడుస్తూ అంది సంధ్య.

నాకు కుమార్ ఫ్యామిలీ గురించి అంతా తెలుసు. పదిహేనేళ్ళ క్రితం నుండే ఇద్దరి మధ్యా అగాధం మొదలైంది. బయటకు కన్పించే కారణాలు కొన్ని. అంతర్గత కారణాలేంటో తెలీదు. పిల్లల్ని ఇద్దరూ పంచుకొని వేర్వేరుగా బ్రతుకుతున్నారు. కూతురు తండ్రి దగ్గరే పెరిగింది. కొడుకు విశాల్ తల్లి దగ్గర ఉంటున్నాడు. ఇద్దరూ డాక్టర్ కోర్సు వ్యతిరేకించారు. దానికి కారణం తండ్రి డాక్టర్ కావడమే!

కుమార్‌కి రోగులే దైవం. రోజులో తొంభై శాతం సమయం రోగుల మధ్యే గడిపేవాడు.

తక్కువ ఫీజు కావడంతో ఇసకేస్తే రాలనంత మంది జనంతో హాస్పిటల్ ఎప్పుడూ కిటకిటలాడుతుండేది. కుమార్ ఇచ్చే ట్రీట్‌మెంట్ కన్నా... అతడి మాటలే వాళ్ళని ఓదారుస్తూ ఉండేవి.

"మందుల్దేముంది అన్నాయ్ ఎవరైనా ఇస్తారు. మనం చెప్పే ఆ రెండు మాటలే మనిషిని బ్రతికిస్తాయ్" అనేవాడు నాతో. కుమార్ ఆపరేషన్ చేస్తే తిరుగుండేది కాదు. సంధ్య, కుమార్‌ల మధ్య 'కోల్డ్‌వార్' నడుస్తుందని సునంద ద్వారా తెలిసి రెండు మూడు సార్లు హెచ్చరించాను.

"అందరికీ మాటలు చెప్పి ఓదార్చడం కాదురా.. ముందు నీ భార్యని ఓదార్చు." అన్నాడు నవ్వుతూ.

"డాక్టర్లందరూ పేషంట్ల కోసం కాపురం చెయ్యకుండా ఉన్నారా? భార్యని ప్రేమించకుండా ఉన్నారా?" అన్నాను. వాడు పక్కున నవ్వేసి,

"తనని ప్రేమించడం వల్లే కదా ఇద్దరు పిల్లలు పుట్టారు" అన్నాడు. మాటల్లో కాస్త వెటకారం పాళ్లు ఎక్కువ. "వెటకారం స్థానంలో మమకారం పెంచు తమ్ముడూ.." అంటూ ఉండేవాడిని. "నన్ను చూస్తేనే తను 'వికారం'గా ముఖం పెడ్తుంది అన్నాయ్.." సెటైర్ వేసేవాడు.

"నీతో మాట్లాడి గెలవడం కష్టంరా.." అని ఫోన్ పెట్టేసేవాణ్ణి.

"ఇక వచ్చే బంధువులు ఎవరూ లేరు. మీ నాన్నను అలా చూస్తూ ఉండలేను. తీసుకెళ్ళండిరా.." అంది సంధ్య. "నో.." ఎవరిదో స్వరం. తలెత్తి చూశాను. అమరేంద్ర... "ఏమైంది.." అడిగాను.

"శవాన్ని పోస్ట్‌మార్టమ్ చెయ్యనివ్వండి" అన్నాడు.

"సందేహాలతో ఖననం చేయడం మంచిది కాదు కదా..." అన్నాను. సంధ్య పెద్దగా ఏడ్చింది.

"నా దేవుణ్ణి ముక్కలు చేయకండి.." శవంపై పడింది.

నేను సునంద వైపు చూశాను. తను ఇద్దరు ఆడవాళ్ళని తీసుకొచ్చి సంధ్యని తీసుకెళ్ళింది.

నాలుగ్గంటల తర్వాత దిగ్భ్రాంతికర విషయాలు వెలుగులోకి వచ్చాయి. పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్‌లో కుమార్‌ది సహజ మరణం కాదని తేలింది. యువ డాక్టర్, కుమార్ శిష్యుడు అమరేంద్రని అభినందనగా చూశాను. "యు ఆర్ బ్రిలియంట్ బ్రదర్.." అన్నాను. అతడు నావైపు చూస్తూ..

"సార్ రోజూ 'మద్యం' తాగేది తన కాపురం కూలిపోయిందనే సార్" అన్నాడు బాధగా.

"నిజమే! బంధం నిలుపుకోవడానికి కుమార్ పెద్దగా ప్రయత్నం చేయలేదు. చేతులు కాలాక ఆకులు పట్టుకొని ఏం లాభం.." అన్నాను.

"కానీ ఏడాది నుండి మేడమ్‌ని రిక్వెస్ట్ చేస్తున్నాడు. ఈ ఒంటరితనం భరించలేకున్నాను, వచ్చెయ్ సంధ్యా అని పిలుస్తున్నాడు. నువ్వు ఆడవాళ్ళ వెంటపడి తిరిగే పిచ్చి కుక్కవురా! ఏ ఎయిడ్సో నాకు అంటగట్టాలని కుట్ర పన్ని నన్ను పిలుస్తున్నావు. నీ చావు నువ్వు చావు. ముందు ఆస్తి నా పిల్లల పేరు మీద రాసివ్వు, అనేదంట సార్ బాధపడుతూ రెండు మూడు సార్లు చెప్పాడు.

అమరేంద్రా.. సంధ్యకి నేను అవసరం లేదు. నా ఆస్తి మాత్రం కావాలి. నేను బ్రతికి ఉండగా ఆస్తి తనకి రాసివ్వనని కోపంగా అనేవాడు.



నాకు తెలిసినంత వరకూ సార్ పదేళ్ళు డైవోర్స్ కోరింది నిజమే కానీ.. ఈ ఏడాదిలో డైవోర్స్‌కి ఒత్తిడి చేసింది మేడమే! చనిపోయిన రోజు రాత్రి సార్ నాకు ఫోన్ చేశాడు. 'అమరేంద్రా! నారక్తం... నా విశాల్‌ని 'నన్ను చూడాలని ఉంది నాన్నా' అని వచ్చాడు. నా మనసు ఎంతో తృప్తిగా ఉందయ్యా అన్నారు. నేను కూడా చాలా సంతోషపడ్డాను." చెప్పాడు అమరేంద్ర. నా భృకుటి ముడిపడింది.

నా ముఖంలో భావాలు బయటపడకుండా హైదరాబాద్‌లోని ఒక పోలీస్ మిత్రుడి ద్వారా జిల్లా ఎస్‌పీకి కాల్ చేయించాను. ఇరవై నాలుగ్గంటల్లో నిజానిజాలు బయటపడ్డాయి. కొద్ది గంటల ముందు.. విశాల్ ఫోన్ చేశాడు.

"అంకుల్.. పోలీసులు నన్ను కూడా విచారించాలంటున్నారు.."

"వెళ్ళిరా విశాల్.." చెప్పాను. అతడి స్వరంలో చెమట ఎందుకో అర్థమైంది.

•••

"జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఆ పిల్లాడినైనా కాపాడివుంటే బావుండేది.." అంది సునంద.

నేను నిర్వికారంగా నవ్వి "చట్టం తన పని



## సైజ్ తగ్గలేదటగా?

**టాలీవుడ్** స్వీటీ అనుష్క 'సైజ్ జీరో' కోసం పెరిగిన బరువు ఇంచ్ కూడా తగ్గలేదన్న విషయం 'సింగం 3' ప్రోమోలో స్పష్టమైపోయింది. బరువు తగ్గేందుకే 'బాహుబలి 2' షూటింగ్‌లో కూడా పాల్గొనకుండా లేట్ చేసింది. అయినా ఫలితం లేకుండా పోయినట్టుంది అంటున్నారు సినీ జనాలు. ఈ సినిమాలోనే ఇలా ఉంటే 'బాహుబలి 2' ఎలా ఉంటుందో అన్న అనుమానం అందరికీ వస్తోంది. ఈ సినిమా టీజర్ విడుదలైతే తప్ప ఈ టెన్షన్‌కి తెర పడదు అంటున్నారు అనుష్క అభిమానులు.

తాను చేసుకుపోతోంది సుననదా." అన్నాడు. మళ్ళీ తనే "సంధ్య ఇంతపని చేస్తుందని అనుకోలేదు.." అంది.

"సంధ్యే కాదు సంధ్య ప్లేసులో నువ్వున్నా అదే చేస్తావ్" అన్నాను. బిత్తరపోయి చూసింది సునంద.

"ఏంటి.. మీరనేది.." గొణిగింది.

"జీవితం ఎవరికీ వడ్డించిన విస్తరి కాదు.." అన్నాను.

"మీ మెట్ట వేదాంతం వినలేక నేను కూడా మిమ్మల్ని చంపేస్తానేమో.." అంది కోపంగా నా పీక పట్టుకొని. "చంపేయ్! భార్య చేతిలో చనిపోవడం కంటే మగాడికి ఆనందం ఏముంది?" అన్నాను నవ్వుతూ. "సర్లే అమంగళాలు ఆపండి.." అని తన మంగళసూత్రాలు కళ్ళకు అద్దుకుంది. "ఆడవాళ్ళకు మొగుడికంటే మంగళసూత్రాలు ముఖ్యం" అన్నాను నవ్వుతూ.

"సర్లే.. పోతూ పోతూ మీ తమ్ముడు ఆ వెటకారాన్ని మీకు అంటించి పోయినట్టున్నాడు" అంది.

"సర్లే నిద్రపో.. నాకు కాస్త రాసుకునే పనుంది" అన్నాను.

"ఏంటి, మీ తమ్ముడి మరణాన్ని కూడా కథగా రాస్తున్నారా?" అంది. "ఏమో తెలీదు.." అన్నాను.

"సస్పెన్స్ మెయింటైన్ చెయ్యడంలో ఎవరైనా మీ వెనుకే.." అంది.

●●●

సంధ్యని కలవడానికి జైలుకి వెళ్ళాను.

కలవడానికి నిరాకరించింది. మూడోసారి ప్రయత్నం తర్వాత కలిసింది.

"నన్ను కలవడానికి అభ్యంతరం ఏంటి? మీ ఇద్దరికీ నేను శ్రేయోభిలాషినే కదా.." అన్నాను.

అదే నిజమైతే పోస్ట్‌మార్టమ్ జరగకుండా చూసేవాళ్ళు." అంది.

"అప్పుడు నేను కూడా పక్క జైల్లో ఉండేవాడిని.." అన్నాను.

ఒకసారి నావైపు తేరిపారా చూసి.. "ఎందుకొచ్చారు?" అన్నట్టు చూసింది.

"పద్నాలుగేళ్ళు కుమార్‌కి విడాకులివ్వకుండా వాయిదా వేసి సతాయించావు. ఏడాది నుండి వాడు కలిసి బ్రతుకుదాం అని కోరాడు. ఎందుకు నిరాకరించావ్?" అడిగాను.

సంధ్య వెంటనే సమాధానం చెప్పలేదు. 'తెలుసుకొని ఏం చేస్తారు?' అన్నట్టు చూసింది.

కాసేపు మాట్లాడలేదు. "మరి బయల్దేరనా.." అడిగాను.

"మళ్ళీ రారా బావగారూ" అడిగింది దిగులుగా. ఈసారి తన కళ్లలో నీళ్లు! "వస్తాను" ముక్తసరిగా అన్నాను. "నాకు బెయిల్ రాకపోయినా పర్వాలేదు. విశాల్‌ని కాపాడండి" అంది.

నాకు దుఃఖం ఆగలేదు. వాడి లేతముఖం గుర్తుకొచ్చింది.

"ఇందులో వాడి తప్పేం లేదు. వాణ్ణి నేనే అలా మౌల్డ్ చేశాను." అంది.

"ఎందుకు.. ప్రకాష్ కోసమా?" అడిగాను. సంధ్య ముఖం అదిరిపోయింది.

"నీకూ ప్రకాష్‌కీ ఉన్న 'బంధం' గురించి అందరికీ తెలుసు. అతడితోనే సెటిలవ్వక, ఎందుకు ఈ దుర్మార్గానికి ఒడిగట్టావు?" అడిగాను.

సంధ్య వెంటనే ఏమీ మాట్లాడలేదు. నేను రెట్టించి అడుగుతానని అర్థమై...

"ఎందుకంటే నేను కుమార్‌ని ప్రేమించాను. అతడు నన్ను తప్ప అందర్నీ ప్రేమించాడు, వృత్తితోసహా..." అంది.

"మరి తను నిన్ను రమ్మన్నాడు కదా...?" అడిగాను.

"పద్నాలుగేళ్ళు, ప్రకాష్ నన్ను కంటికి రెప్పలా కాపాడాడు. ఎప్పుడూ నన్ను తాకలేదు. ఎందుకు నాకు ఇంత అండగా నిలిచావని అడిగాను. "నిన్ను ప్రేమిస్తున్నానని.." అన్నాడు. నాకిక మాట రాలేదు. ప్రేమకోసం పరితపిస్తూ ఒంటరి పోరాటం చేసిన నేను అతడి ప్రేమకు దాసోహమైపోయాను. కుమార్‌కి నాతో అవసరం ఉంది. అది ఎలాంటిదైనా కావచ్చు. ప్రకాష్‌కి ప్రేమ ఉంది. నేను కుమార్ దగ్గరకి వెళ్ళిపోతానేమోనన్న అభద్రతా భావంతో ప్రకాష్ నన్ను పక్కదారి పట్టించాడు. కుమార్‌కి ఇక భూమిమీద బ్రతికే అర్హత లేదు. అలా చేస్తేనే నీకూ, నీ బిడ్డకూ ఆస్తి వస్తుందని.. నమ్మించాడు. విశాల్‌కి చెబితే ముందు అదిరిపడ్డాడు.

"ఆయన ఉన్నాలేనట్టే కదరా! ఆస్తి తీసుకొని విదేశాలకు వెళ్ళి సెటిలై, హాయిగా జీవించు! నేను ప్రకాష్ గారి నీడలో బ్రతికేస్తాను అన్నాను. పైగా అప్పటికే కుమార్ తన ఆస్తినంతా, తాను అక్రమ సంబంధాలు పెంచుకున్న వాళ్ళకి ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడన్న సమాచారం అందుతూనే ఉంది. పథకం ప్రకారం నన్ను అడ్డు తొలగించుకుంటాడని కూడా ప్రకాష్ గట్టిగా చెప్పాడు. అతడి వాదనలో 'నిజం' కన్పించింది నాకు. పద్నాలుగేళ్ళు మానసిక హింస పెట్టిన మనిషి.. ఇప్పుడు చూసుకుంటాడన్న నమ్మకం కూడా లేదు. నా ప్రాణాలు పోయినా పర్వాలేదు. అతగాడి ఆస్తి నా బిడ్డలకు దక్కాలనే కృత నిశ్చయంతో ఈ అఘాయిత్యానికి ఒడిగట్టాను. వీలైతే వాణ్ణి కాపాడండి బావగారూ..." అంది.

నేను భారంగా నిట్టూర్చి "గాడ్ బ్లెస్ యూ!" అని ముందుకు వచ్చాను.

●●●

"ఇప్పుడేం చేద్దామనుకుంటున్నారు?" అడిగింది సునంద.

"కథ రాయాలనుకుంటున్నాను.." చెప్పాను.

"అది మీరు ఎప్పుడూ చేసేదే కదా! పాపం పసివాడు విశాల్‌ని ఏమైనా కాపాడగలరా!" అడిగింది.

"చట్టం ముందు అందరూ సమానమే..." అన్నాను. నన్ను రుసరుస చూస్తూ..

"ఈ చచ్చు.. పుచ్చు మాటలు ఆపి కార్యాచరణ ఏమైనా ఉంటే చూడండి. పాపం సంధ్య..." అంది.

"నీ వాలకం చూస్తే మొగుళ్ళని చంపడాన్ని సమర్థించేలా ఉన్నావే!" అన్నాను.

"అటువంటి వెధవల్ని చంపితే మాత్రం నష్టమేమిటి లెండి.. విడాకులు ఇవ్వమని అతగాడు పద్నాలుగేళ్ళు సతాయించాడు.." అంది.

**అతడో పేరుమోసిన డాక్టర్. పేషంట్లతోనే ఎక్కువ సమయం గడుపుతుంటాడు. భార్యని నిర్లక్ష్యం చేశాడు. ఆమె తన స్పేస్‌లోకి రాకూడదని తలుపులు వేశాడు. జొరబడాలని ఆమె చేసిన ప్రయత్నాలన్నీ బెడిసికొట్టాయి. పెరిగే దూరాన్ని తగ్గించుకోవాలని ప్రయత్నించకపోగా, అనుమానాలూ, అపార్థాలూ పెరిగాయి. ఇద్దరూ వేరుపడి ఎవరి జీవితం వారిదన్నట్టుగా బతకసాగారు. ఇంతలో అనుకోని దుర్ఘటన జరిగింది. ఏమిటది?**

"నీతో జాగ్రత్తగా ఉండాలి.." అంటూ ఉంటే నా పీకలమీద వరకూ చేయి తెచ్చింది.

"సర్లే.. నీ ఘోష ఆపు. సమాజంలో ఇటువంటి మరణాలు, హత్యలు జరగకుండా మంచి కథ రాస్తా.." అని 'ప్యాడ్' చేతికి తీసుకున్నాను.

"మీ రచన పిచ్చి తగలెయ్య" అని వంటగదిలోకి వెళ్తుంటే... "సునూ.. ఒక కాఫీ.." అన్నాను.

"అదొక్కటే తక్కువ.." అంది నసుగుతూ. పాతికేళ్ళ మా జీవన సహచర్యంలో ఈ రుసరుసలు అలవాటే. పదినిమిషాల వ్యవధిలో నురగలు కక్కే

కాఫీ తెచ్చింది సునంద.

"మై స్వీట్ హార్ట్.." అని మెచ్చుకున్నా.

"ఎన్ని సేవలు చేస్తే మాత్రం ఏముందిలెండి.. శ్లేష్మంలో 'ఈగలా మమ్మల్ని తీసివేస్తూ ఉంటారు." అని వాషింగ్ మెషీన్ దగ్గరకు వెళ్ళింది.

ప్యాడ్ ముందు పెట్టుకొని కూర్చున్నాను. కలం కదల్లేదు. దుఃఖం ముంచుకు వస్తోంది.

వివాహ వ్యవస్థ ఎటు వెళ్తోంది? తండ్రీబిడ్డల అనుబంధం ఏంటి? కన్నబిడ్డల్ని చంపే తండ్రులు.. కన్నతండ్రిని చంపే బిడ్డలు..

ఎక్కణ్ణించి ఎక్కడి వరకూ వెళ్తున్నాం? ఆదిమ సమాజంలో ఇటువంటి దుర్మార్గాలు జరిగాయో లేదో కానీ, నాగరిక సమాజంలో ఇలాంటివి ఎందుకు జరుగుతున్నాయి?

ప్రేమరాహిత్యంలో మనిషి సతమతమై పోతున్నాడా? కుమార్ విషయం దగ్గరకు వచ్చి ఆగాను. సంధ్యతో బంధాన్ని నిలుపుకోవాలన్న తపన కంటే విడిపోవడానికే ఎక్కువ తాపత్రయపడ్డాడు. అతడి జీవితమంతా ఆమె ఉండాలని అతడు కోరుకోలేదు. తన 'స్పేస్'లోకి రాకూడదని తలుపులు వేశాడు. జొరబడాలని సంధ్య చేసిన ప్రయత్నాలన్నీ బెడిసికొట్టాయి. పెరిగే దూరాన్ని తగ్గించుకోవాలని ఎవరూ ప్రయత్నించలేదు. హక్కు కోసం ఒకరూ... భరించలేనని మరొకరూ పెనుగులాడారు. ఒకర్నొకరు అర్థం చేసుకోవడానికి బదులు అపార్థాలు పెరిగాయి. ఓవర్ పొసెసివ్‌నెస్‌తో సంధ్య, కుమార్ ప్రతి కదలికనీ అనుమానించింది. వీలు చిక్కినప్పుడల్లా అవమానించింది. ఆ ఉక్కపోతలో కుమార్ తాత్కాలిక బంధాలవైపు మొగ్గు చూపాడు. అవి అక్రమసంబంధాలకు దారి తీశాయి. సంధ్యలో పేరుకుపోయిన కసి ఒక్కరోజుది కాదు, పద్నాలుగేళ్ళది! తనని నిర్లక్ష్యం చేస్తున్నాడన్న 'వ్యధ' క్రూరంగా మారింది. అందులో భాగంగానే ఈ దురాఘతానికి ఒడిగట్టింది. ఆమె ఒంటరితనాన్ని ప్రకాష్ లాంటివాళ్ళు ప్రేమ అనే ముసుగు వేసుకొని 'క్యాష్' చేసుకోవాలనుకున్నారు. నిజానికి ప్రకాష్‌ని 'టెంప్ట్' చేసింది సంధ్య కాదు, కుమార్ ఆస్తి! పిచ్చి సంధ్య అతడి పథకాన్ని ప్రేమనుకుంది. 'నమ్మింది'. నమ్మితేనే మోసం చెయ్యడం సులువని ప్రకాష్‌కి తెలుసు. పోలీస్ దెబ్బలకి ప్రకాష్ నిజం కక్కాడు. నేను ఆ విషయం సంధ్యకి చెప్పలేదు. ఎక్కడో ఒక దగ్గర ప్రేమించే హృదయం ఉందన్న 'భ్రమ'లో ఆమెని బ్రతకనివ్వాలని 'మౌనం' వహించాను. అగ్నిచుట్టూ తిరిగి, అగ్నిసాక్షిగా పెళ్ళాడేప్పుడు ఇద్దరూ తెలుసుకోవాల్సిన నిజం ఒకటుంది. ప్రేమనే అగ్నికీలలు ఆరిపోకుండా కాపాడుకోవాల్సిన బాధ్యత ఇద్దరికీ ఉంది. భార్యకు 'స్పేస్' ఇవ్వలేనప్పుడు కుమార్ లాంటి వాళ్ళు వైవాహిక బంధానికి దూరంగా ఉండాలి.

ఇవన్నీ చెప్పడానికి స్కూళ్ళు, కాలేజీలు ఏమీ ఉండవు. ఎవరికివాళ్ళు తెలుసుకోవాల్సిన జీవిత సత్యాలు. ఆరోజు సాయంత్రం అమరేంద్ర ఫోన్ చేశాడు. "నేను పొరపాటు చేశానేమో సార్.." అన్నాడు. "అలా ఎందుకు అనుకుంటున్నావ్ అమర్..." అడిగాను.

"సార్‌ది సహజమరణం కాదు అనుకున్నాను కానీ.. ఈ మరణం వెనుక ఆయన కుటుంబం ఉంటుందని ఊహించలేకపోయాను. కుటుంబం మొత్తం కుప్పకూలిపోయింది. ఆ ఇంటికి అండగా ఉండదల్చుకున్నాను. షామిలిని పెళ్ళి చేసుకోదల్చుకున్నాను.." అన్నాడు.

నేను "అవునూ... కాదూ" అని చెప్పలేదు. "ఆల్ ది బెస్ట్" చెప్పాను.

●●●

నన్ను చూసి విశాల్ తలదించుకున్నాడు.

'తప్పు చేశాను అంకుల్" అన్నాడు. పశ్చాత్తాపం అతడి స్వరంలో స్పష్టంగా కన్పించింది.

జీవితం ఇక ముగిసిపోయిందన్న భావోద్వేగం వాడిలో స్పష్టంగా కన్పించింది.

నెల తర్వాత జైలులో ఉన్న విశాల్‌ని కలవడానికి మరోసారి వెళ్ళాను.

"నాన్న ఉన్నా లేనట్టే కదా.. అన్న అమ్మ మాటలు... నిజమే కదా అన్పించాయి. నాన్నకు దూరంగా బ్రతుకుతూ అమ్మ కార్చిన కన్నీళ్ళు నాకు ఎప్పటికీ గుర్తుకు వస్తూ ఉంటాయి. నీళ్ళ

## మనమీదేనర్రోయ్!

సరసి





నిండిన కళ్ళతో అమ్మ నన్ను హత్తుకోవడం నాకె ప్పటికీ గుర్తే!

"నేను నిన్ను చూడాలనుకుంటున్నాను నాన్నా." అన్నప్పుడు నాన్న స్వరంలో ఒక భావోద్వేగం...

"నిజంగానారా.." అన్నాడు. ఇక ఆ రోజు ఓపీకి వెళ్ళలేదు. పేషంట్లనెవరినీ చూడలేదు. నాతోనే కబుర్లు... 'ఈ మాత్రం సమయం అమ్మకు ఎందుకు కేటాయించలేకపోయావు నాన్నా' అని నా మనసు పదే పదే నాన్న సమక్షంలో ఘోషించింది. ఆ రాత్రి ఒంటిగంట సమయంలో అమ్మకు కాల్ చేస్తే.. ప్రకాష్ అంకుల్‌తో కలిసివచ్చింది. నేను కాళ్ళు పట్టుకున్నాను. నాన్నని గుండెల్లో దాచుకో వాల్సిన అమ్మ ఆయన గుండెలపై కూర్చుంది. ప్రకాష్ అంకుల్ నాన్న ముఖంపై దిండు అదిమిపెట్టి, ఊపిరి పోయేదాకా వత్తాడు. 'కోడిపిల్ల'లా నాన్న కాళ్ళు గిలగిలలాడి ఆగిపోయాయి. "కంగ్రాట్స్ విశాల్! రేపట్నించీ నువ్వే మీ నాన్న ఆస్తికి ఏకైక వారసుడివి, కోటీశ్వరుడివి!" అన్నాడు. ఆ నిమిషం ఆనందం అన్పించినా, ఎక్కడో బాధ సుడులు తిరిగింది. జన్మనిచ్చిన తండ్రిని చంపుకోవడం కన్నా దుర్మార్గం మరేముంది?" ఇక విశాల్ మాట్లాడలేదు.

కాసేపటి తర్వాత, "అప్రూవర్‌గా మారావు కాబట్టి కోర్టు కొంత శిక్ష తగ్గించే అవకాశం ఉంది. పైగా నీ వయస్సును దృష్టిలో పెట్టుకొని.." అన్నాను. నిర్వేదంగా చూశాడు విశాల్.

"అంకుల్, చెల్లాయిని ఒకసారి చూడాలని ఉంది" అన్నాడు. షామిలి అన్నయ్యని చూడ్డానికి ఒక్కసారి కూడా రాలేదని అర్థమైంది. కుమార్ మా పెదనాన్న కొడుకు. చిన్న వయసు నుండీ చదువులో చురుగ్గా ఉండేవాడు. మెడిసిన్‌లో కూడా స్టేట్‌ర్యాంక్ సాధించాడు. రోగుల పట్ల దయగా ఉండేవాడు. చేయి తిరిగిన డాక్టర్ కావ టంతో డబ్బు కూడా ఇబ్బడిముబ్బడిగా పేరు కుంది. స్వచ్ఛంద సేవా కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవాడు. ఆ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనే సంధ్య, అతడంటే ఆరాధనా భావం పెరిగి పెళ్ళికి ప్రపోజ్ చేసింది. పెళ్ళి తన జీవనశైలికి పడదని కుమార్ చెప్పినా సంధ్య వినలేదు. కుమార్ మన సులో తనది సెకండ్ ప్రయారిటీ అని తెలిశాక ఆమె హృదయం భగ్నమంది. "మనం కలిసి బ్రత కలేం" అని నిర్ధారించి సంధ్యని పుట్టింటికి పంపే శాడు కుమార్. మూడేళ్ళ దాంపత్యంలో పుట్టిన ఇద్దరు బిడ్డల్ని చెరొకరుగా పంచుకున్నారు. షామిలి ఊహ తెలిసినప్పట్నించి ఎక్కువగా హాస్టల్లోనే పెరిగింది. తండ్రి అంటే ఆ పిల్లకి వల్లమాలిన ప్రేమ ఉండేది. 'విడాకులివ్వనని' సంధ్య మొండి పట్టు పట్టడంతో, చనిపోయే ముందువరకూ ఆ కేసు కోర్టులో నానుతూనే ఉంది. తన దగ్గర పని చేసే డైవర్సీ సునీతతో కుమార్ సన్నిహితంగా ఉండేవాడు.

"తన మాటలు... ఆత్మీయత.. నాకు ఓదార్పుగా ఉంటాయి అన్నయ్యా" అనేవాడు. సంధ్య డైవోర్స్ ఇస్తే సునీతని పెళ్ళి చేసుకుంటాననేవాడు.

అలాంటి పొరపాటు చేయవద్దని హెచ్చరిస్తూ ఉండేవాడిని. కుమార్ ఆస్తి అంతా సునీతకి ఇచ్చే స్తాడని పథకం ప్రకారం నూరిపోశాడు ప్రకాష్. కాలచక్రం గిర్రున తిరిగింది.

'తప్పు చేసినట్టు' అందరూ ఒప్పుకోవడంతో కోర్టు 'తీర్పు'కు రంగం సిద్ధమైంది. అందరూ ఉత్కంఠతో ఎదురుచూస్తున్న క్షణాల్లో.. తెల్లవారు జామున సునంద.. నన్ను తట్టి లేపింది. నేను కళ్ళు నులుముకుంటూ లేచాను. సునంద చెప్పిన



విషయం విని నా మత్తు వదిలింది. 'షాక్'కి లోనయ్యాను. తప్పును ఒప్పుకున్నారు కాబట్టి తక్కువ సంవత్సరాలే శిక్ష పడుతుందని ఎదురు చూస్తున్న నాకు, మా ఆవిడ నన్ను లేపి చెప్పిన విషయంతో మతిపోయింది.

•••

సంధ్య అంత్యక్రియలు పూర్తయ్యాక....

ఆరోజు విశాల్‌ని చూడ్డానికి నేనూ, షామిలి, అమరేంద్ర వెళ్ళాం. అంత్యక్రియల సమయంలో తల్లికి తలకొరివి పెట్టడానికి విశాల్ రాలేదు... నిరాకరించాడు.

"తన ఆత్మ శాంతించకున్నా పర్వాలేదు నాకు.." అన్నాడు విశాల్.

షామిలియే తల్లి అంత్యక్రియలు దగ్గరుండి పూర్తి చేసింది.

ఆత్మహత్య చేసుకునే ముందురోజు, ఎలా సంపాదించిందో పెన్నూ పేపర్ సంపాదించి.... సంధ్య రాసిన ఆఖరి లేఖను, జైలర్ కోర్టుకు జమ చేస్తూ, 'జిరాక్స్' కాపీ ఒకదాన్ని నాకు ఇచ్చాడు.

"వివాహ వ్యవస్థ మనుషుల్ని కట్టి ఉంచలేక పోతోంది. మహాకవి ఆత్రేయగారన్నట్టు మనసే మనిషికి తీరని శిక్ష! కుమార్ అంటే నాకు పిచ్చి. అతడి ధ్యాస తప్ప.. నా మనసుకి మరో ధ్యాస లేదు. అతడికి నా మీద ధ్యాస లేదు. ఆయన్ని పెళ్ళి చేసుకోవడం నా జీవితంలో చేసిన పెద్ద తప్పు. మళ్ళీ దిద్దుకోలేనంత తప్పు. ఆ తప్పు ఎలా దిద్దు కోవాలో తెలీక మరో తప్పు చేశాను. ప్రకాష్ లాంటి గోముఖవ్యాఘ్రాన్ని నమ్మి కుమార్ ఆయుష్షు తీశాను.

నిజానికి కుమార్ నీతో జీవించలేనని కుండ బద్దలు కొట్టి విడాకులు కోరుకున్నప్పుడే, అతడి ముఖాన డైవోర్స్ పేపర్లు పడేసి నా బ్రతుకు నేను బ్రతకక, సగటు ఆడపిల్లలా వెంపర్లాడి...అతడిలో మార్పుకోసం ఎదురు చూశాను. ఇప్పుడు నాకు అన్పించిందీ, సమాజానికి ఈ ఆఖరి క్షణాల్లో చెప్పదల్చుకున్నదీ ఒక్కటే.

'వివాహం మాత్రమే స్త్రీకి జీవితం కాదు. మనం చేయడానికి, ప్రేమించడానికి ఎన్నో అవ కాశాలున్నాయి. కుమార్ రోగుల్ని ప్రేమించాడు. అదే దారిలో నేనూ ఏవో సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకుంటూ, మనుగడ సాగించి ఉంటే ఈ వైరాగ్యం.. వేదనా ఉండేవి కావు. మన మతాలు, పెద్దలు, మత గ్రంథాలు ఆడపిల్లకు ఊహ తెలిసి నప్పట్నించీ నూరిపోసేది ఒక్కటే... 'పెళ్ళి' ఆడ పిల్లకి జీవితం, సర్వస్వం అని! ఇక చాలించండి ఆ ఊకదంపుడు ఉపన్యాసాలు.. భర్తని వదిలేసిన స్త్రీలని, భర్త చనిపోయిన స్త్రీలని అవమానిం చడం మానుకోండి. 'భర్త వదిలేసిన ఆడదని' సమాజం నన్ను ఆడిపోసుకుంటుందనే నేను కుమార్‌తో 'బంధం' కోసం తపించాను. సమాజం మారాలి. ఆడపిల్లని చూసే దృక్పథం మారాలి. ఒంటరి ఆడదాన్ని అదోలా చూసే చూపులు మారాలి. హీనంగా చూసే దృక్పథం మారాలి. శల్య పరీక్ష చేసే దుర్గతి పోవాలి. శీలంతో బ్రతకాలని ఏ ఆడ పిల్లకి అయినా ఉంటుంది. శీలాన్ని అంగట్లో సరు కుగా మార్చుకోవాలని ఎవరికీ ఉండదు. ఒంటరి ఆడవాళ్ళు దొరికితే చాలు, ఒక కర్చీఫ్ వేసి చూద్దాం అనే 'కుక్కబుద్ధి' మగజాతిలో పోవాలి. ఏం రాస్తున్నానో తెలీదు. నా బాధ.. నా భాషని ఎటు తీసుకెళ్తుందో కూడా తెలీదు. రేపు తీర్పు చెప్పే న్యాయమూర్తికి ఆఖరిగా ఒక విజ్ఞప్తి. నా భర్తని చంపిన ఉదంతంలో నా బిడ్డ నిర్దోషి. అమ్మ మాట కాదనలేకే వాడు సహకరించాడు.

నా ఆయుష్షుకూడా వాడికి పోసి శిక్ష రద్దు చేయండి. కనీసం తగ్గించండి. ఎవరికీ ఏమీ కాలేని సంధ్య.."

•••

రాత్రి నిద్రపట్టక దొర్లాడుతున్న నన్ను మా ఆవిడ కదిపి "సంధ్య ఉత్తరం గుర్తుకొస్తుంది కదూ, మీకు..." అడిగింది. మళ్ళీ 'అవునూ కాదన్నట్టు' తలూపాను. "తప్పెవరిది?" అడిగింది.

మొదటిసారి ఏం చెప్పాలో తెలీక తడబడ్డాను.

*సెల్: 98492 41286*

# వంటలు



## ఉసిరి రైస్

**కావలసిన పదార్థాలు:** బియ్యం- అరకప్పు, ఉసిరికాయలు- 10, పసుపు- అర స్పూను, ఇంగువ- చిటికెడు, ఉప్పు- రుచికి తగినంత, నూనె- తగినంత, నువ్వుల పొడి- రెండు చెంచాలు, జీడిపప్పు- 4, ఎండుమిర్చి- 4(మధ్యకు కట్ చేసుకోవాలి), పచ్చిమిర్చి- 4 (మధ్యకు కట్ చేసుకోవాలి), కరివేపాకు- రెండు రెమ్మలు, కొత్తిమీర కట్ట- ఒకటి, శనగపప్పు- ఒక స్పూను, మినపప్పు- ఒక స్పూను, ఆవాలు- ఒక స్పూన్.

**తయారీ విధానం:**

ముందుగా అన్నం వండుకుని బౌల్‌లో ఆరబెట్టాలి. ఉసిరికాయలను చిన్న ముక్కలుగా తరిగి అందులో ఉప్పు వేసి, వాటిని కచ్చా పచ్చాగా దంచాలి. లేదా పెద్ద ఉసిరికాయలైతే తురుముకోవచ్చు. తర్వాత, పాన్‌లో నూనె వేసి కాగిన తరువాత అందులో పసుపు, ఎండుమిర్చి, శనగపప్పు, మినపప్పు, ఆవాలు వేసి రెండు నిమిషాలు వేయించాలి. తర్వాత అందులోనే పచ్చిమిర్చి, నువ్వులపొడి, కరివేపాకు, జీడిపప్పు, దంచిన లేదా తురిమిన ఉసిరికాయ ముక్కలు, ఇంగువ వేసి దోరగా వేయించాలి. రెండు మూడు నిమిషాలు మీడియం మంట మీద వేయించుకొని, తర్వాత స్టవ్ ఆఫ్ చేసి, కొద్దిసేపు ఆరబెట్టుకోవాలి. చల్లారిన తర్వాత అన్నంలో కలుపుకోవాలి. అంతే, ఆమ్లా రైస్ రెడీ టు ఈట్!

## ఉసిరి జామ్

**కావలసిన పదార్థాలు:** ఉసిరి తురుము - ఒక కప్పు, నీళ్ళు - పావు కప్పు, పంచదార - ఒకటిన్నర కప్పు, యాలకుల పొడి - అర టీ స్పూను, దాల్చిన చెక్క- అంగుళం ముక్క.

**తయారీ విధానం:** దళసరి అడుగున్న పాత్రలో ఉసిరి తురుము, పంచదార, నీళ్ళు తీసుకొని, పంచదార కరిగేవరకు ఉడికించాలి. లేత తీగపాకం వచ్చే ముందు మంట తగ్గించి యాలకుల పొడి, దాల్చిన చెక్క వేసి మరో మూడు నిమిషాలు ఉంచాలి. తర్వాత పాత్రను దించేయాలి.

మిశ్రమం చల్లారిన తర్వాత దాల్చిన చెక్క తీసేసి, గాజు సీసాలో పోసి ఫ్రిజ్‌లో పెట్టాలి. బ్రెడ్‌పైనే కాకుండా, పరగడుపున అర టీ స్పూను చొప్పున లేహ్యంగా తీసుకున్నా కూడా ఆరోగ్య రీత్యా మంచిది.



## ఉసిరి బజ్జీలు

**కావలసిన పదార్థాలు:** బంగాళాదుంపలు - నాలుగు, పచ్చిమిర్చి - ఐదు, నూనె - రెండు కప్పులు, ఉసిరి తురుము - నాలుగు కప్పులు, ఉప్పు - తగినంత, కరివేపాకు రెబ్బలు - రెండు, శనగపిండి - కప్పు, బియ్యప్పిండి - పావుకప్పు, జీలకర్ర - రెండు చెంచాలు, వాము - రెండు చెంచాలు, కారం - కొద్దిగా, వంటసోడా- అరచెంచా, ఆవాలు- చెంచా.

**తయారీ పద్ధతి:** ముందుగా బంగాళాదుంపల్ని ఉడికించి, పొట్టు తీసి పెట్టుకోవాలి. బాణలిలో రెండు చెంచాల నూనె వేడిచేసి ఆవాలూ, జీలకర్రా వేయించుకోవాలి. తరువాత పచ్చిమిర్చి ముక్కలూ, కరివేపాకు రెబ్బలూ వేసుకోవాలి. అవి వేగాక ఉసిరి తురుము వేయాలి. రెండు నిమిషాల తరువాత తగినంత ఉప్పూ, బంగాళాదుంపల ముద్దా వేసి బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని బుల్లెట్ ఆకృతిలో చేసుకుని పెట్టుకోవాలి. ఓ గిన్నెలో శనగపిండీ, బియ్యప్పిండీ, వంటసోడా, వాము, కారం, కొద్దిగా ఉప్పూ వేసి, నీళ్ళతో బజ్జీల పిండిలా కలుపుకోవాలి. ఉసిరి బుల్లెట్లను ఈ పిండిలో ముంచి కాగుతున్న నూనెలో వేసుకుంటే సరి... నోరూరించే ఉసిరి బజ్జీలు సిద్ధం.

## ఉసిరి షర్బత్

**కావలసిన పదార్థాలు:** ఉసిరికాయలు-15, చక్కెర- నాలుగు చెంచాలు, నిమ్మకాయ - ఒకటి, పుదీనా ఆకులు, తులసి ఆకులు- నాలుగు చొప్పున, ఉప్పు - చిటికెడు

**తయారీ పద్ధతి:** ఉసిరికాయల్ని ముక్కల్లా కోసి మిక్సీ జార్‌లోకి తీసుకుని పొడి పొడిగా అయ్యేవరకూ రుబ్బి పెట్టుకోవాలి. ఒక గిన్నెలో మూడు గ్లాసుల నీళ్ళు పోసి, అందులో ఉసిరి మిశ్రమం వేయాలి. ఈ నీటిని పొయ్యి మీద పెడితే కాసేపటికి ఉసిరి రసం కిందకు దిగుతుంది. అప్పుడు దింపేయాలి. తరువాత వడకట్టి అందులో చక్కెర వేసి కలిపి చల్లారనివ్వాలి. అందులో ఉప్పూ, నిమ్మరసం పిండి, తరిగిన తులసి, పుదీనా ఆకులు వేసుకుని గ్లాసుల్లోకి తీసుకోవచ్చు. దీన్ని ఫ్రిజ్‌లో నిల్వ చేసుకోవచ్చు.



## ఉసిరి పప్పు



**కావలసిన పదార్థాలు:** ఉసిరికాయలు- 6 (ముక్కలుగా తరగాలి), కందిపప్పు- కప్పు, నూనె- 4 టీ స్పూన్లు, పసుపు- చిటికెడు, ఇంగువ- చిటికెడు, ఎండుమిర్చి- 6, పచ్చిమిర్చి - 4, కరివేపాకు- 2 రెమ్మలు, పోపుగింజలు- 3 టీ స్పూన్లు, ఉల్లిపాయ - 1

**తయారీ విధానం:**

ముందుగా పప్పు, ఉసిరికాయ ముక్కలు విడివిడిగా ఉడకబెట్టుకోవాలి. తర్వాత వాటిని మెత్తగా మెదుపుకోవాలి. బాణలిలో నూనెపోసి, వేడయ్యాక, ఇంగువ, కరివేపాకు, పోపుగింజలు, ఎండుమిర్చి, పచ్చిమిర్చి వేసి బాగా వేయించాలి. చిన్న ఉల్లిపాయను నిలువుగా తరిగి దానిని కూడా పోపులో వేయించాలి. ఉల్లిపాయ వేగిన తర్వాత, మెదుపుకున్న పప్పును కూడా బాణలిలో వేయాలి. తర్వాత ఉప్పు, టీ స్పూను పచ్చికారం వేసి బాగా కలపాలి. పదినిమిషాలు ఉడకనిచ్చి, తర్వాత దించాలి. వేడివేడి అన్నంలో ఉసిరికాయపప్పు, నెయ్యి వేసి కలుపుకొని తింటే రుచిగా ఉంటుంది.

# మతిమరుపునకు చెక్ పెడదామా?!

**అర్జెంటుగా బయటకు వెళ్ళాల్సిన పనిపడింది కానీ బండితాళం చెవులు ఎక్కడపెట్టామో గుర్తు రాదు. అవతల సమయం మించిపోతుందనే ఆందోళన. వెరసి నిర్లక్ష్యం పనికిరాదని మనసు చెప్పే ఓ ఉచిత సలహా! ఓ వైపు కంగారు, మరోవైపు విసుగు, ఆపైన కోపం... దాంతో అనుకున్న ప్రోగ్రాం కాస్తా రసాభాసగా ముగిసిపోతుంది. ఇది చాలామంది జీవితాల్లో ఏదో ఒక సందర్భంలో అనుభవ మయ్యే ఉంటుంది.**

**ఇదే కాదు కళ్ళజోడు, దువ్వెన, పుస్తకం ఇలాంటి కొన్ని కొన్ని వస్తువులు సైతం ఎక్కడపెట్టామో ఎంతకీ గుర్తుకురాకపోవడం, గతంలో పరిచయం ఉన్నవారు తిరిగి కనిపించిన వెంటనే పేరు గుర్తు రాకపోవడం వంటివి కొన్నికొన్ని సార్లు ఇబ్బంది పెట్టే సంఘటనలు. అయితే ఈ మతిమరుపు కేవలం వృద్ధులలోనే కాదు నేటి తరం యువతలో కూడా ఎక్కువగానే ఉంటోందన్నది కొన్ని సర్వేలు వెల్లడిస్తున్న వాస్తవం! ఈ సర్వేలు కొంత ఆందోళన కలిగిస్తున్న మాట నిజమే అయినా ఇంతలా ఈ మతిమరుపు రావడానికి కారణం ఏంటా అని ఆలోచిస్తే దానికి కొన్ని కారణాలున్నాయట. అవేంటో తెలుసుకుందామా!**

### యువతలో ఎక్కువవుతోంది

మతిమరుపు ఎక్కువగా మలివయసు వారికే వస్తుందనుకుంటే పొరబాటే! యుక్త వయసు వారు కూడా దీనివల్ల ఎక్కువగా బాధ పడుతున్నారట. అమెరికాలో ఈ విషయంపై ఎనిమిదివందల మందిపై సర్వే నిర్వహించారు. వారిలో 18-34 సంవత్సరాల వయసులో ఉన్న వారికి పనిలో ఒత్తిడి పెరుగుతూ ఉండడం వల్ల మతి మరుపు ఎక్కువవుతుందట ఈ సమస్య. తాళంగుత్తులు మరిచిపోవడం, రోజువారీ కార్య క్రమాలను మర్చిపోవడం, స్నానం చేశారా లేదా, భోజనం చేశారా లేదా అనే చిన్న చిన్న విషయాలను గురించి కూడా మర్చిపోయే యువత పెరుగుతున్నారని ఆ నివేదికలో పేర్కొన్నారు.

### వయసు మీద పడడం

యాభై సంవత్సరాలు దాటితే మెదడు పని తీరులో మార్పులు వస్తాయి. ఆ వయసులో ఏదైనా ఒక కొత్త విషయం తెలుసుకోవాలన్నా లేక అర్థం చేసుకోవాలన్నా కష్టంగా ఉంటుంది. అలాగే మెదడులో ఉన్న విషయాలను తిరిగి గుర్తుకు తెచ్చుకోవడంలోనూ చాలా ఇబ్బందిగా ఉంటుంది. మధ్యవయసు వచ్చాక మెదడు పని తీరు కాస్త మందగించడం ప్రారంభమవుతుంది. అది వయసు లక్షణం. మెదడుకు చేరే సమాచారం అర్థం చేసుకోవడం, మెదడులో దాన్ని విశ్లేషించడం నెమ్మదిగా జరుగుతుంది. మనుషులను, వస్తువులను మరిచిపోయినప్పుడు చికాకు అనిపించవచ్చు కానీ ఆందోళన చెందాల్సిన అవసరం లేదు. అది ఎంత మాత్రం ప్రమాదానికి సంకేతం కాదు. వయసులో ఉన్నప్పుడు పరిగెత్తినంత వేగంగా వయసు మీరిన తర్వాత పరిగెత్తలేం కదా... ఇదీ అలాంటిదే! అయితే వయసు పెరిగినా తగినంత నిద్రపోగలిగితే జ్ఞాపకశక్తి మందగించదు. మెదడుకు తగినంత విశ్రాంతినిస్తే మతిమరుపు ఇబ్బంది నుంచి బయటపడగలం. అలాగే కొన్ని రకాల మందుల వాడకం కూడా, మతిమరుపునకు దారితీస్తుంది. ముఖ్యంగా నిద్రమాత్రలు ఎక్కువగా వాడడం వల్ల మతిమరుపు వస్తుంది.

### వ్యాయామం లేకపోవడం

రోజువారీ పనులను మరిచిపోయేలా మతిమరుపు ఉంటే అది ప్రమాదమే! ఆరోగ్యమూ దెబ్బతింటుంది. కాబట్టి మతిమరుపు దరిచేర నీయకుండా జాగ్రత్తపడాలి. శారీరకంగా చురుగ్గా ఉంటే మానసికంగా కూడా చురుకుగా ఉంటారు. అందుకే శారీరక వ్యాయామం చేయాలి. వ్యాయామం చేసి శరీరాన్ని చురుకుగా ఉంచుకున్న వారు వయసు మీద పడినా

చలాకీగా ఉంటారు. వ్యాయామం వల్ల శరీర కండరాలు అదుపులో ఉన్నట్లే మెదడుకు వ్యాయామం చేయించేవారు మతిమరుపును దూరం చేసుకోగలుగుతారు. మెదడుకు వ్యాయామమా? ఎలా? అనుకుంటున్నారు కదా! మెదడుకు వ్యాయామం అంటే మెదడు ఏ పనులకు నిర్దేశించబడిందో ఆ పనులను క్రమబద్ధంగా చెయ్యడమే మెదడుకు చేయించే వ్యాయామం అన్నమాట. అంటే దానికి ఎప్పటికప్పుడు పదును పెడుతూ ఉండాలి. ఏ ఆలోచనా చేయకుండా నిస్తేజంగా ఉంటే మెదడు త్వరితగతిన మొద్దుబారుతుంది. మొద్దుబారిన మెదడు క్షీణించి ఇతర అనారోగ్యాలు తెచ్చిపెడుతుంది. శరీరానికి ఇచ్చే వ్యాయామంలో మెదడుకు కూడా మేలు చేయగలిగిన వ్యాయామం ఏరోబిక్స్. ఈ ఎక్సర్‌సైజుల వల్ల శరీరభాగాలన్నింటికీ రక్త సరఫరా మెరుగవుతుంది. మెదడుకు ఆక్సిజన్ సరఫరా అధికమవుతుంది. ఏరోబిక్స్ వ్యాయామం వల్ల మెదడుతో పాటు గుండెకి కూడా మేలు జరుగుతుంది.



### అధ్యయనంలో లోపం

కొత్త విషయం నేర్చుకునేందుకు వయసు అడ్డంకి కానే కాదు. మనిషి నిత్యవిద్యార్థి! నిత్య విద్యార్థికి ఎప్పుడూ మతిమరుపు అంటదు. రోజూ ఏదో ఒక కొత్త విషయం నేర్చుకుంటూ ఉండాలి. ఇలా కొత్త విషయం నేర్చుకున్నప్పుడల్లా మెదడు కణాల మధ్య సంబంధాలు మెరుగవుతాయి. నాడీకణాల మధ్య దట్టమైన అనుబంధాలవల్ల మెదడు ఎంతో చురుకుగా ఉంటుంది. కొత్త విషయం నేర్చుకోవడమంటే ఆలోచనలను పలురకాలుగా చేయడం అన్నమాట. ఒక పనిని భిన్న కోణాలలో ఊహించడం, ప్రతి సమస్యను భిన్నమార్గాలలో పరిష్కరించే ప్రయత్నం చేయడం. ఇలా చేస్తుంటే మెదడు స్థిరత్వాన్ని పొందుతుంది. మెదడులోని కీలక భాగాలన్నీ ఉత్తేజితమవుతాయి. ఇదే స్థితిని వయసు పెరుగుతున్నా కొనసాగించగలిగితే మెదడు మొద్దుబారదు, మతిమరుపు దరి జేరదు. కాబట్టి మెదడును కాస్త కష్టపెట్టండి. కొత్త కొత్త విషయాలవైపు మెదడును మళ్ళించండి.

ఎంతటి కొత్త సవాళ్ళు మెదడుకు మీరు అందిస్తారో అంత మేలు దానికి కలుగుతుంది. ఈమధ్య టీవీల్లో వచ్చే కార్యక్రమాల్లో కూడా కొన్ని ఆలోచనలు రేకెత్తించేవి వస్తున్నాయి. అలాంటి వాటి వల్ల మెదడుకు కొంత మేలు జరుగుతుంది. కొత్త భాష నేర్చుకోవడం, కొత్త విద్య అభ్యసించడం వల్ల మెదడుకి మరింత లాభం చేకూరుతుంది.

### చురుకుదనాన్ని పోగొట్టుకోవద్దు

మెదడుకు సవాళ్ళు విసరడం మానకండి. నేనేం చేయలేను అని డిప్రెషన్‌కి గురవడం కన్నా ఏదైనా చేయగలను అనుకోవడం ద్వారా మీలో ఉన్న సహజమైన చురుకుదనాన్ని మరింత రెట్టింపు చేసుకోగలరు. అందుకే చురుకుదనాన్ని పెంపొందించుకోవడానికి కొత్త ప్రదేశాలకు వెళ్ళడం, సరికొత్త పుస్తకాలు చదవడం వంటివి కొనసాగించండి. ఎప్పటికప్పుడు కొత్త వాటికి స్వాగతం చెప్పే అలవాటు వదులుకోవద్దు. ఆశావహ దృక్పథంతో ఉండాలి. ఇంటికే పరిమితమవడం వల్ల పరిచయస్తులు దూరం అవుతారు కాబట్టి బంధువులతో, స్నేహితులతో గడిపే సమయాన్ని కొనసాగించాలి. వచ్చి పలకరించేవారు లేకుంటే మెదడు క్రమంగా మొద్దుబారుతుంది. ఒంటరితనం పెరుగుతుంది. ఇలా ఒంటరితనం అనుభవించేవారికి త్వరగా అనేక అనారోగ్యాలు సోకుతాయని పరిశోధకులు నిరూపించారు. మెదడులోని నాడీకణాలు సక్రమంగా పనిచేయకుంటే వచ్చేదే మతిమరుపు. ఒకసారి మరుపు ప్రారంభమైందంటే తిరిగి జ్ఞాపకశక్తి తెచ్చుకోలేరు. వయసు గురించి మరిచి తమకన్నా చిన్నవారితో కలిసి తిరగ్గలిగితే కొత్తదనం, కొత్త ఆలోచనలు, కొత్త సవాళ్ళు, మెరుగైన జ్ఞాపకాలు ఉంటాయి. ఇదే ప్రతి ఒక్కరూ సాధించాల్సింది, కోరుకోవాల్సింది కూడా!

-కీర్తి



### ఇవి పాటిస్తే సరి!

1. అవసరాన్ని బట్టి ఒక వస్తువు పక్కన మరొకటి పెట్టుకునే పద్ధతి అమలు చేయాలి. ఉదాహరణకి ఉదయం బ్రషింగ్ అవగానే మాత్ర వేసుకోవాల్సిన అవసరం ఉన్నవారు తమ బ్రష్ ఎక్కడ పెడతారో దాని పక్కనే మాత్రల సీసా పెట్టుకుంటే మరిచిపోవడం జరగదు. ఇలా ఒక పని నుంచి మరో పని గుర్తుకు వచ్చేలా గుర్తులు పెట్టుకుంటే జీవితం సాఫీగా సాగిపోతుంది.
2. చిన్న విషయాలను గుర్తుపెట్టుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. మతిమరుపు మొదలైన వయసులో అది మరీ కష్టం. కాబట్టి జేబులో ఒక చిన్న పుస్తకం పెట్టుకుని ముఖ్యమైన విషయాలను వెనువెంటనే ఆ పుస్తకంలో రాసుకుని ఆ తర్వాత తిరిగి వాటిని చూసుకుంటే విషయాలు గుర్తుండిపోతాయి.
3. టెక్నాలజీ ఉపయోగించుకుని విషయాలు గుర్తుపెట్టుకోవచ్చు. ముఖ్యమైన తేదీలను, పేర్లను డిజిటల్ పద్ధతిలో సెల్‌ఫోన్‌లో లేదా కంప్యూటర్‌లో పెట్టుకుని, ఆ రోజును గుర్తుచేసేలా ఏర్పాటుచేసుకోవడం మంచిది.
4. ఏ విషయం వింటున్నారో దానిమీదే దృష్టి పెడితే త్వరగా గుర్తుపెట్టుకోగలరు. అవసరమైతే ఒకటికి రెండుసార్లు చెప్పమని అడిగి మరీ చెప్పించుకోండి. తప్పులేదు. దీనివల్ల మీ జ్ఞాపకశక్తి మెరుగుపడుతుంది.

# అగ్రిమెంట్

కోటమర్తి రాధా హిమబిందు



**"నాన్నా"**

**"ఏంటి నాన్నా"**

**"మీతో మాట్లాడాలి"**

**"చెప్పు నాన్నా"**

**"మామయ్య గారూ... పాయసం తీసుకోండి.." అంటూ వైదేహి రెండు గ్లాసుల్లో పాయసం తీసుకొచ్చి ఇద్దరికీ అందించింది.**

"ఏంటమ్మా... కొత్త విశేషాలు?"

"అన్నీ మామూలే" చిరునవ్వు నవ్వింది వైదేహి.

"పిల్లల కాలేజీ స్టడీస్ ఎలా సాగుతున్నాయి?"

"బాగున్నాయి"

"వాళ్ళనూ తీసుకొస్తే బాగుండేది"

"మిడిల్ ఆఫ్ ద వీక్ అయింది మామయ్య గారూ... మీ కొడుక్కి అనుకోకుండా సెలవు దొరికింది. త్వరలో పండగ వస్తుంది గదా... మేం నల్గురం వస్తాంలెండి".

"పండుగకు మీరే అక్కడికి రండి నాన్నా".

"చూద్దాంలే... ఏంట్రా.. ఏదో మాట్లాడాలని అన్నావ్?"

అటూయిటూ దిక్కులు చూస్తున్న భర్తను గమనించి లోపలికి వెళ్ళిపోయింది వైదేహి.

"అంత మొహమాటం ఏంట్రా చంద్రం... డబ్బు కావాలా?"

"అహc" నసిగాడు చంద్రం.

# హన్సికకు ఎంత కష్టమొచ్చింది?

కెరీర్ మొదటి నుంచీ గ్లామర్ పాత్రలే చేస్తూ తెర మీద ఎంతో అందంగా కనిపించే హన్సిక ఉన్నట్టుండి మేకప్ లేకుండా నటిస్తోంది. అదీ మురికివాడలో ఉండే అమ్మాయి పాత్రలో! మరి మురికివాడలో ఉండే అమ్మాయి అంటే భారీ మేకప్ ఉండకూడదు కదా? అందుకే దర్శకుడు సంపత్ నంది ఆమెను డీగ్లామర్‌గా చూపిస్తున్నాడు. మేకప్ లేకపోయినా సహజమైన రంగు, అందం ఉండడంతో మేకప్‌లేని లక్ష్మీదేవిలా ఉందని యూనిట్ సభ్యులు అంటున్నారు. ఈ సారి హన్సిక గ్లామర్‌ని కాకుండా టాలెంట్‌ని నమ్ముకుందని చెబుతున్నారు.



"ఇంకో ఫ్లాట్ కొనే ఆలోచన ఏమైనా చేస్తున్నావా? కొంటే ప్లేస్ తీసుకో... ముందుముందు ఉపయోగకరంగా ఉంటుంది".

"ఇంకో ఫ్లాట్‌కీ, ప్లేస్‌కీ డబ్బులెక్కడివి నాన్నా"...

"ఊc... అదేలే.."

"మీరు ఇష్టపడతారో లేదో... నేను ఓ ఆలోచన చేశాను నాన్నా".

"ఏంటి?"

"మీరిద్దరూ ఇక్కడ ఉండటం ఎందుకు నాన్నా! మా దగ్గర ఉండండి. మాకు హ్యాపీగా ఉంటుంది. పిల్లలు నానమ్మా తాతయ్యా అంటూ మీకు ఇంకా దగ్గరవుతారు. నా చిన్నప్పుడు నేను నానమ్మ, తాతయ్యతో గడిపేవాణ్ణి. నా పిల్లలకు ఆ అదృష్టం లేకుండా పోతోంది.."

"మధ్యమధ్య వస్తూనే ఉన్నాం గదరా".

"ప్చ్... పూర్తిగా ఉండాలని మా కోరిక. మీ కోడలు ఈమాట ఎన్నిసార్లు అంటుందో?"

"ఈ పొలం, తోట ఎవరు చూసుకుంటారు?".

"అమ్మేద్దాం నాన్నా! మీరు మా దగ్గరికి రావటం, మేం మీ దగ్గరికి రావటం ఇలా ఎందుకు నాన్నా... ఒకేచోట అందరం ఉందాం. ఇక్కడ అమ్మ, మీరు ఎలా ఉంటున్నారో అని మాకు చాలా కంగారు... పైగా పల్లెటూరు".

**అతడో స్కూల్ హెడ్మాస్టర్. ఒక్కగానొక్క కొడుకు. గారాబం చేయకుండా, అదుపాజ్ఞలలో పెంచాడు. కొడుకు పెరిగి, పెద్దవాడై జీవితంలో స్థిరపడితే చూసి సంతోషించాడు. కొంతకాలానికి రిటైరయ్యాడు. తనకున్న పొలమూ, తోటా చూసుకుంటూ, వచ్చే పెన్షన్‌తో సంతృప్తిచెందుతూ ఆ పల్లెటూర్లోనే ఉండిపోయాడు. ఒకరోజు కొడుకు తండ్రిని తనదగ్గరకు వచ్చేయమన్నాడు. అప్పుడా తండ్రి ఏంచేశాడు? కొడుకు దగ్గరకు వెళ్ళాడా?**

"అంత కంగారెందుకురా? మా ఆరోగ్యాలు బ్రహ్మాండంగా ఉన్నాయి".

"అవుననుకోండి. కానీ... ఏంటో దిగులు నాన్నా! ఈ మధ్య తరచూ అమ్మా, మీరూ గుర్తుకు వస్తున్నారు. మా కొలీగ్స్, ఫ్రెండ్స్ ఇళ్లల్లో వాళ్ళ తల్లిదండ్రులు కన్పిస్తుంటే మేం చాలా వెలితిగా ఫీలవుతున్నాం..."

"మరీ వర్రీ అవకండిరా"

"లేదు నాన్నా... ఈ విషయంలో మీరు ఆలోచించాల్సిందే.."

నవ్వుతూ లేచారు రామ్మూర్తిగారు.

•••

రామ్మూర్తిగారు స్కూలు హెడ్మాస్టర్‌గా ఉద్యోగం చేసి రెండు సంవత్సరాల క్రితం రిటైరయ్యారు. భార్య సులోచన అంటే ఆయనగారికి ప్రాణం. ఆవిడ తన ఇంటి మహాలక్ష్మి అని అనుకుంటారు. కొడుకు చంద్రం బ్యాంకు ఉద్యోగి. కోడలు పి.జి. చేసింది. కొన్నాళ్ళు లెక్చరర్‌గా పనిచేసి పిల్లలు పుట్టినతర్వాత జాబ్ మానేసింది.

ఏకైక సంతానం అయిన చంద్రాన్ని పెద్దగా గారాబం చేయకుండా, విలువలు నేర్పుతూ జాగ్రత్తగానే పెంచారు. మంచి జాబ్ వచ్చిన తర్వాత ఆనందించారు. జీవితంలో స్థిరపడిన తర్వాత రిలీఫ్‌గా ఫీలయ్యారు. కొడుక్కి ఇద్దరు పిల్లలు అనుకొని మురిసిపోయారు. ఉద్యోగం చేసినన్నాళ్ళూ, పొలాన్ని, తోటను కౌలుకిచ్చారు. ఆ తర్వాత పొలం, తోట తనే చూసుకోసాగారు.

"వైదేహీ... నాన్న ఏం నిర్ణయం తీసుకుంటారో?" ఓ సాయంత్రం వేళ చంద్రం భార్యతో అన్నాడు.

"మనం వచ్చి ఇరవై రోజులు అయింది... ఓ సారి గుర్తు చేయండి."

"ఏమో... ఏమనుకుంటారో?"

"పోనీ మీ అమ్మగారి ద్వారా అడిగించండి".

"అమ్మద్వారా ఎందుకులే... నేనే అడుగుతా..."

"అడగండి... నేను ఏకైక సంతానాన్ని... ఇప్పుడైనా అప్పుడైనా ఆస్తి మొత్తం నాకే కదా... అదేదో ఇప్పుడే ఇస్తే..."

"నేను అడగాల్సిందేదో నాకు తెల్సులే".

"మరి నాతో చెప్పటం ఎందుకో?" నవ్వింది వైదేహి.

చంద్రం కూడా నవ్వుకుంటూ తండ్రి నెంబర్ నొక్కాడు.

"ఆc.... నాన్నా... చంద్రం"

"నాన్నా... ఏం చేస్తున్నారు? అమ్మా మీరూ బాగున్నారా?"

"ఓ... బేషుగ్గా"

కాసేపు ఆమాట ఈమాట మాట్లాడి అసలు విషయానికి వచ్చాడు చంద్రం...

"నాన్నా... నేను చెప్పిన విషయం ఆలోచించారా?"

"నాలుగు రోజుల్లో మేమే మీ దగ్గరికి వస్తున్నాం. అప్పుడు మాట్లాడుకుందాం."

"అవునా నాన్నా...! రండి... రండి... ఓసారి ఫోను అమ్మకు ఇవ్వండి".

"ఆc.... నాన్నా... ఎలా ఉన్నావురా".

"బాగున్నానమ్మా... నాన్న, నువ్వు వస్తున్నారట్గా... సంతోషంగా ఉందమ్మా! సరే... ఉంటాను.. మళ్ళీ మాట్లాడతాను" అంటూ కాల్‌కట్ చేసి విషయాన్ని ఆనందంగా భార్యతో చెప్పాడు చంద్రం. వైదేహి ఆనందం అంతా యింతా కాదు.

"వెరీగుడ్! విషయాన్ని చాలా జాగ్రత్తగా డీల్ చేయాలి. అయినా ఆ పల్లెటూరిలో ఇద్దరూ ఏం ఉంటారు? ఇక్కడైతే కారులో తిప్పొచ్చు... సరదాగా సినిమాలూ, ప్రదేశాలూ చూపించవచ్చు".

"మనవడు మనవరాలు అని మురిపెం చేయవచ్చు".

"ఏదో అన్నావుగాని వీళ్లిద్దరూ వాళ్లతో ఎలా ఉంటారో? అప్పుడప్పుడు రావటం కాబట్టి దగ్గరగా ఉన్నారు. పర్మినెంట్‌గా ఇక్కడే ఉంటే వీళ్ల రియాక్షన్ ఎలా ఉంటుందో? ఖరీదైన మొబైల్ ఫోన్లు... నెట్‌లలో ఇప్పటికే మునిగి తేలుతున్నారు" నవ్వింది వైదేహి.

•••

రెండురోజుల నుండి రాచమర్యాదలు జరుగుతున్నాయి. రామ్మూర్తిగారు, సులోచన పల్లెటూరి కబుర్లు చెబుతూ ఆనందిస్తున్నారు. చంద్రం, వైదేహి పిల్లల కబుర్లు చెబుతూ గొప్పగా ఫీలవుతున్నారు. పిల్లలిద్దరూ కాలేజీ కబుర్లు చెబుతూ గర్వంగా ఫీలవుతున్నారు.

"ఏంటిరా... బ్యాంకుకు ఇంకా రెడీ కావటం లేదు? టైమ్ అవుతోందిగా.."

"ఇవాళ, రేపు సెలవు పెట్టాను నాన్నా! ఎల్లుండి ఒకపూట వెళ్లొస్తా. ఆదివారం సెలవు... మీతో కల్సి గడిపినట్లుంటుందని".

"పిల్లల చదువులు ఎలా ఉన్నాయిరా?"

"బాగున్నాయి నాన్నా".

"జాగ్రత్త... పిల్లల్ని కనిపెట్టండి"

"నా చిన్నప్పటిలా ఇప్పుడు రూల్స్ పెడితే వాళ్లు పాటిస్తారా నాన్నా... కాలం మారిపోయింది. వేగం పెరిగింది. నెట్‌లు వచ్చాయి..."

"ఏవివచ్చినా తినే ఆహారం, పీల్చేగాలి అప్పటివే గదరా..."

"అవుననుకోండి"

"పిల్లలపై ఇంకా శ్రద్ధపెట్టి కేర్‌ఫుల్‌గా ఉండు."

"అలాగే నాన్నా.. వాళ్లు ఫ్యూచర్‌లో మంచి పొజిషన్‌లో తప్పక ఉంటారు".

"వెరీగుడ్...! అంతకన్నా కావాల్సింది ఏముందిరా".

"కాసేపు నలుగురూ మౌనంగా ఉన్నారు.

"నాన్నా... నేను చెప్పిన విషయం ఏం ఆలోచించారు?"

"చెప్తాను".

చంద్రం, వైదేహి ముఖాలు వెలిగిపోయాయి.

"అంతా అమ్మితే ఎంత క్యాష్ వస్తుంది నాన్నా? ఐమీన్ ఇల్లు గాకుండా! మీరు పల్లెటూరు ఇష్టం అన్నారు... మీరు ఉండటానికి కావాలిగా.. మాకైతే మీరు ఇక్కడికి వచ్చి మాతో ఉండాలని ఉంది.."

"అది ఓ.కే... మరి మేం జీవించటానికి నెల ఖర్చు..."

"నేను ఇస్తానుగా... ఏంటి నాన్నా, అలా మాట్లాడతారు".

"నేనో అగ్రిమెంటు తెచ్చానురా! అది చదివి సంతకం పెడితే మేం ఇక్కడే ఉంటాం".

"అగ్రిమెంటా? అగ్రిమెంట్ ఏంటి?"

రామ్మూర్తిగారు లేచి వెళ్లి తన బ్యాగ్ నుండి ఓ ఫైలు తీసుకొచ్చి కొడుక్కి ఇచ్చారు. చంద్రం ఫైలు తెరిచి చూశాడు. వన్, టూ, త్రీ.. నెంబర్లతో మాటర్ రాసి ఉంది.

"ఏంటి నాన్నా ఇది?"

"చూడు... నీకే తెలుస్తుంది".

"నాన్నా"

"చూడరా... నువ్వుకూడా చూడమ్మా" కోడలితో అన్నారు. వైదేహి లేచి వచ్చి భర్త పక్కన కూర్చుంది.

(1) ఇంట్లో ఓ రూం వేయించి అన్ని వసతులూ ఏర్పాటు చేయాలి.

(2) వేళ ప్రకారం టిఫిన్, భోజనం, టీ, కాఫీలు ఏర్పాటు చేయాలి.

(3) మధ్యమధ్య డాక్టర్ చెకప్ ఉండాలి. మందులు అవసరం అయితే తీసుకొచ్చి ఇవ్వాలి. ఒకవేళ సీరియస్ పరిస్థితి ఉంటే ఓ నర్సుని ఏర్పాటుచేయాలి.

(4) అప్పుడప్పుడూ మీరు బయటకు వెళ్లినా మాకు తగిన ఏర్పాట్లు చేసి వెళ్లాలి. మేం కూడా అప్పుడప్పుడూ ఎటైనా వెళ్తూ ఉంటాం... అభ్యంతరం పెట్టకూడదు.

(5) కాలక్షేపానికి మీ టి.వి. మీరు చూస్తారు గాబట్టి మాకు విడిగా వేరే టి.వి. ఏర్పాటు చేయాలి.

(6) పండుగలకు, ముఖ్యమైన రోజుల్లో బట్టలు కొనివ్వాలి. అవి కూడా నీ హోదాకు తగ్గట్టుగా ఉండాలి.

(7) మాకు పాకెట్ మనీ కింద ప్రతీ నెలా కొంత డబ్బు ఇవ్వాలి. మేం ఎప్పుడైనా దేవాలయాలకు, పార్కులకు, సినిమాలకు వెళ్ళినా లేదా ఎవరైనా వచ్చినా, ఎవరింటికైనా వెళ్లినా వాళ్లకు ఇవ్వటం కోసం, మా సొంత ఖర్చుల కోసం ఆ డబ్బును ఉపయోగిస్తాం.

(8) అప్పుడప్పుడూ టూర్లకి వెళ్తుంటాం. టికెట్స్‌కి, ఖర్చులకి... ఆ డబ్బంతా నువ్వే ఇవ్వాలి.

కింది దాకా చూశాడు చంద్రం. ఇలా ఇంకా పదహారు దాకా నెంబర్లు ఉన్నాయి.

"ఏంటి నాన్నా.... ఇవన్నీ.." అయోమయంగా చూశాడు చంద్రం.

"నువ్వు అలా మాట్లాడిన తర్వాత నేను ఇలా రియాక్ట్ గావటం తప్పదు గదరా!"

"నాన్నా".

"నాకో విషయంలో ఆశ్చర్యంగా ఉంది. మేం జీవించటానికి నెలఖర్చు అని నేనడిగితే నువ్వు ఇస్తానని అన్నావ్... మీకు పెన్షన్ వస్తుంది గదా అని ప్రశ్నించలేదు".

"నాన్నా"

"నేను రిటైరైనప్పటి నుండి చూస్తున్నాను. నీలో చాలా మార్పు వచ్చింది. మా పెంపకం ఫలితం ఇదేనా అని నేను, అమ్మ చాలా బాధ పడ్డాం. ఇది ఎవ్వరికీ చెప్పుకోలేనిది. మా మనసు లోనే దాచుకున్నాం. నేను తొందర పడదల్చుకోలేదు. చూచాయగా అర్థం అయినా నువ్వు బయట పడినప్పుడే నేను బయట పడదామనుకున్నాను".

"అదిగాదు నాన్నా.. మీరు తప్పుగా అర్థం చేసుకున్నారు".

"నేను కరెక్ట్‌గానే అర్థం చేసుకున్నాను. మమ్మల్ని నువ్వు ప్రేమతో చూసుకోవటం వరకే నీ బాధ్యత! అంతేగాని బాధ్యత మరిచి హక్కులకోసం మాట్లాడటం సరైంది గాదు. నువ్వు గొప్పగా చదువు




వెలుగు వెన్నెలయే మేలిమి సంజెలో
ఎక్కడ మొదలై వస్తుందో ఏమో పాట
పేరు తెలియని గజల్ గాయని గొంతులో
బాధా సుధా మాధుర్య రవళి
పురాస్మృతుల పున్నాగ పరాగంతో
మార్ద్వారాశమై మనసును తడిపి ముద్ద చేస్తుంది
ఇదే రాగబంధమో ఏమో

## వ్యాకుల రాగం

అనాది జీవసూత్రాల రెక్కలపై
ఆ పాట నాకోసమే
అగాధ నిగూఢ కాలగతులను దాటివచ్చి
నాకు మాత్రమే అవగతమయ్యే
సంకేత భాషలో సందేశమేదో తెస్తుంది
వాలిపోయే ఆకాశం పాటతో పైకిలేచి
మరుపుతీరాల్లోని దీపాలు గుప్పున వెలుగుతాయి
ప్రాణాలు మరిగి... కాలం నిలిచిపోయాక
జాగ్రదావస్థలోని తలపులు మేల్కొంచుతాయి
కెరటాలు కెరటాలుగా తాకిన జ్ఞాపకాలను
బొట్టుబొట్టుగా చప్పరించాక
దహించే దాహార్తి తాకి కనుగవ చెమ్మగిల్లుతుంది
చిక్కువడిన ముడుల ఒక్కోదారప్పోగా విడివడి
రెప్పల కింది సంద్రాలు తీరాన్ని తాకుతాయి
రెల్లు పూల గాలుల మధ్య
వేదనా... వెన్నెలా జమిలిగా చెంతచేరి
'చింత' చెట్టుకు కట్టిన 'ఊయలను' ఊపుతూ
జోలపాడుతున్నప్పుడు
మనోధర్మ గమకాల్లో మెలితిరిగిన మనసు



వెతలకతల లిపి నేర్చుకుంటుంది
గాయపడ్డ పరిమళాలు పుప్పొడి నద్దుకోగానే
తెలివెన్నెల వంటి మెలకువ
వెలుగూ... చీకటుని రెండనుకుంటాం కానీ
వెంట ఉండేదెప్పుడూ చీకటే.
వెలుగే అప్పుడప్పుడూ వచ్చిపోయేది

-ఆవాల శారద
సెల్: 92956 01447

కోవచ్చు... కానీ నీకు చదువు చెప్పినవాణ్ణి చదివించిన వాడిని నేను! నువ్వు అది మర్చిపోయావు..." ఇల్లు మా కోసం ఉంచి, మమ్మల్ని అక్కడేవుంచి, నెలకింత పంపిస్తానని మాట్లాడావు. అప్పుడే మా మనసులు కుప్పకూలిపోయాయి".

"అదిగాదు నాన్నా... మిమ్మల్ని మా దగ్గర ఉంచుకోవాలనుకున్నాం... మీరు అలా ఒప్పుకోకపోతే ఇలా అని..."

"బాగా విను చంద్రం... నువ్వు ఎలా అనుకున్నా విషయం అయితే క్లియర్ అయింది. ఆస్తి పూర్తిగా నా స్వార్జితం. దాన్ని ఏదైనా చేసే హక్కు నాకు ఉంది. నువ్వు మమ్మల్ని సరిగా చూడటం లేదని అన్పిస్తే నా ఆస్తిని ఏ ట్రస్ట్‌కైనా రాసి ఇవ్వగలను. నేను గమనిస్తూనే ఉన్నాను. నీ పలకరింపులో, ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. మాపై ప్రేమ తగ్గించి, నాకున్న ఆస్తిమీద ప్రేమ, మమకారం ఎక్కువ పెంచుకున్నావు".

"నాన్నా"

"ఆస్తికావాలని అనుకుంటే మేము ఉన్నంత కాలం విధిగా మాకు కావాల్సినవి అమర్చి ఇవ్వాల్సిందే! ఇప్పుడంటే మేం ఓ.కే... ఇరవై ఏళ్ల తర్వాత మా పరిస్థితి ఏంటి? అంతా నీ చేతుల్లో పోసి మేం శూన్యంలోకి దైన్యంగా చూడాలా?"

"నాన్నా"

"అగ్రిమెంటును నువ్వు సరిగ్గా చదవలేదు. మరోసారి పూర్తిగా చదువు. ఈ అగ్రిమెంటులో ఎక్కడ ఉల్లంఘన జరిగినా నేను వీలునామా రాసి రిజిస్టర్ చేయటం జరుగుతుంది. ఇది కొడుకూ, కోడలి మీద సాధింపు గాదు.. కానీ, తల్లిదండ్రులుగా మాకు అధికారాలు ఉన్నాయి. మీరు మమ్మల్ని ఎందుకు పోషించరు? మా బాగోగులు ఎందుకు పట్టించుకోరు? ముసలి వాళ్లం అయినంత మాత్రాన మేం కాకుండా పోయామా? మీ అత్తమామలను గౌరవించినట్లుగా మాకూ గౌరవం ఇవ్వండి. కోడలిగా తనకూ అత్త గారి, మామగారి అవసరాలు చూడాల్సిన బాధ్యత ఉంది. వాళ్లని అంటరానివాళ్లుగా చూస్తారు. వాళ్ల ఆస్తి మాత్రం పనికి వస్తుందా? రేపు ఇదే పరిస్థితి నీకు కూడా వస్తే అప్పుడు నువ్వేం చేస్తావు? ముసలితనం, అనారోగ్యం ఎవరికైనా తప్పవు. నువ్వు ఇప్పుడు ఇలా ప్రవర్తిస్తే, ముందు ముందు ఖచ్చితంగా నీ పిల్లలు నీ బాటలోనే నడుస్తారు.

హక్కు... బాధ్యత నాణానికి రెండువైపుల్లాంటివి. వాటికి ప్రేమ తోడయితేనే పరిపూర్ణత్వం వస్తుంది. మా విషయంలో ఆ అవకాశం లేదు. కానీ మీ బాధ్యతను ఖచ్చితంగా నిర్వర్తించాల్సిందే! ఇది నా ఒక్కడి ఆవేదనగాదు... నాలాంటి అనేక మంది తల్లిదండ్రుల మనోవేదన! ఏమీ లేక పోయినా, ఏమీ ఇవ్వకపోయినా తల్లిదండ్రులను ప్రేమగా చూసుకునే పిల్లలూ ఉన్నారు.

ఇప్పుడు ఆస్తి పంచను.. అమ్మను! మమ్మల్ని మీదగ్గరే ఉంచుకొని, అగ్రిమెంటు ప్రకారం చూసుకోగలిగితే... మాకు సంతృప్తికలిగితే ఆస్తి ఇస్తాను! అదీ రెండు సంవత్సరాలు... పది సంవత్సరాలు... ఇరవై సంవత్సరాలు... అని సమయం పెట్టను. మా తదనంతరం నీకు వస్తుంది.... చెప్పానుగా అదీ మా మనసు సంతృప్తిచెందితేనే... మాకు ఇవ్వాలి అని అన్పిస్తే... కానీ ఇప్పుడు గాదు. మేం చాలా ఆరోగ్యంగా ఉన్నాం. ఒక్క కొడుకువి కావటం నీ అదృష్టం... మా దురదృష్టం".

"నేను ఒకలాగా ఆలోచిస్తే మీరు ఇంకోలా ఆలోచించారు నాన్న".

"ఏదో మాట్లాడి నీ నిజస్వరూపాన్ని ఇంకా బహిర్గతం చేసుకోకు. నువ్వు ఇలా మారిపోతావని నేను అస్సలు ఊహించలేదు. చాలా త్వరపడ్డావు చంద్రం! ఎప్పటికైనా ఈ ఆస్తి నీకే గదా వచ్చేది అని ఆలోచించి ఉంటే... ఇలా అడిగి ఉండకపోతే... నా దృష్టిలో కొంత బెటర్‌గా ఉండేవాడివి. నువ్వు, నీ పిల్లలు అనే దృష్టి మొదలైంది. మేము మసకబారిపోయాం. అప్పటి మా రోజుల్లో వృద్ధాశ్రమాలు లేవు. ఎక్కడో ఒకటో రెండూ ఉండేవేమో... సరిగ్గా తెలియదు. ఇపుడు ఎక్కడ చూసినా వృద్ధాశ్రమాలే! మీలాంటి అప్రయోజకులు ఎంతమంది తయారవుతున్నారో వాటిని చూస్తేనే అర్థం అవుతుంది. ఈ చేతిమీద ముగ్గురు అత్తయ్యల పెళ్ళిళ్ళు చేశాను. కష్టపడి అంతో ఇంతో సంపాదించాను. అదీ నా జీవిత భాగస్వామి అనుకూలవతి దొరకబట్టి... నీ వృద్ధికి కారణమైన వాళ్లని మరచిపోవాలనుకోవటం సిగ్గుగా లేదూ! నీ పుట్టుకకు కారకులైన వాళ్లను ఎలా వదిలేయాలనుకుంటున్నావు?... ఇంకో విషయం... మీ పిల్లలు పెడదోవ పడుతున్నారు... గమనించుకోండి. తర్వాత తలలు పట్టుకుంటే ఏ ప్రయోజనం ఉండదు. సులోచనా... ఇక వెళ్దామా?"

"నాన్నా"

"ఎందుకురా ఆస్తిపై నీకంత ప్రేమ! ఎదురుగా జీవించి కన్పిస్తున్న మాకంటే దానిపట్ల మమకారం ఎక్కువైందా! డబ్బు ఒక్కటేనా కావాల్సింది. అమ్మ, నాన్న, సంబంధాలు, బంధాలు... ఇవన్నీ వద్దురా"

సులోచన బ్యాగ్‌తో భర్త దగ్గరకు వచ్చింది.

"మామయ్య గారూ.. ప్లీజ్... ఉండండి"

"ఉండాలని లేదమ్మా! కంచె చేను మేసినట్లుగా ఉంది. గుండెంతా పిండేసినట్లుగా ఉంది. మీకు మీ పిల్లల మీద ప్రేమ ఉన్నట్లు, ఎంత చంపుకుందామన్నా చావని ప్రేమ కన్న వాళ్లకు ఉంటుంది. రావాలన్పించినపుడు వస్తాంలే... వెళ్దామా?"

"ఊఁ"

ఇద్దరూ బయటకు నడుస్తుంటే అచేతనంగా అలాగే చూస్తుండి పోయారు చంద్రం, వైదేహి.

**సెల్: 94407 64378**



## డోసు పెంచిన రకూల్

మామూలుగానే రకూల్ అందాల ఆరబోతకి పెద్దగా అడ్డు చెప్పదు. కానీ సాయిధరమ్ తేజ్‌తో నటిస్తున్న సినిమాలో ఈ డోసు బాగానే పెంచేసిందని అంటున్నారు. ఈ సినిమాకి రకూల్ అందాలే మెయిన్ అట్రాక్షన్ అని చెబుతున్నారు. ఈ సినిమాతో తేజ్ సూపర్ హిట్ కొడతాడని అందరూ చెబుతున్నారు. టాలీవుడ్‌లో టాప్ హీరోయిన్ రేంజ్ కోసమే రకూల్ ఈ యాంగిల్‌లో ప్రయత్నిస్తోందన్న వారూ లేకపోలేదు. మొత్తానికి రకూల్ అందాలు సినిమాకి ప్లస్ అవుతాయనడంలో ఎలాంటి సందేహం లేదట! అన్నట్టు ఈ సినిమాలో రకూల్ ఓ పాటలో ఓ లాకెట్ వేసుకుంటుంది. అందులో సాయిధరమ్ తేజ్ ఫోటో ఉందట! ఈ విషయం గమనించి కొందరు అడిగితే నీళ్ళు నమిలిందని అంటున్నారు. ఈ లాకెట్ వ్యవహారం ఏదో అనుమానాస్పదంగా ఉంది అంటున్నారు సినీజనాలు.

# సౌభాగ్య చక్రం

డిసెంబర్ 7 నుంచి డిసెంబర్ 13 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ప్రణాళికలు, దూరప్రయాణాలు, ఇంటర్వ్యూలకు సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సినీ, రాజకీయ రంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఒక సమాచారం కలవరపెడుతుంది. సమావేశాలు ఫలిస్తాయి. 9, 10 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. 11, 12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 13న ప్రయాణాల్లో నిదానం అవసరం. సమావేశాలు ఫలిస్తాయి. బిల్లులు, చెక్కులు అందుకుంటారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, షాపింగులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. ఖర్చులు అధికం. 9,10 తేదీల్లో విరాళాలు, చందాలకు వెచ్చిస్తారు. పన్నులు, బీమా వ్యవహారాలకు అనుకూలం. 11,12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో మీ వైఖరిని సమీక్షించుకోవాల్సిన అవసరం ఉంది. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. 13న స్పెక్యులేషన్లు, పెట్టుబడుల్లో నిదానం అవసరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెద్దలు, పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవానికి భంగం కలిగే సంఘటనలు జరుగుతాయి. 9,10 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ఒక సమాచారం ఆనందం కలిగిస్తుంది. 11,12 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. సినీరాజకీయ రంగాల వారికి గౌరవ మర్యాదలు లభిస్తాయి. 13న ప్రత్యర్థుల నుంచి చికాకులు ఎదురయ్యే అవకాశం ఉంది. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ఆరోగ్యం, బీమా, వృత్తిపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 9,10 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. 11,12 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆశించిన మొత్తం సకాలంలో చేతికి అందకపోవచ్చు. 13న ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. 9,10 తేదీల్లో ప్రియతములతో వేడుకల్లో పాల్గొంటారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. ప్రేమానుబంధాలు బలపడతాయి. 11,12 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 13న కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, మార్పులకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. వేడుకల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 9,10 తేదీల్లో అడ్వాన్సులు, రుణాలు అందుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. 11,12 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారి అంచనాలు తప్పుతాయి. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 13న బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు చోటుచేసుకుంటాయి.

### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)



సమావేశాలు, పెట్టుబడులు, విద్యా సంస్థలతో పనులు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 9,10 తేదీల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. భాగస్వామి విషయంలో శుభపరిణామాలు సంభవం. 11,12 తేదీల్లో విలువైన పత్రాల విషయంలో జాగ్రత్త అవసరం. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 13న ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. చర్చలు, సమావేశాలు లాభిస్తాయి.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

రుణాలు, పొదుపు పథకాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో చిన్నారులు, ప్రియతముల కోసం ఖర్చులు అధికం. పెట్టుబడులు, పొదుపు పథకాల్లో జాగ్రత్త అవసరం. 9,10 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 11,12 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. ఖర్చులు అధికం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 13న పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. బీమా, గ్రాట్యుటీ, పెన్షన్ వ్యవహారాలకు అనుకూలం.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు, ఉన్నత పదవులు ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. 9,10 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 11,12 తేదీల్లో సహోద్యోగుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. కొత్త పనుల శ్రీకారానికి మంచి సమయం. ఆరోగ్యం మెరుగవుతుంది. 13న జన సంబంధాలు విస్తరిస్తాయి. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ఖర్చులు అధికం.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలు, సమావేశాలు, సంస్మరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఒక సమాచారం కలవరపెడుతుంది. డ్రైవింగ్‌లో నిదానం అవసరం. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. 9,10 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. వాయిదా పడుతున్న పనులు ఒక కొలిక్కి వస్తాయి. 11,12 తేదీల్లో ఒక సమాచారం ఆవేదన కలిగిస్తుంది. దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. 13న ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ముఖ్య సమాచారం అందుకుంటారు.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. వేడుకల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. 9,10 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విలువైన పత్రాలు అందుకుంటారు. 11,12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలు, సమావేశాల్లో పాల్గొంటారు. 13న ఆర్థిక విషయాల్లో నిదానం అవసరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పైఅధికారుల నుంచి మాటపడాల్సి వస్తుంది. లక్ష్య సాధనకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 9,10 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. 11,12 తేదీల్లో పెద్దలతో చర్చలు ఫలించకపోవచ్చు. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 13న బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. పెద్దల వైఖరిలో మార్పు ఆనందం కలిగిస్తుంది. ప్రముఖుల్ని కలుసుకుంటారు.

నవ్య




## ఆయనే ఆదర్శం అట!



శేఖర్ కమ్ముల చేసిన సినిమాలు వేళ్ళమీద లెక్కపెట్టొచ్చు. అందులో చాలా వరకూ బ్లాక్ బస్టర్లే! ఈ దర్శకుడు విదేశాలు వెళ్ళి ఉద్యోగం చేసి బోలెడంత సంపాదించి, సినిమాల మీద మోజుతో ఇక్కడకు వచ్చి సినిమాలు తీసిన సంగతి తెలిసిందే! ఇప్పుడు ఈ సంగతంతా ఎందుకు? అన్న అనుమానం వస్తోందా? శేఖర్ కమ్ములను ఆదర్శంగా తీసుకున్నాడట 'జయమ్ము నిశ్చయమ్మురా' సినిమా దర్శకుడు శివరాజ్ కనుమూరి! శివరాజ్ యూకే వెళ్ళి అక్కడ సాఫ్ట్‌వేర్ కంపెనీ పెట్టి డబ్బు సంపాదించి, ఇండియాకి వచ్చి నిర్మాతగా మారి, స్వీయ దర్శకత్వంలో 'జయమ్ము నిశ్చయమ్మురా' సినిమా తీసి బ్లాక్ బస్టర్ హిట్ కొట్టాడు. యూకేకి వెళ్ళకముందు చాలా మంది దర్శకుల దగ్గర శివరాజ్ పనిచేశాడట! యూకేకి వెళ్ళి డబ్బు సంపాదించాలన్న ఆలోచన మాత్రం శేఖర్ కమ్ములను చూసిన తరువాతే వచ్చిందనీ, ఈ విషయంలో ఆయనే తనకు ఆదర్శమని చెప్పుకొచ్చాడు.

## రాజకీయాల్లోకి మీరాజాస్మిన్?

'గుడుంబా శంకర్' సినిమాలో పవన్ పక్కన నటించిన మీరాజాస్మిన్ గుర్తుంది కదా? ఆ సినిమా తరువాత కొన్ని సినిమాలు మాత్రమే చేసిన మీరా తరువాత టాలీవుడ్‌లో కనిపించడం మానేసింది.



ఇప్పుడు నటన మీద కాకుండా రాజకీయాల మీద దృష్టి పెట్టినట్లుంది. అందుకే అత్యాచారం చేసిన వారికి కాస్ట్రేషన్ (నపుంసకులుగా మార్చి వేసే) శిక్ష వేయాలని డిమాండ్ చేస్తూ ఉద్యమానికి నడుం కట్టింది. మహిళల రక్షణకు నడుం కట్టడం మంచిదే అయినా, ఇదంతా మహిళల మీద ప్రేమతో కాదనీ, మీరా త్వరలోనే రాజకీయాల్లోకి ప్రవేశించాలని ఆలోచిస్తోందనీ, అందుకే ఇంత హంగామా చేస్తోందని మాలీవుడ్ జనాలు అంటున్నారు.

## టెన్షన్ పడుతున్న అమీర్‌ఖాన్

అమీర్ టెన్షన్ పడుతోంది వ్యక్తిగత సమస్యల గురించి కాదు, తన తాజా సినిమా 'దంగల్' కోసం.



రెజ్లింగ్ నేపథ్యంలో రాబోతున్న ఈ సినిమా కోసం అమీర్ ఇప్పటికే చాలా బరువు పెరిగాడు. సినిమా సహజంగా రావడానికి తన వంతు ఎంత అవుతుందో అంతా చేస్తున్నాడు. అయినా టెన్షన్ పడుతున్నాడట! ఆ టెన్షన్ తట్టుకోలేక మానేసిన సిగరెట్లను ఇప్పుడు ఆశ్రయించాడు. ఇంతకీ అమీర్ టెన్షన్‌కి కారణముంది. సల్మాన్ సినిమా 'సుల్తాన్' ఎంత గొప్ప పేరు తెచ్చుకుందో తెలిసిందే! అదీ రెజ్లింగ్ నేపథ్యంలో వచ్చిన సినిమానే! అందుకే 'దంగల్' మీద అంతకు మించిన అంచనాలు ఉన్నాయి. వాటిని ఈ సినిమా అందుకోగలదా? లేదా? అన్నదే అమీర్ సందేహమట! నటిస్తున్న నటుడికే అంత అనుమానం ఉంటే? సినిమా ఫలితం ఇంకెలా ఉంటుందో అంటున్నారు బాలీవుడ్ జనాలు.

## నిజంగా బాద్‌షానే!

బాలీవుడ్ బాద్‌షా నిజంగా బాలీవుడ్ బాద్‌షానే! షాగా పేరొందిన షారూఖ్ ఖాన్ హవా తగ్గిందన్న వార్తలు అబద్ధమే అని నిరూపించాయి 'డియర్ జిందగీ' సినిమా వసూళ్ళు. ఆలియాభట్ ప్రధాన పాత్ర పోషించిన ఈ సినిమాలో షారూఖ్ ఓ ప్రత్యేక పాత్ర చేశాడు. ఇటీవలి కాలంలో షారూఖ్ సినిమాల పరాజయాన్ని గుర్తుతెచ్చుకున్న బయ్యర్లు ఈ సినిమా తీసుకోవడానికి కొద్దిగా వెనుకంజ వేశారట!



ఎలాగో అలా సినిమా బిజినెస్ పూర్తి చేసి విడుదల చేశారు దర్శకనిర్మాతలు. పెద్దగా అంచనాలు లేకుండా విడుదలైన ఈ సినిమా ప్రస్తుతం బాగా వసూళ్ళు చేస్తోందట! దీనికి కారణం షారూఖ్ ఖాన్ అంటున్నారు బాలీవుడ్ జనాలు. బాద్‌షా ఉండడం వల్లనే ఈ సినిమాకు ఇన్ని వసూళ్ళు వస్తున్నాయనీ, లేకపోతే ఈ సినిమా సోదిలోకి లేకుండా పోయేదనీ అంటున్నారు.



## అరవింద్‌స్వామికి అరువు ఇచ్చిన హేమచందర్

కోలీవుడ్ నటుడైన అరవింద్ స్వామికి తెలుగు సింగర్ హేమచందర్ అరువు ఇవ్వడం ఏమిటి? అన్న అనుమానం వస్తోందా! ఇది నిజం. ఎలాగంటారా? అరవింద్ స్వామి తెలుగులో 'రోజా' తరువాత పెద్దగా సినిమాలు చేయలేదు అయినా, ఆయనకి తెలుగులో అభిమానులు చాలా మందే ఉన్నారు. కోలీవుడ్‌లో హీరోగా కొన్ని సినిమాలు చేసిన అరవింద్‌స్వామికి మధ్యలో కొన్ని రోజులు బ్రేక్ వచ్చింది. కట్ చేస్తే.... ఇప్పుడు అక్కడ విలన్ క్యారెక్టర్లతో సెకండ్ ఇన్నింగ్స్ మొదలెట్టాడు. అందమైన విలన్‌గా అరవింద్ స్వామికి మంచి పేరొచ్చింది. రామ్‌చరణ్ హీరోగా తెలుగులో 'ధృవ' చేస్తున్న సంగతి తెలిసిందే. ఈ సినిమా మాతృక తమిళంలో విలన్ క్యారెక్టర్ అరవింద్ స్వామే చేశాడు. సినిమాతో పాటు విలన్‌కి మంచి పేరొచ్చింది.



దీన్ని దృష్టిలో పెట్టుకునే తెలుగులో కూడా అరవింద్ స్వామినే తీసుకున్నారట! కాకపోతే ఇక్కడ భాష ఇబ్బంది కనుక, అరవింద్ స్వామికి హేమచందర్ డబ్బింగ్ చెప్పాడట! అలా హేమచందర్ తన గొంతును అరవిందస్వామికి అరువిచ్చాడు.



# యాసతోనే ఇబ్బంది

**-ప్రియాంక చోప్రా**

**సినిమా అబద్ధమే కావచ్చు కానీ దానికోసం నటీనటులు పడే కష్టం మాత్రం అబద్ధం కాదు. తెరపై ఏ పాత్ర పోషించినా అందులో జీవించేస్తుంటారు కొందరు హీరోయిన్లు. అందులో ప్రియాంక చోప్రా పేరు ముందు చేర్చుకోవచ్చు. బాలీవుడ్ హీరోయిన్‌గా భారతీయుల మనసు దోచుకున్న ప్రియాంక హాలీవుడ్‌కి వెళ్ళి ప్రపంచవ్యాప్తంగా ఎంతోమంది అభిమానం సంపాదించుకుంది. నటనకు భాష ఇబ్బంది కాకపోయినా భాషకు సంబంధించి యాస ఇబ్బంది పెడుతుంది అంటున్న ప్రియాంకతో....**

### హాలీవుడ్‌లో బాగా బిజీ అయినట్టున్నారు?

టీవీ సీరియల్ 'క్వాంటికో 2' చేస్తున్నాను. 'బేవాచ్' అనే సినిమా కూడా చేస్తున్నాను. రెండు షూటింగులూ ఒకదాని వెనక ఒకటి ఉండడంతో కొద్దిగా బిజీగానే ఉన్నాను.

### హాలీవుడ్‌లో యాసతో ఇబ్బంది పడ్డాను అన్నారు ఎలా?

బాలీవుడ్ నుంచి హాలీవుడ్‌కి వెళ్ళిన హీరోయిన్లందరికీ ఇంగ్లీషు బాగానే వచ్చు. అర్థమవుతుంది కూడా! అయితే అక్కడ యాస ఇబ్బంది పెట్టేస్తుంది. కొన్ని అక్షరాలను మనం ఒత్తి పలుకుతాం. వాళ్ళు అసలు పలకనే పలకరు. దాంతో వారు మాట్లాడేది అర్థం చేసుకోవడం కష్టమే అవుతుంది. మొదట్లో నేను ఇలాంటి ఇబ్బందులే పడ్డాను. అదే విషయాన్ని చెప్పాను. అక్కడకు వెళ్ళిన కొత్తల్లో కొన్ని సామెతలు కూడా అర్థమయ్యేవి కావు. ఇప్పుడు బాగానే అలవాటు పడ్డాను. హాలీవుడ్ సినిమాల్లో ప్రతి చిన్న విషయానికి చాలా ప్రాధాన్యం ఇస్తారు. భారతీయ సినిమాల్లో కొన్ని విషయాలను చూసీ చూడనట్టు వదిలేస్తారు. .

### సినిమాలు చేస్తూనే నిర్మాతగా మారినట్టున్నారు?

ఎప్పటినుంచో ఆలోచన ఉంది. అది కార్యరూపం దాల్చింది. పర్పుల్ పెబల్ పిక్చర్స్ (Purple Pebble Pictures) నిర్మాణ సంస్థపై సినిమాలు తీస్తున్నాను. ఒక్క బాలీవుడ్‌లోనే కాకుండా భోజ్‌పురీ, పంజాబీ భాషల్లోనూ సినిమాలు నిర్మించే ఆలోచన ఉంది. ఆ దిశగా ప్రయత్నాలు మొదలయ్యాయి. భారతీయ భాషల్లోనే సినిమాలు తీస్తాను తప్ప హాలీవుడ్ సినిమాలు తీసే ఆలోచన లేదు. మరాఠీలో నేను నిర్మించిన సినిమా మంచి విజయం సాధించింది. ఈ విజయం మరిన్ని సినిమాలకు ఊతం అవుతుంది.

### టాలీవుడ్‌లో సినిమా నిర్మించబోతున్నారట?

ఆలోచన అయితే ఉంది. దానికి ఇంకా టైముంది. డిస్కషన్స్ అవుతున్నాయి. ఓ యంగ్ హీరోతో సినిమా చేసే ఉద్దేశం ఉంది.

### ఇక పెళ్ళి ఆలోచన లేనట్టేనా?

పెళ్ళి విషయంలో నాకొక స్పష్టమైన అవగాహన ఉంది. ఇప్పట్లో చేసుకునే ఆలోచన అయితే లేదు. అదే విషయం మా మదర్‌కి చెబితే అర్థం చేసుకుంది. ప్రస్తుతం సినిమాలతో బిజీగా ఉన్నాను. ఇప్పుడు పెళ్ళి చేసుకుంటే వాటికి ప్రాబ్లం అవుతుంది. మరో రెండు మూడేళ్ళ వరకూ నేను ఒప్పుకున్న ప్రాజెక్టులు ఉన్నాయి. వాటి తరువాత ఆలోచిస్తాను.

### లవ్ మ్యారేజా? అరేంజ్‌డ్ మ్యారేజా?

పెళ్ళి గురించిన ఆలోచనే లేనప్పుడు, ఎలాంటి పెళ్ళి చేసుకుంటానో ఇప్పుడే చెప్పలేను. ప్రేమ మీద నాకు బోలెడంత నమ్మకం ఉంది. భవిష్యత్తులో ఏం జరుగుతుందో చెప్పడం కష్టం.



**పెళ్ళి తరువాత కూడా నటిస్తారా?**

నటించడంలో తప్పు లేదుగా? చాలా మంది బాలీవుడ్ హీరోయిన్లు పెళ్ళి చేసుకుని, పిల్లల్ని కన్న తరువాత కూడా నటిస్తున్నారు. బహుశా నేను కూడా వారి బాటలోనే నడుస్తానేమో! ఆ సంగతి ఇప్పుడే చెప్పడం కష్టం.

**హాలీవుడ్‌లో ఒక వ్యక్తితో డేటింగ్‌లో ఉన్నారట?**

అది అబద్ధం. ఇంతకు మించి ఏం చెప్ప లేను. డేటింగ్‌లో ఉంటే నేను చెబుతానుగా? ఆ విషయం బయటకు చెప్పడానికి నాకు ఎలాంటి భయం, సంకోచం లేవు.

**ఇటీవలి మరిచిపోలేని సంఘటన?**

ఓ సారి ఓ ముసలావిడ బరువైన బ్యాగులు మోసుకుంటూ నడుచుకుంటూ వెడుతోంది. అంత బరువు మోయడం కష్టంగా ఉన్నా నడ వడం ఆపడం లేదామె! ఆమెను చూస్తే జాలే సింది. వెంటనే వెళ్ళి సహాయం చేయనా? అని అడిగాను. అంతే...వెంటనే నా మీద అంతెత్తున లేచింది.

'నా బ్యాగులు నేను మోసుకోలేననుకు న్నావా? నన్ను సహాయం కావాలా? అని అడుగు తున్నావు?' అంటూ అడిగింది. తన బరువు తానే మోసుకోవాలన్న ఆవిడ ఆత్మవిశ్వాసానికి నమస్క రించి, క్షమాపణలు అడిగి వచ్చేశాను. ఆ వయ సులో కూడా ఆవిడ మాట్లాడిన మాటలు ఇప్ప టికీ నాకు గుర్తుకొస్తూనే ఉంటాయి.

**మీ గురించి ఇతరులకు తెలియనివి?**

టీనేజ్‌లో టామ్‌బాయ్‌లా ఉండేదాన్ని. ఎప్పుడూ ఆటలు, దెబ్బలు తగిలించుకోవడమే! నా కాళ్ళకే ఎక్కువ దెబ్బలు తగిలేవి. వాటి తాలూకు మచ్చలు అలా ఉండిపోయి అసహ్యంగా తయారయ్యేవి. కాలేజ్‌కి వచ్చేసరికి నాలో బాగా మార్పు వచ్చింది. అందంగా తయారవ్వడానికి చాలా కష్టపడ్డాను. ఇప్పుడు నా కాళ్ళే 15 ఉత్పత్తులకు మోడల్‌గా ఉన్నాయి. ఇదంతా ఒక్కరోజులో మాత్రం రాలేదు. మేం బయట ఎలా ఉన్నా, తెర మీద అందంగా కనిపించడానికి మేకప్‌మెన్ బాగా కష్టపడతారు. గంటల తరబడి మేకప్ చేస్తే చివరికి తెర మీద అందంగా మెరిసిపోతూ కనిపిస్తాం.

**నిజమైన స్నేహం అంటే?**

గంటల తరబడి మాట్లాడుకునే వారు నిజ మైన స్నేహితులు అని అనలేం. మనం తరచూ మాట్లాడినా మాట్లాడకపోయినా వాళ్ళు మనల్ని మనస్ఫూర్తిగా నమ్మాలి.

మనం సంతోషంగా ఉన్నప్పుడు వెంట ఉండే వారు కాదు. మనకు బాధ కలిగితే వెంట ఉండి ఓదార్చేవారే నిజమైన స్నేహితులు. మన తప్పొప్పులను మనస్ఫూర్తిగా క్షమించగలిగి ఉండాలి. ఇలా చేయగలిగేది తల్లిదండ్రుల తరు వాత నిజమైన స్నేహితులే!

**అలాంటి స్నేహితులున్నారా?**

చాలామంది స్నేహితులైతే ఉన్నారు. ఇప్పటి వరకూ నేను భరించలేని కష్టాలు రాలేదు. వాళ్ళు నా వెంట ఉండలేదు. అలా అని వారిని నిజ మైన స్నేహితులు కాదు అని చెప్పడం సరికాదు.

**స్టార్ హీరోయిన్ అవుతానని ఈ రంగంలోకి వచ్చినప్పుడు ఊహించారా?**

నేను సినిమాల్లోకి వచ్చేటప్పటికి చాలా మంది స్టార్ హీరోయిన్లు ఉన్నారు. వాళ్ళ స్థాయికి చేరు కోవాలని అనుకునేదాన్ని. అనుకోవడంతోనే సరి పెట్టుకోకుండా కష్టపడి పనిచేశాను. నా కెరీర్‌లో ఫ్లాపులున్నాయి. అయినా సరే విజయం కోసం మరింత కష్టపడేదాన్ని. కష్టాన్ని నమ్ముకున్నాను కనుకే ఈ స్థాయికి రాగలిగాను.

**బాలీవుడ్‌లో ఇటీవలే ఓ సినిమా అంగీకరించారట నిజమేనా?**

లేదు. ఇంతవరకూ ఏ ప్రాజెక్టుకీ ఓకే చెప్ప లేదు. చాలా కథలు విన్నాను. వచ్చే నెలతో 'క్వాంటికో 2' షూటింగ్ అయిపోతుంది. అప్పుడు ఇండియా వచ్చి ఏ ప్రాజెక్టు ఓకే చేయాలో ఆలో చిస్తాను. బాలీవుడ్‌లో సినిమాలు తగ్గించి నా నిర్మాణంలోనే సినిమాలు చేస్తే ఎలా ఉంటుం దనే ఆలోచన కూడా ఉంది. ఇవన్నీ ఓ కొలిక్కి రావాలంటే కొద్దిగా టైం పడుతుంది.

-చిన్ని



# ఇంటర్వ్యూ

# ఆ సినిమాతో నా ఇంటిపేరే మారిపోయింది

**-శంకరాభరణం రాజ్యలక్ష్మి**

**కొన్ని సినిమాలు ప్రేక్షకుల మనసులో చిరస్థాయిగా నిలిచిపోతాయి. దశాబ్దాలు గడిచినా ఆ సినిమానూ, అందులో నటించిన వారినీ గుర్తు పెట్టుకుంటారు. అలా ఎప్పటికీ గుర్తుండిపోయే సినిమా 'శంకరాభరణం'! ఆ సినిమాలో అన్ని పాత్రలూ మరపురానివే! అందులో కూతురి పాత్రలో నటించిన రాజ్యలక్ష్మికి మాత్రం అందరికన్నా ఎక్కువ గుర్తింపే లభించింది. ఎలా అంటే...ఆ సినిమా పేరే ఆమె ఇంటి పేరు అయిపోయింది. ఆ సినిమా వచ్చి దశాబ్దాలు గడిచినా ఆమెను అందరూ ఇప్పటికీ శంకరాభరణం రాజ్యలక్ష్మి అనే వ్యవహరించారు.. వ్యవహరిస్తున్నారు కూడా! కాలానుగుణంగా సినీపరిశ్రమలో వస్తున్న, వచ్చిన మార్పులు అన్నీ బాగున్నాయంటున్న రాజ్యలక్ష్మితో....**

### పుట్టిందీ...పెరిగిందీ...

నేను పుట్టింది గుంటూరు జిల్లా, తెనాలిలో. మా నాన్నగారు సి.హెచ్. వెంకట్రావు. అమ్మ సి.హెచ్. సభారంజని. అమ్మ స్టేజీ ఆర్టిస్టు. తనకి తెనాలిలో మంచి పేరుంది. తెనాలిలోనే పదవ తరగతి వరకూ చదువుకున్నాను. ఆపై చదువు సాగలేదు. సినిమాల్లోకి వచ్చేశాను.

### భరతనాట్యం

చదలవాడ నారాయణరావుగారి దగ్గర కొన్ని రోజులు భరతనాట్యం నేర్చుకున్నాను. ఆ తరువాత వెంపటి చినసత్యం గారి దగ్గర కూచిపూడి నేర్చుకున్నాను. రెండు రకాల నాట్యాలు నేర్చుకున్నా, ప్రదర్శనలు ఇచ్చింది మాత్రం కూచిపూడి నాట్యంలోనే! చెన్నైలో ఎక్కువ ప్రదర్శనలు ఇచ్చాను. తమిళ అసోసియేషన్ వాణి ఆహ్వానంతో లండన్, పారిస్‌లో కూడా ప్రదర్శనలు ఇచ్చాను.

### ఆ ఆలోచనే లేదు!

ఎంతసేపూ నాట్య ప్రదర్శనలు తప్ప సినిమాల్లో చేరాలన్న కోరిక నాకెప్పుడూ ఉండేది కాదు. విశ్వనాథ్‌గారు 'శంకరాభరణం' సినిమా కోసం కొత్త ఆర్టిస్టులు ఉంటే చెప్పమని జంధ్యాల గారిని అడిగారట. వెంటనే ఆయన నన్ను సజెస్ట్ చేశారు. నేనూ, అమ్మా వెళ్ళి విశ్వనాథ్‌గారిని కలిశాం. ఆడిషన్ టెస్ట్ లాంటివి లేకుండానే విశ్వనాథ్‌గారు నన్ను ఎంపిక చేశారు. మేకప్ అదీ పెద్దగా లేకుండా ఒరిజినల్‌గా నటించాలని అన్నారు. నేనూ సరే అన్నాను. మొదటి సినిమా కదా, కొద్దిగా భయం వేసింది. కానీ విశ్వనాథ్‌గారు నాకు ధైర్యం చెప్పి నా భయాన్ని పోగొట్టారు. ఈ సినిమాలో నాకు ఎలాంటి మేకప్ లేకపోయినా, బాలూ మహేంద్ర గారి పుణ్యమా అని అందంగా కనిపించాను. అదంతా ఆయనవల్లే! ఆ సినిమా నా ఇంటిపేరునే మార్చేసింది. ఆ సినిమా తరువాత నన్ను అందరూ 'శంకరాభరణం రాజ్యలక్ష్మి' అని పిలవడం మొదలెట్టారు. నాకు కూడా అలా పిలవడం నచ్చడంతో, దాన్నే నా ఇంటిపేరుగా ఫిక్స్ అయిపోయాను.

### సినీ జీవితం

ఆ సినిమా తరువాత అవకాశాలు వెల్లువెత్తాయనే చెప్పాలి. తెలుగు, తమిళం, కన్నడ భాషలలో కలిపి మొత్తం వంద సినిమాల దాకా హీరోయిన్‌గా చేశాను. అదే సంవత్సరం 'నిప్పులాంటి నిజం'లో మురళీమోహన్‌గారితో చేశాను. అదీ మంచి విజయం సాధించింది. దాంతో ఇక వెనుతిరిగి చూసుకోవాల్సిన అవసరం లేకుండా పోయింది. రాజ్యలక్ష్మి ఏ పాత్ర అయినా చేయగలదు అన్న పేరు తెచ్చుకున్నాను. ఆ కారణంగానే మంచి పాత్ర ఏది ఉన్నా దర్శకులు నన్ను సంప్రదించేవారు. చెల్లెలు పాత్ర అయినా సరే, దానికి

రాజ్యలక్ష్మి అయితేనే బాగుంటుంది అనుకునే వారు. దాంతో ఓ పక్క హీరోయిన్‌గా చేస్తూనే క్యారెక్టర్ పాత్రలు కూడా చేశాను. ఒక్కమాటలో చెప్పాలంటే నా దగ్గరకు వచ్చిన ప్రతి మంచి అవకాశాన్నీ వినియోగించుకున్నాను.

### ఆయన సలహాలు మరచిపోలేను

నా సినీ ప్రయాణంలో శోభన్‌బాబుగారి గురించి ప్రత్యేకించి చెప్పుకోవాలి. ఆయన సినిమా 'జగ మొండి'లో ఆయనకు చెల్లెలిగా నటించాను. ఆ సినిమా షూటింగ్ సమయంలో ఆయన నాకు ఎన్నో విలువైన సలహాలు ఇచ్చారు. డబ్బులు వృధా చేసుకోకుండా బంగారంకానీ, భూమికానీ కొను క్కుంటే చేతిలో డబ్బు ఉన్నట్టే అని చెప్పేవారు. అలాగే డబ్బును ఎలా పొదుపుగా వాడుకోవాలో కూడా ఆయన దగ్గర నేర్చుకున్నాను. ఆయన సలహాలు తరువాత తరువాత నాకు బాగా ఉప యోగపడ్డాయి.

### ఆవిడని చూడలేకపోయాను

మహానటి సావిత్రిగారిని చూడలేకపోయా ననే బాధ ఎప్పటికీ ఉంటూనే ఉంటుంది. ఈ రంగంలోకి వచ్చినప్పటి నుంచీ ఆవిడని ఒక్క సారి చూడాలని ఆరాటపడేదాన్ని! ఒకసారి త్రుటిలో ఆ అవకాశం తప్పిపోయింది. 'శంకరాభ రణం' సినిమా చూడడానికి ఆవిడ థియేటర్‌కి వచ్చారు. నేను కూడా అప్పుడు ఆ థియేటర్‌లోనే సినిమా చూస్తున్నాను. ఆవిడ వచ్చిన విషయం తెలిసి, కలుసుకుందామని కుర్చీలో నుంచి లేచే సరికి, ఆవిడ చుట్టూ జనం మూగి ఉన్నారు. ఇప్పుడు కాదు, సినిమా అయిపోయిన తరువాత కలుసుకుందామనుకున్నాను. కానీ ఆవిడ సినిమా అయిపోవడానికి పది నిమిషాల ముందే థియే టర్ నుంచి వెళ్ళిపోయారు. ఆ విషయం తెలిసి చాలా బాధ అనిపించింది. ఆవిడని చూసే భాగ్యం త్రుటిలో తప్పిపోయిందన్న బాధ ఇప్పటికీ వెంటా డుతూనే ఉంటుంది. అలాగే ఎస్వీరంగారావుగారి సినిమాల్లో నటించే అదృష్టం కూడా నాకు దక్కలేదు.



### సూపర్‌స్టార్‌తో...

రజనీకాంత్‌గారితో నటించడానికన్నా ముందే పలు తమిళ సినిమాలు చేశాను. అవన్నీ ఒక ఎత్తయితే రజనీకాంత్‌గారితో నటించడం ఒక ఎత్తు! ఒక సినిమాలో రజనీకాంత్‌గారు త్రిపాత్రా భినయం చేశారు. ఒక పాత్రకి నేను హీరోయిన్‌ని. ఆ సినిమా నాకు చాలా మంచి పేరునీ, మరిచి పోలేని అనుభూతినీ మిగిల్చింది. ఆ తరువాత ఆ సినిమాను కన్నడంలోనూ, హిందీలోనూ రీమేక్ చేశారు.

### రెండు పద్ధతులూ నచ్చాయి

అప్పటి పరిస్థితులకు అనుగుణంగా అప్పటి నిర్మాణ పద్ధతులు భేషుగ్గా ఉండేవి. టెక్నాలజీ పెరిగాక నిర్మాణంలో ఎన్నో మార్పులు వచ్చాయి. గతంలో కన్నా సినిమాల్లో రిచ్‌నెస్ ఎక్కువగా ఉంటోంది. ఇప్పటికి కాలానికి అది చాలా అవ సరం కూడా! రెండు పద్ధతులూ బాగున్నాయి.

### వారంటే ఎంతో అభిమానం

*చిత్రసీమలో నాకు అభిమాన నటీనటులు ఎంతోమంది ఉన్నారు. వారిలో నాగేశ్వరరావు గారు, ఎన్టీ రామారావుగారు అంటే ఎక్కువ అభిమానం. నాగేశ్వరరావుగారితో 'దాంపత్యం' సినిమాలో మొదటిసారి నటించాను. ఆ తరు వాత నాలుగైదు సినిమాలు చేశాను. ఎన్టీ రామారావుగారితో ఎక్కువ సినిమాలు చేశాను. ఆయనతో చేసిన సినిమాల్లో చాలా సినిమాలు నాకు మంచి పేరు తెచ్చిపెట్టాయి. అలాగే బాలకృష్ణగారితోనూ, కృష్ణగారి సినిమాల్లోనూ నటించాను. ఇప్పటివరకూ నేను చేసిన పాత్ర లన్నీ నాకు మంచి పేరునూ, గుర్తింపునూ తీసు కొచ్చినవే!*

అయితే అప్పుడూ, ఇప్పుడూ నాలో ఎలాంటి మార్పూ రాలేదు. ఒకలాగే ఉన్నాను. కొత్తవారికి అవకాశాలు ఎక్కువగా వస్తున్నాయి. ఇది మంచి పరిణామం. గతంతో పోలిస్తే ఇదో గొప్ప మార్పు అనే చెప్పుకోవచ్చు.

### నా ఫోటోకి దండపడేదే!

ఇన్ని సంవత్సరాల సినీజీవితంలో, ఆ సంఘ టన గురించి ఇప్పుడు తలచుకున్నా ఒళ్ళు జలద రిస్తుంది. ఈవివి సత్యనారాయణగారి 'చెవిలో పువ్వు' సినిమాలో నటిస్తున్న సమయంలో జరి గిందా సంఘటన! ఆ సినిమాలో నేను ఆత్మ హత్య చేసుకునే సన్నివేశాన్ని గుడి మెట్లమీద ఉండే ఆర్చి కింద షూట్ చేయడానికి ప్లాన్ చేశారు. ఏర్పాట్లన్నీ చేశారు. నా మెడలో తాడు వేలాడదీశారు. టేక్ అనేంతవరకూ ఆ తాడును మెడలోనే వేసుకోవాలి. ఇంతలో లైట్ ఫోకస్ కళ్ళల్లో పడి కొద్దిగా కదిలాను. అంతే ఆ తాడు ముడిపడి నా మెడకు బిగుసుకుపోయింది. కళ్ళు తేలేశాను. అరవడానికి నోరు రావడం లేదు. దగ్గ రలో ఎవరూ లేరు కూడా! నా అదృష్టం కొద్దీ



కెమేరామెన్ నా పరిస్థితిని గమనించి, గబగబా వచ్చి వేలాడుతున్న నన్ను కిందికి దింపారు. అప్పటికే స్పృహ కోల్పోయిన నన్ను వెంటనే ఆసు పత్రికి తరలించారు. ఆ కెమేరామెన్ పుణ్యాన బతికి బట్టకట్టాను. లేకుంటే ఆరోజే నా ఫోటోకు దండ పడేది. ఆ కెమేరామెన్ పేరు ప్రతాప్. ఇప్ప టికీ అతడు ఎప్పుడు ఎదురు పడినా ఆప్యా యంగా మాట్లాడుకుంటాం. మా మాటల్లో ఆనాటి సీన్ తప్పనిసరిగా వస్తుంది. ఇద్దరం నవ్వుకుంటాం.

### పెళ్ళి...పిల్లలూ...

ఈ సంఘటన జరిగిన రెండు మూడు నెలల తరువాత అంటే 1990లో నా పెళ్ళి జరి గింది. మా వారు సింగపూర్‌లో వ్యాపారం చేస్తుండడంతో నేను కూడా అక్కడికి వెళ్ళిపో యాను. నాకు ఇద్దరు అబ్బాయిలు. పెద్దవాడు రోహిత్. బిఎస్సీ చేసి సింగపూర్‌లో జాబ్ చేస్తు న్నాడు. రెండోవాడు రాహుల్ యూకేలో చదువు కుంటున్నాడు.

### సుదీర్ఘ విరామం తరువాత...

పెళ్ళయిన ఇరవై నాలుగు సంవత్సరాల తరు వాత తిరిగి 2004లో సినిమాల్లో నటించడం ప్రారంభించాను. తిరిగి నటించాలని ఉందని మా వారికి చెప్పగానే, నీ ఇష్టం అన్నారు. దాంతో మళ్ళీ మేకప్ వేసుకున్నాను. ఎక్కువగా పిన్ని, తల్లి పాత్రలు చేస్తున్నాను. సెకండ్ ఇన్నింగ్స్‌లో కూడా నన్ను ఇంత బాగా ఆదరిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది. వారు ఇష్టపడినట్టే సినిమాలు చేస్తానని చెప్పడం తప్ప... అభిమానులకు ఏం ఇచ్చి రుణం తీర్చుకోగలను. ప్రస్తుతం సినిమా లతో పాటు టీవీ సీరియల్స్ కూడా చేస్తున్నాను.

**-కె.హరనాథ్**
**సెల్: 9703542598**

# ఇవన్నీ నిజాలే!

A చాక్లెట్స్ అంటే అందరూ ఇష్టపడతారు కదూ! ప్రపంచంలోనే అతి పెద్ద క్యాండీబార్ పది ఇంచుల మందంతో 9720 పౌండ్ల బరువుతో 18.4 అడుగుల పొడుగుతో తయారైంది.

•••

A ప్రపంచంలోనే అతిపెద్ద ఆర్థోపాడ్ జపనీస్ స్పైడర్ కార్బ్! భూమి మీదనే ఇది అత్యంత పెద్దది. 12 అడుగుల పొడుగుండే ఈ స్పైడర్లు భూమిలోపల 1000 అడుగుల లోతులో నివసిస్తున్నట్లు పరిశోధ కులు కనుగొన్నారు.

•••

A ఆరెంజ్ కోయి కార్ప్ ఫిష్ ప్రపంచంలోనే అతిపెద్ద చేప. దీనిబరువు 30 పౌండ్ మాస్.

•••

A ప్రపంచంలోనే అతిపెద్ద మొజాయిక్ డిజైన్‌ని కంప్లీట్ చేయడానికి పదేళ్ళ సమయం పట్టిందట. దీన్ని డిజైన్ చేయడానికి బాబ్ అండ్ జాన్ అనే ఇద్దరు అన్నదమ్ములు 1.6 మిలియన్ల చిన్న వుడ్ వార్డ్ పీసెస్‌ను ఉపయోగించి ఆ డిజైన్‌ను రూపొందించారట.

•••

A వరల్డ్ రికార్డు ఛేదించేందుకు 25 మంది ఆర్టిస్టులు కలిసి ఇసుకలో అతిపెద్ద కార్పెట్‌ని డిజైన్ చేశారు. ఈ కార్పెట్‌ను 3,93,79,078 చదరపు అడుగుల్లో చూడముచ్చటగా డిజైన్ చేశారు.

•••

A న్యూజిలాండ్‌లో ఎలాంటి ఎన్నికలు జరిగినా సరే శనివారం రోజునే జరుగుతాయి.

•••

A అమెరికావారు నవంబర్ 24న జరుపుకునే 'థాంక్స్ గివింగ్ డే' సందర్భంగా దాదాపు 88శాతం మంది టర్కీ జాతికి చెందిన కోళ్ళను తింటారు. అంతేకాదు అక్కడ జరుపుకునే అన్ని పండు గలలో ఈ కృతజ్ఞతా దినోత్సవం రోజునే ఎక్కువ ఆహార విని యోగం జరుగుతుందట.

•••

A న్యూయార్క్ సిటీలో ఉండే ట్యాక్సీలన్నింటినీ ఒకదానిపై ఒకటి నిలబెడితే, జపాన్ దేశపు అతిపెద్ద పర్వతం ఫిజి కంటే ఎక్కువ ఎత్తుగా కనిపిస్తాయట.

•••

A కోలా అనే జంతువులకి నిద్ర అంటే చాలా ఇష్టం కాబోలు రోజులో ఇరవై గంటలు పడుకునే ఉంటాయి.

•••

A జావెలిన్ త్రో, గోల్ఫ్... ఈ రెండు ఆటలు మాత్రమే చంద్రునిపై ఆడేందుకు వీలవుతుంది.

•••

A ప్రపంచంలో మొట్టమొదటిసారిగా టూత్‌బ్రష్‌ని చైనాలో ట్యాంగ్ రాజుల(619-907)కాలంలో ఉపయోగించారట. ఆ బ్రష్‌కి ఉండే బ్రిసిల్స్‌ని అడవిపంది వెంట్రుకలతో తయారు చేశారట.

-చిన్నారి

# సుధామ పదగారడి-291

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | 2 | | 3 | h | 4 | | |
| 5 | h | | h | 6 | | | h | h |
| 7 | | | 8 | h | h | 9 | 10 | |
| | h | h | 11 | | | h | | h |
| 12 | 13 | | h | h | h | 14 | | 15 h |
| h | | 15 h | 16 | h | 17 | h | h | |
| 18 | | h | | h | 19 | 20 | h | |
| h | h | 21 | | 22 | h | | h | |
| 23 | | | h | 24 | | | | h |

## ఆధారాలు

**అడ్డం**

1. మిక్కిలి అణకువ, మర్యాద (4)
4. మనోజ్ఞమైనది, మిక్కిలి శోభ (3)
6. రాశ్యుదయము, పెళ్ళిలో శుభసమయం (3)
7. నిషానీ (4)
9. అష్టవిధశృంగార నాయికల్లో ఒకరు కాదంటే ఖండించాల్సిందే (3)
11. నమస్కారం (3)
12. పెద్ద ఢంకా (3)
14. ఆమ్ ఆద్మీ పార్టీ గుర్తు (3)
16. తమిళమే (3)
18. మంగళం (2)
19. కంటి నల్లగ్రుడ్డు (4)
21. ముల్లు (3)
23. ప్రణయం (3)
24. ఒక ఆడ మరియు ఒక మగపక్షి కలిసి (4)

**నిలువు**

2. కొను (3)
3. శీతలము ఆద్యంతాలు లేదు (2)
4. అయిదువందలు, వెయ్యిరూపాయల నోట్ల రద్దు పట్ల చాలామంది ఇలాగనే వున్నారు (3)
5. విన్నవించుట, వ్యాజ్యము తెచ్చుట ఆద్యంతాలు ఆనగా! (4)
8. ద్రవ్యం యావత్తు లోపిస్తే! (2)
10. తలక్రిందయిన బంగారం (3)
13. గాడిద (3)
15. ఏ పదార్థమైనా ఇలా వుంటేనే తినబుద్ధి అవుతుంది (4)
16. అక్కడ అనే (3)
17. నెపము (2)
20. పద్మము (3)
21. దుర్వాసనకు వ్యవహారం (2)
22. ముండ్లమండ (2)

### పదగారడి-290 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | చ | | క | ని | ని | క | | హా |
| సు | ష | మ | | హా | | ర | హా | స్యం |
| | కం | | చె | ర | | గ్ర | | |
| సం | | ప్ర | | ము | | హ | స్త | ము |
| త | | సా | లు | | వ | ణ | | ట్టు |
| కం | ద | ర | | పం | | ము | | డి |
| | | భా | | చ | ల్ల | | బా | |
| తా | మ | ర | | దా | | చె | లి | మి |
| ళం | | తి | మి | ర | ము | | క | |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

'సీమ టపాకాయ'లాగా టాలీవుడ్‌లోకి దూసుకొచ్చిన ముస్లిం అమ్మాయి పూర్ణ. అసలు పేరు సమ్న కాసిమ్. పూర్ణను చూసిన వారు దక్షిణాదికి మరో అసిన్ దొరికిందని సంతోషపడినా, ఆ స్థాయిలో మాత్రం పేరు తెచ్చుకోలేకపోయింది. సినీరంగంలోకి వచ్చిన ఇన్ని రోజులకు మనసుకు నచ్చిన సినిమాలో నటించానంటున్న పూర్ణతో...



# వారి మాటలు వినలేదు

-పూర్ణ

**'జయమ్ము నిశ్చయమ్మురా' సక్సెస్‌ను ఎంజాయ్ చేస్తున్నారా?**

చాలా బాగా ఎంజాయ్ చేస్తున్నాను. ఈ సినిమా కథను డైరెక్టర్‌గారు చెప్పగానే ఓకే చెప్పకుండా ఉండలేక పోయాను. ఈ సినిమా చేస్తున్నానని తెలిసిన వెంటనే చాలామంది వద్దని భయపెట్టారు. వారి మాటలు వినకుండా సినిమా చేశాను. వారి మాటలు విని ఉంటే ఓ మంచి సినిమాను మిస్ అయి ఉండేదాన్ని.

**ఈ సినిమా షూటింగ్ సమయంలో మరిచిపోలేని అనుభూతి?**

కేరళ ఒక్కటే ప్రకృతి అందాలకు పుట్టిల్లు అనే కొద్దిపాటి గర్వం నాలో ఉండేది. కానీ ఈ సినిమా షూటింగ్‌ను సహజత్వం కోసం తెలుగు రాష్ట్రాల్లో చేశారు. ఇక్కడి అందాలు చూసి మైమరిచిపోయాను. కేరళ అందాల కన్నా రెట్టింపు అందాలు ఇక్కడ ఉన్నాయి.

**కొత్త దర్శకుడితో చేయడం ఎలా అనిపించింది?**

శివరాజ్ గారు కొత్త దర్శకుడు అని ఎక్కడా ఎప్పుడూ అనిపించలేదు. కథ ఎలా చెప్పారో సినిమా కూడా అలాగే తీశారు.

**దయ్యం సినిమాలే ఎక్కువ చేసినట్టున్నారు?**

చేసింది రెండు సినిమాలే! దయ్యాలంటే నాకు చాలా భయం. షూటింగ్ సమయంలో ఏం తెలియ లేదు కానీ, వాటిని నేరుగా థియేటర్లో చూడాలంటే భయం వేసేది. టీవీలో వచ్చినప్పుడు చూశాను. అప్పటికీ భయం వేసింది. ఆ సినిమాలు చేసింది నేనేనా? అనిపించింది కూడా!

**కొన్ని సినిమాల గురించి మీ బ్రదర్‌తో గొడవ పడ్డారట నిజమేనా?**

గొడవ కాదు. కొంత డిస్కషన్ జరిగింది. నేను సంప్రదాయ ముస్లిం కుటుంబం నుంచి వచ్చాను. దాంతో ముద్దు సీన్లు ఇతర అభ్యంతరకర సీన్లు చేయవద్దని మా బ్రదర్ నాకు చెప్పారు. ఇది కూడా నేను సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో జరిగింది. ఆ తరువాత సినిమాల్లో ఇవన్నీ కామన్ అన్న సంగతి వారికి అర్థమైంది. ఇప్పుడు ఏమీ అనరు. కానీ అలాంటి సీన్లు కుటుంబంతో కలిసి చూడాలంటే నాకే ఇబ్బంది. థియేటర్లో సినిమా చూసేటప్పుడు అలాంటి సీన్లు వస్తే బయటకి వెళ్ళిపోతాను.

**మళ్ళీ ఐటెంసాంగ్ చేసే ఆలోచన ఉందా?**

'శ్రీమంతుడు'లో చేసింది ఐటెంసాంగ్ కాదు. సంప్రదాయబద్ధంగా ఉంటుంది ఆ పాట. మాస్ మసాలా పాటలు నేను చేస్తే బావుండదు. ఆ సినిమాలో చేసిన పాటలాంటి అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**డ్యాన్స్ స్కూల్ పెడతానన్నారు కదా? ఎంత వరకూ వచ్చింది?**

ఆ ఆలోచన ఉంది. నా ఆరోయేట నుంచి డ్యాన్స్ నేర్చుకున్నాను. కూచిపూడి, భరతనాట్యం బాగా వచ్చు. అందుకే ఓ డ్యాన్స్ స్కూల్ ఏర్పాటు చేసి పిల్లలకు నేర్పాలని అనుకున్నాను. దానికి ఇంకా టైం పడుతుంది.

**నృత్య ప్రధాన పాత్రలు చేసే ఆలోచన ఉందా?**

అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**గ్లామర్ హీరోయిన్‌గా పేరు తెచ్చుకునే ఆలోచన లేనట్టుంది?**

ఆ పేరుకి నేను సరిపోనేమో! దానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి నేను సంప్రదాయ కుటుంబం నుంచి వచ్చాను. అందువలన ఎక్స్‌పోజింగ్ చేయడం కుదరదు. ఇదే కాకుండా మోడ్రన్ డ్రస్సులు నాకు అస్సలు సూటు కావు. చీరలోనే అందంగా ఉంటాను. అందుకేనేమో నా మీద గ్లామర్ హీరోయిన్ అన్న ముద్ర పడలేదు.

**తెలుగులో సినిమాలు అంగీకరించారా?**

లేదు. 'జయమ్ము నిశ్చయమ్మురా' తరువాత చాలా మంది అప్రోచ్ అయ్యారు. కథలు అయితే వింటున్నాను కానీ ఎవరికీ ఓకే చెప్పలేదు.

**పెళ్ళెప్పుడు?**

మా ఇంట్లో నేనే ఆఖరుదాన్ని. అందరి పెళ్ళిళ్ళు అయిపోయాయి. అందరూ పేరెంట్స్ చూసిన వారినే చేసుకున్నారు. నేను కూడా అంతే!

-భరత్ కుమార్



| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

